# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 7 సంచిక : 5 హైదరాబాద్ 94 మే 2009 పేజీలు : 64 రు. 10

- ఫోకస్ : నలభై ఏళ్ల ప్రత్యేక తెలంగాణ నాలుగు వ్యాసాలు
- ఎన్నికలు జరిగిన తీరు
- ప్రపంచ వాణిజ్య సంస్థ - ఆహార భద్రత
- ఎస్.సి. రిజర్వేషన్‌ల వర్గీకరణ
- బినాయక్ సేన్ నిర్బంధం
- ప్రపంచ ఆర్థిక మాంద్యం

# త్వరలో వెలువడనున్న వీక్షణం ప్రచురణలు

వ్యవసాయం, పరిశ్రమలు, సేవారంగం, ఆర్థిక వ్యవహారాలు, ఉపాధి, పాలన,
ప్రాంతీయ అసమానతలు, ప్రజా ఉద్యమాలు, తదితర అంశాలపై

## మీరు - నేను - ఆర్థికం

మీరు నేను ఆర్థికం

## వి. హనుమంతరావు

### వ్యాసాల సంకలనం



సామాజిక అధ్యయనం ఎలా చేయాలి? గ్రామీణ ప్రాంతాల పరిశీలనలో ముఖ్యమైన అంశాలేమిటి?
సాహిత్యం ద్వారా సమాజ పరిణామాలను గుర్తించడం ఎట్లా? వంటి అనేక మౌలిక అంశాలపై
లోతయిన ఆలోచనలను రేకెత్తించే

## ముదునూరి భారతి

### వ్యాసాల సంకలనం



భారత రాజకీయార్థిక పరిణామాలు, ప్రణాళికలు, ప్రజల చరిత్ర, ప్రజా ఉద్యమాలు మొదలయిన
అనేక కోణాలలో తాత్విక ప్రశ్నలు సంధించి, కొత్త ఆలోచనలు రగిలించే

## ఆర్.ఎస్. రావు

### వ్యాసాల సంకలనం



110 ఏళ్ల అమెరికా దురాక్రమణల చరిత్ర
**స్టీఫెన్ కింజెర్** రచన 'ఓవర్ త్రో' కు **కొణతం దిలీప్** తెలుగు అనువాదం

## కుట్రాజకీయం

వీక్షణం 94
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

మే 2009
సంపుటి : 7
సంచిక : 5



**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com

**డిస్ట్రిబ్యూటర్స్**
**ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.**
ఫోన్ : 98484 28516
98482 49695

**ప్రింటర్స్**
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

**సంపాదకీయం**

# ఎన్నికలు ఏం చెపుతున్నాయి?

మన రాష్ట్రంలో ఎన్నికలు జరిగిన తీరే మన సమాజంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఎంత అస్తవ్యస్తంగా, బూటకంగా, హాస్యాస్పదంగా అమలవుతున్నదో చూపుతున్నది. ఎన్నికలలో ప్రజాభిమతం వ్యక్తమవుతుందనీ, నిజంగా ప్రజలు తమ ప్రతినిధులను ఎన్నుకుని చట్టసభలకు పంపుతారనీ, అలా ఎన్నుకునే విషయంలో ప్రజలకు సంపూర్ణమైన స్వేచ్ఛాయుతమైన నిర్ణయాధికారం ఉన్నదనీ నమ్మే అమాయకులు ఎవరయినా ఉంటే ప్రస్తుత ఎన్నికలు ఆ నమ్మకాలన్నిటినీ పటాపంచలు చేస్తాయి. గత ఎన్నికలతో పోలిస్తే హింస తక్కువ జరిగిందనీ, ఎక్కువమంది తమ ఓటు హక్కును వినియోగించుకున్నారనీ, మహిళలు, యువత చాలా ఉత్సాహంగా తమ ఓట్లు వేశారనీ, ఎన్నికల నిర్వహణలో ఎన్నికల కమిషన్ చాల సమర్థంగా పనిచేసిందనీ, పోలీసు వ్యవస్థ ఈ సారి ఎన్నికల అక్రమాలు జరగకుండా చాల పటిష్టమైన చర్యలు తీసుకుందనీ, మొత్తంగా ఎన్నికల నిర్వహణలో ప్రజాస్వామ్యం సాధించిన పరిణతి కనబడుతున్నదనీ అనేక అభిప్రాయాలు ప్రచార సాధనాలలో వ్యక్తమవుతున్నాయి. విశ్లేషణలు సాగుతున్నాయి. నిజానికి ఈ అభిప్రాయాలన్నీ అసత్యాలు కావు గాని అర్ధసత్యాలో, నాణానికి ఒకవైపు ముఖాలో మాత్రమే. అసమ సమాజంలో పాలక, ఆధిపత్యవర్గాల అధికారానికి సాధికారత కల్పించడం కోసం, ఒక ప్రదర్శనా వస్తువుగానే ఎన్నికలు జరుగుతాయనే సూత్రీకరణను నిజం చేసేలా మాత్రమే ఈ ఎన్నికలు ఉన్నాయి. ఈసారి ఎన్నికలలో హింస జరగలేదని అంటున్నారంటే, ఆ వ్యాఖ్యాతలు హింసకు ఇచ్చే నిర్వచనం ఏమిటని ఆలోచించాలి. హింస అంటే మానవప్రాణ నష్టం మాత్రమే అనుకుంటే హింస జరగలేదు. కాని రెండు మూడు నెలలుగా ఒకరి మీద ఒకరు చేసుకున్న వ్యాఖ్యలు, తిట్లు, దుర్భాషలు, నిందలు, ఆరోపణలు, ప్రత్యారోపణల దగ్గర మొదలుపెట్టి, ఎన్నికల రోజున ఎలక్ట్రానిక్ ఓటింగ్ యంత్రాల ధ్వంసం, ప్రత్యర్థి ఏజెంట్ల మీద దాడుల నుంచి, ఎన్నికల అనంతరం సాగుతున్న దాడులు, గృహ దహనాలు, ఆస్తి దహనాల దాకా చూస్తే ఈసారి హింసారూపాలు పెరగడం, హింస జరిగిన ప్రాంతాలు పెరగడం కనబడుతుంది. ఈ హింసలో ఏ ఒక్క రాజకీయ పక్షానికీ మినహాయింపు కూడా లేదు. ఇక పెరిగిన ఓటర్ల సంఖ్యతో పోల్చి చూస్తే పోలయిన ఓట్ల శాతం ఎక్కువేమీ కాదు. అధికార యంత్రాంగపు పనితీరు, డబ్బు, కులం ప్రాధాన్యత వంటి అంశాలు చూస్తే, ఎన్నికల ప్రజాస్వామ్యం పరిణతి సాధించలేదని స్పష్టంగా కనబడుతుంది. అంతేకాదు, రాజకీయాలను పక్కా వ్యాపారంగా చూసి, రానున్న లాభాల, ఆదాయాల ఆశతో ప్రస్తుతం పెట్టుబడి పెట్టడం చాల పెద్ద ఎత్తున జరిగింది. ఒక్కో ఓటుకు ఐదువేల రూపాయల దాకా పంచారనీ, ఒక్కో శాసనసభ అభ్యర్థి కనిష్టంగా ఒక కోటి రూపాయలు, గరిష్టంగా పదికోట్ల రూపాయలు ఖర్చు పెట్టారనీ, ఇక లోక్‌సభ అభ్యర్థులయితే ఖర్చు ముప్పై కోట్ల నుంచి యాభై కోట్ల రూపాయలదాకా ఉందనీ వార్తలు వస్తున్నాయి. ఇటువంటి ఎన్నికల ప్రవర్తనను పరిణత ప్రజాస్వామ్యం అనదలచుకున్నవారి అమాయకత్వాన్ని చూసి జాలిపడడంకన్న చేయగలిగింది లేదు. ఎన్నికలు, ప్రజాస్వామ్యం, రాజకీయాలు మన సమాజంలో అత్యంత లాభసాటి వ్యాపారంగా మారిపోయాయని ప్రస్తుత ఎన్నికలు రుజువు చేస్తున్నాయి. ఇందులో ప్రజాప్రాతినిధ్యంగాని, ప్రజాసేవగాని, నిస్వార్థ సామాజిక సేవగాని ఏమీలేవు. ఐదు సంవత్సరాలలోనో, అంతకన్న తక్కువలోనో రాగల రాబడిని అంచనావేసుకుని, ఆ ఆదాయం పొందాలంటే ఇప్పుడు ఎంత పెట్టుబడి, ఏయే రూపాలలో పెట్టవలసి ఉంటుందో లెక్కలు వేసుకోవడమే ఇవాళ రాజకీయ నాయకులందరి మనసులో ఉన్న ఆలోచన తప్ప, వారికి ప్రజలతోనూ, ప్రజల సమస్యలతోనూ, శాసనకర్తలుగా ఆ సమస్యలు తీర్చేందుకు తాము చేయదగిన పనులతోనూ ఎటువంటి సంబంధమూ లేదు. ఒక్కమాటలో చెప్పాలంటే మన సమాజంలో రాజకీయాలు అనే పేరుతో ఉన్నవి రాజకీయాలుగా లేవు, వ్యాపారంగా ఉన్నాయి. ఆ వ్యాపారానికి నిర్ణీతకాలానికి లైసెన్సులు ఇచ్చే, కాంట్రాక్టర్లను నియమించే ప్రక్రియగా మాత్రమే ఎన్నికలు జరుగుతున్నాయి. ఎన్నికల లక్ష్యం ఇదే అయినప్పుడు అవి పరిణతితో జరిగాయా, అసమర్థంగా జరిగాయా అనే ప్రశ్నకు అర్థంలేదు. వీ

## ప్రాంతీయ విద్వేషాలు

**శా**సనసభ ఎన్నికల ప్రహసనంలో అత్యంత హింసాత్మకమైన ఘట్టం మొదటి విడత ఎన్నికలు ముగిసే సమయాన ముఖ్యమంత్రి నంద్యాలలో చేసిన ప్రాంతీయ విద్వేష ప్రకటన. సాధారణంగా భౌతిక ఘటనలను మాత్రమే హింసగా గుర్తించేవారికి ఈ మాటలలోని హింసను అర్థం చేసుకోవడం కష్టం కావచ్చు. అంతకు చాలముందు నుంచే ఆ మాటలు అంటున్నాననీ, ప్రత్యర్థులు అన్న మాటలనే తాను ఎత్తి చూపాననీ ఎన్ని సమర్థనలు చెప్పుకున్నా, ఆ మాటల్లో వ్యక్తమైనది రాష్ట్రంలోని మూడున్నర కోట్ల ప్రజల ఆకాంక్షల పట్ల అసహనం, వ్యతిరేకత. ఒక ప్రాంత ప్రజల ఆకాంక్షలకు వ్యతిరేకంగా మరొక ప్రాంతంలోని నాలుగున్నరకోట్ల మంది ప్రజలను రెచ్చగొట్టడానికి చేసిన ప్రయత్నం ఆమాటల్లో ఉంది. నిజానికి రాయలసీమ, కోస్తాంధ్ర సాధారణ ప్రజానీకానికి తెలంగాణ ప్రజానీకంతో వైరుధ్యమేమీలేదు. శత్రుత్వమేమీ ఉండనక్కరలేదు. తెలంగాణ ప్రజలు ఎటువంటి అభివృద్ధి రాహిత్యాన్ని, అస్తవ్యస్త పాలనను అనుభవిస్తున్నారో, అటువంటి అభివృద్ధి రాహిత్యాన్నే, అక్రమ పాలననే రాయలసీమ, పల్నాడు, ఉత్తరాంధ్ర ప్రజలు కూడ అనుభవిస్తున్నారు. ఆ మాటకు వస్తే 'అభివృద్ధి' చెందిన ప్రాంతమైన కోస్తాలో కూడ ప్రజల స్థితిలో ఏమంత భిన్నత్వం లేదు. గత ఐదు దశాబ్దాలుగా రాష్ట్ర రాజకీయార్థిక వ్యవస్థను శాసిస్తున్న పిడికెడు మంది ప్రయోజనాలు మాత్రమే తీరుతున్నాయి. ఆ ప్రయోజనాల కొరకే ప్రాంతీయ విద్వేషాలు రెచ్చగొట్టడం గతంలోనూ జరిగింది. ఇప్పుడు కూడా జరుగుతోంది. దాహార్తితో ఉన్న రాయలసీమకు తప్పనిసరిగా నీళ్లు అందించవలసిందే. ప్రత్యామ్నాయ అవకాశాలన్నిటినీ అన్వేషించవలసిందే. కాని తెలంగాణ ప్రజల నోటిముందరి నీళ్లను లాగి రాయలసీమకు ఇస్తాననడం, అలా ఇస్తానంటే తెలంగాణ ప్రజలు నిరసన తెలుపుతున్నారని రాయలసీమ ప్రజలను రెచ్చగొట్టడం ప్రజల మధ్య ఘర్షణ సృష్టించి తమ పబ్బం గడుపుకోవడానికే తప్ప అటువైపు ప్రజల మీద ప్రేమతో కూడా కాదు. హైదరాబాద్‌లో విదేశీయులమవుతామని రెచ్చగొట్టడం కూడ భారత రాజ్యాంగం ప్రకారం వాస్తవమూ కాదు, పొట్ట చేతపట్టుకుని వచ్చినవాళ్లను వెళ్లగొడతామని తెలంగాణ ప్రత్యేక రాష్ట్రవాదులు కూడా ఎన్నడూ అనలేదు. ప్రజలు తెలంగాణలోనయినా, రాయలసీమలోనయినా, కోస్తాంధ్రలోనయినా అటూ ఇటూగా ఒకే సమస్యతో బాధపడుతున్నారు. పాలకుల ఉద్దేశ్యపూర్వక విధానాల వల్ల కొన్ని ప్రాంతాల ప్రజలకు అందవలసిన న్యాయమైన హక్కులు అందకపోతుండవచ్చు. అందువల్ల మిగిలిన ప్రజలకు అదనంగా దొరుకుతున్నదేమీలేదు. అన్ని ప్రాంతాలకు చెందిన ప్రజలకు ఉమ్మడి కష్టాలు ఉన్నట్టుగానే, అన్ని ప్రాంతాలకు చెందిన సంపన్నులు, నాయకులు, దళారీలు కోట్లకు పడగెత్తి సకల సౌకర్యాలు అనుభవిస్తున్నారు. తమ దుర్మార్గాన్ని ప్రజలు గుర్తించకుండా చూడడానికే ప్రజల మధ్య ప్రాంతీయ విద్వేషాలు రెచ్చగొడుతున్నారు. పాలకుల ఈ కుటిలయత్నాన్ని తిప్పికొట్టి ఐక్యతను ప్రదర్శించి, అదే సమయంలో ఇంతకాలం అన్యాయానికి గురయిన ప్రాంతాల ప్రయోజనాల కొరకు పోరాడడం అందరి బాధ్యత.

## ప్రత్యామ్నాయ రాజకీయాలు

**వ**లసానంతర భారత సమాజంలో తొలిసారిగా ప్రజా రాజకీయాలను, ప్రత్యామ్నాయ రాజకీయాలను ప్రవేశపెట్టిన నక్సల్బరీ ప్రయోగం సంఘటిత నిర్మాణరూపం పొంది నలభై ఏళ్లు గడిచాయి. ఒకదేశ రాజకీయ చరిత్రలో నలభై సంవత్సరాలు మరీ ఎక్కువ కాలం కాకపోవచ్చు. గాని, మనిషి జీవితంలో అది గణనీయమైన భాగమే. వలసపాలన ముగిసిన ఇరవై సంవత్సరాల తర్వాత, కొనసాగుతున్న రాజకీయార్థిక ధర్మంతో, వ్యవస్థతో అసంతృప్తి చెందిన ఒకతరం ప్రజలు, నక్సల్బరీ అనే ప్రజా ప్రత్యామ్నాయాన్ని, కింది నుంచి రాజకీయ ప్రక్రియను ప్రారంభించారు. ఆ తరం గడిచి, మరొకతరం గడవబోతున్నప్పటికీ, ఆ ప్రత్యామ్నాయ ప్రయత్నం విస్తృతం కాకపోవడానికి కారణాలేమిటో అన్వేషించవలసిన సందర్భం ఇది. తప్పనిసరిగా ఆ మార్గం అపూర్వమైన త్యాగ సంప్రదాయాన్ని నెలకొల్పింది. రాజకీయాలంటే స్వార్థం అనే అర్థం స్థిరపడినచోట, ప్రజల కోసం, సమాజం కోసం నిస్వార్థంగా ప్రాణాలు త్యాగం చేయడానికి కూడా సిద్ధపడే స్వభావాన్ని అభివృద్ధి చేసింది. దేశవ్యాప్తంగా విస్తరిస్తూ, కోట్లాదిమందిని సమీకరించింది. రాజకీయాలలో, ఆర్థికాభివృద్ధి నమూనాలో, సాంస్కృతిక జీవనంలో, సామాజిక వ్యవస్థలో ప్రస్తుతం కొనసాగుతున్న ఆధిపత్యవర్గాలను కూలదోయవచ్చుననీ, ప్రజల ప్రత్యామ్నాయాన్ని నిర్మించవచ్చుననీ ఆశలు కల్పించింది. ఆ ప్రయత్నం మీద పాలకవర్గాలు సాగించిన దారుణ దమననీతి చరిత్రలో కనీవినీ ఎరగనిది. అంతటి నిర్బంధాన్ని కూడ అధిగమిస్తూ ఆ ప్రత్యామ్నాయ ప్రయత్నం నిరంతరాయంగా సాగుతూనే ఉంది. కాని విజయదిశగా పురోగమిస్తున్నదా, నిజంగా ప్రజాప్రత్యామ్నాయ రాజ్యాధికారాన్ని స్థాపించగలదా నిస్సందేహంగా చెప్పగలస్థితి లేదు. ఆ ప్రయోగం పురోగమించడానికి ఇంకా ఏమి చేయవలసి ఉన్నదో, అవరోధాలు ఎక్కడెక్కడ ఉన్నాయో, వాటిని తొలగించుకోవడం ఎట్లాగో, గతంలోని ఏ పొరపాట్లు వర్తమానానికీ, భవిష్యత్తుకూ ఆటంకాలుగా మారుతున్నాయో లోతుగా సమీక్షించుకోవలసి ఉంది. ఆ ప్రజా ప్రత్యామ్నాయ ప్రయోగం, ఆయుధాలకన్న, ఇతర సాధన సంపత్తికన్న ఎక్కువగా ప్రజల ఇతోధిక క్రియాశీల భాగస్వామ్యంతో మాత్రమే విజయం సాధించగలుగుతుంది. జ్ఞానసముపార్జనకు దగ్గరి దారులేమీ లేవని, అది కష్టభరితమైన, కంటకావృతమైన, విసుగెత్తించే మార్గమని కాపిటల్ ముందుమాటలో మార్క్స్ అన్నమాట ప్రజా రాజ్యాధికార సాధనకు ఇంకా ఎక్కువ వర్తిస్తుంది.

## శ్రీలంక దారుణ మారణకాండ

**శ్రీ**లంక నుంచి భయపడుతున్న దుర్వార్త రానే వచ్చింది. ఎల్.టి.టి.ఇ. చిట్టచివరి స్థావరాన్ని కూడ సైనిక బలగాలు పట్టుకున్నాయి. ఎల్.టి.టి.ఇ. ఎన్ని తప్పులు చేసినా, తమిళ ప్రజలను కడగండ్ల నుంచి రక్షిస్తూ పాలకవర్గాలకు ఒక బెదురుగానైనా ఇన్ని సంవత్సరాలు నిలబడింది. ఇప్పుడిక ఆ ఒక్క ఆధారమూ లేకుండా పోయింతర్వాత తమిళ ప్రజల జీవితం శ్రీలంక సైనిక బలగాల చేతిలో, సింహళ జాత్యంహంకార పాలకవర్గాల చేతిలో మరింత దుర్భరంగా మారిపోతుంది. విజయం సాధించినా సాధించలేకపోయినా, కనీసం ప్రజలమీద ఇష్టారాజ్యంగా దుర్మార్గాలను చేస్తే వాళ్లు ఊరుకోరు అనే భయాన్ని పాలకులలో నిలిపి ఉంచడానికయినా పోరాటకారులు ఉండాలి. పాలకులకు ఆ విషయం తెలుసు గనుకనే ప్రజలమీద దాడికన్న ముందే, ప్రజల పక్షాన నిలబడే పోరాటకారులను నిర్మూలించడం మీద ఎక్కువ శ్రద్ధపెడతారు. ఇరవై ఐదు సంవత్సరాలుగా అలా శ్రీలంక పాలకవర్గాలకు సింహస్వప్నంగా ఉండిన టైగర్లు ఈ చివరిపోరులో అంతమైపోతుండవచ్చు. కాని వాళ్లు ఓడిపోయినా తమిళ ప్రజలు ఉంటారు. సింహళ జాత్యహంకార పాలకవర్గాల చేతిలో వారు పడే ఇబ్బందులు ఉంటాయి. ఆ అవమానం, దౌర్జన్యం, హింస, ఆధిపత్యం ఏదో ఒక ప్రతిస్పందనకు దారితీస్తాయి. పాలకవర్గ హింస మరింత తీవ్రమైన ప్రతిఘటనకు పురికొల్పుతుంది. టైగర్లనో, మరొక పోరాటకారులనో జాఫ్నానుంచీ, కిల్లినోచ్చి నుంచీ, ముల్లైతీవు నుంచీ ఖాళీ చేయవచ్చు గానీ, కష్టభరితమైన బతుకునీడుస్తున్న ప్రజల హృదయాలలో పోరాటకారుల స్థావరాన్ని ఖాళీ చేయించడం అసాధ్యం. వీ

# లోపలి పేజీల్లో...




## ఫోకస్ : నలభై సంవత్సరాల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం

**1969** తెలంగాణ ఉద్యమం బలమైన ప్రజాస్వామిక ఆకాంక్ష ఫలితంగా తలెత్తింది. ఆంధ్ర సంపన్న వర్గాల అవసరాల కొరకు ప్రభుత్వం విపరీతమైన హింసను ప్రయోగించి అణచివేయాలని చూసింది. కానీ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ స్వరూప, స్వభావాలు మారకుండా ఆ ఉద్యమం ఆగిపోదని చరిత్ర రుజువు చేసింది. ఈ చారిత్రక వాస్తవాన్ని గ్రహిస్తే వామపక్ష పార్టీలు, ప్రజాస్వామికవాదులు ఒక పాత్ర నిర్వహించగలరు. ఇప్పటికీ పునరాలోచనకు అవకాశం ఉన్నది.


| | | |
|---|---|---|
| ✦ నలభై ఏళ్ల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం | - వరవరరావు | 24 |
| ✦ ప్రత్యేక తెలంగాణ ఉద్యమం - ఒక పరిశీలన | - ఆకుల భూమయ్య | 29 |
| ✦ తెలంగాణ ఉద్యమాన్ని ఎట్లా చూడాలి? | - ఎం. కోదండరామ్ | 33 |
| ✦ 'ప్రత్యేక తెలంగాణ'కు నలభై ఏళ్లు | - ఎన్. వేణుగోపాల్ | 35 |

| | | | |
|---|---|---|---|
| ❖ కొత్త పుస్తకాలు / సి.డి.లు | | | 6 |
| ❖ పాఠకుల వీక్షణం | | | 7 |
| ❖ ప్రాంతీయం | | | 8 |
| ❖ వర్తమానం | రాష్ట్రంలో ఎన్నికలు ఎలా జరిగాయి? | - రాజవరం పార్థసారథి | 9 |
| ❖ ఎన్నికలు - వ్యాఖ్య | చీడపట్టిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం | - వి. హనుమంతరావు | 11 |
| ❖ సంస్మరణ | బొర్రా వెంకటేశ్వర్లు | | 13 |
| ❖ సామాజిక న్యాయం | రిజర్వేషన్‌ల వర్గీకరణ - ప్రభుత్వాల మోసపూరిత వైఖరి | - ఎం. శ్రీనివాస్ | 14 |
| ❖ ఆర్థికరంగం | ప్రపంచ ఆర్థిక మాంద్యం | - కె. నరేంద్రమోహన్ | 20 |
| ❖ రాజ్యహింస | కొనసాగుతున్న బినాయక్ సేన్ నిర్బంధం | - డి.వి. రామకృష్ణారావు | 22 |
| ❖ ఆకాంక్ష-అవకాశవాదం | అవును, తెలంగాణలో మీరు విదేశీయులే! | - పిట్టల రవీందర్ | 40 |
| ❖ పరిశీలన | స్త్రీలపై జరుగుతున్న హత్యలు - అత్యాచారాలు | - సంకినేని వెంకటయ్య, సంకినేని మంజుల | 42 |
| ❖ విధానవిమర్శ | ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందాలు - ఆహార భద్రత | - కె. అనురాధ | 44 |
| ❖ దళిత సాహిత్యం - చర్చ | మాదిగ సాహిత్యం : తెలుగు సాహితీ ఫలకంపై కొత్త దరువు | - సాంబయ్య గుండిమెడ | 46 |
| ❖ పరిశీలన | భూంపల్లి దాసరుల బతుకులు | - తిరునగరి మనోహరస్వామి, తాళ్లపల్లి సదయ్య, ఎం. రాజేందర్‌రెడ్డి | 49 |
| ❖ శాస్త్రవిజ్ఞానం | హిమయుగాలు, చరిత్ర | - డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 50 |
| ❖ నేర్చుకుందాం | సామాజిక మార్పును విశ్లేషించడం ఎలా? | - కృష్ణా భరద్వాజ్ | 52 |
| ❖ సంస్థాగతం | వీక్షణం రచయితల సమావేశం | | 56 |
| ❖ పుస్తక సమీక్ష | 'భాష-సంస్కృతి-సమాజ దర్శనం' | - వి. చలపతిరావు | 58 |
| ❖ దేశీయం | | | 59 |
| ❖ అంతర్దేశీయం | | | 60 |
| ❖ సంస్థాగతం | అసహజ మరణాల సూచి సేకర్తల సమావేశం | | 61 |
| ❖ అసహజ మరణాల సూచి | | - రాంకి, వై. రామచంద్రం | 62 |


'వీక్షణం'లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028



- **ఒరిస్సాలో హిందూ మతోన్మాదం** – (దళిత, ఆదివాసీ క్రైస్తవులపై హిందూత్వ దాడులు) దుడ్డు ప్రభాకర్ – కులనిర్మూలనా పోరాట సమితి ప్రచురణ – 88 పేజీలు, 1/8 డెమీ, రు.30, ప్రతులకు : దుడ్డు ప్రభాకర్, ఓం విహార్‌కాలనీ, ఫ్లాట్ నెం. 30, మేడిపల్లి, ఉప్పల్ డిపో దగ్గర, రంగారెడ్డి జిల్లా, సెల్ : 9959567818; దిశ, సహచర, సమాంతర (హైదరాబాద్), నవోదయ (విజయవాడ), మణి బుక్‌స్టాల్ (నెల్లూరు)

- **స్త్రీవాద రాజకీయాలు వర్తమాన చర్చలు** – సంపాదకులు : రమ మెల్కోటె, కె. సజయ – అన్వేషి రిసెర్చ్ సెంటర్ ఫర్ ఉమెన్స్ స్టడీస్ ప్రచురణ – 367 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : అన్వేషి రిసెర్చ్ సెంటర్ ఫర్ ఉమెన్స్ స్టడీస్, 2–2–18/49, దుర్గాబాయి దేశ్‌ముఖ్ కాలనీ, బాగ్‌అంబర్‌పేట్, హైదరాబాద్ – 500 013, ఫోన్ : 040 – 27407431, 27423690, టెలిఫాక్స్: 27423168

- **చిగురు** – గోపగాని రవీందర్ – శ్రీ ప్రచురణ – 66 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : రమణ శ్రీ, ఇ.నెం. 9–76/2, గుస్సడిగుట్ట, ఉట్నూర్, ఆదిలాబాద్ – 504 311 సెల్ : 93940 53472; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో

- **తెలంగాణ సాహిత్య విమర్శ** – డా. యాకూబ్ – మాధ్యమం ప్రచురణలు – 33 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : 'సూఫీఘర్', 1–7–9/1/3, (కొత్త 1–7–28), రోడ్ నెం. 17, చైతన్యపురి, హైదరాబాద్ – 500 060. సెల్ : 98491 56588

- **కథ స్థానికత** – అఫ్సర్ – స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ – 108 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044

- **గుర్రం జాషువ** – కూర్పు: బి. భాస్కర చౌదరి – ద్రావిడ విశ్వవిద్యాలయం ప్రచురణ – 144 పేజీలు, 1/8 డెమీ, రు. 50

- **నైలు నుంచి కృష్ణ దాకా** – డా. జి.వి.పూర్ణచంద్ – ద్రావిడ విశ్వవిద్యాలయం ప్రచురణ – 146 పేజీలు, 1/8 డెమీ, రు. 100

  పై రెండు పుస్తకాల ప్రతులకు : ది రిజిస్ట్రార్, ద్రావిడ విశ్వవిద్యాలయం, శ్రీనివాసవనం, కుప్పం – 517 425

- **కొత్త బంగారు లోకం** – కథలు – అనిసెట్టి శ్రీధర్ – 152 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : అనిసెట్టి శ్రీధర్, సీనియర్ మేనేజర్, ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్, ఆంధ్ర లయోలా కాలేజ్ బ్రాంచ్, విజయవాడ – 520 008, సెల్ : 98660 97518; నవోదయ పబ్లిషర్స్, నవోదయ బుక్‌హౌస్, విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్

- **ఎగిలివారంగ** – కవిత్వం – పొన్నాల బాలయ్య – మోయుతుమ్మెద ప్రచురణలు – 89 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, విశాలాంధ్ర బుక్‌హౌస్

- **ప్రజాసాహితి** – సాహిత్య సాంస్కృతికోద్యమ మాసపత్రిక – ప్రజాకవి సుంకర శతజయంతి ప్రత్యేక సంచిక – 144 పేజీలు, 1/4 క్రౌన్, రు. 40, ప్రతులకు : మైత్రీ బుక్ హౌస్, జలీల్ వీధి, అరండల్‌పేట్, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ – 2



'వీక్షణం' మార్చ్ సంచిక చూసాను. రాజకీయ, ఆర్థిక సామాజిక మాస పత్రికగా ప్రజలలో గుర్తింపు పొందినది. ప్రత్యేకంగా ఏదో ఒక భావజాలానికి కమిట్ కాకుండా గొప్ప ఆలోచనలను గౌరవించే ఏ పత్రిక అయినా రాణిస్తుంది. డా. లోహియా లోకవ్యవహార సిద్ధుడు. డిస్సెంట్ ఈజ్ రేర్ అండ్ వీక్ ఇన్ అవర్ సొసైటీ. ఈనాడు ప్రజలలో కొంతవరకైనా నిరసనను వ్యక్తం చేయగలుగుతున్నారు. మూడు వ్యాసాలు బాగున్నాయి. మంచి వ్యాసాలు అందించినందుకు కృతజ్ఞతలు. ఈరోజు మేధావులు ఏదో ఒక భావజాలానికి నిబద్ధులు కాకపోతే గుర్తింపు ఉండదని భావిస్తున్నారు. చేనేత మీద జ్వాలా నరసింహం గారి వ్యాసం బాగానే ఉంది. చేనేత మీద ప్రభుత్వం శీతకన్ను వేసింది. నేతన్నకు భవిత లేదు.

**– శివలింగం**
చల్లపల్లి, కృష్ణా జిల్లా

ఏప్రిల్ సంచికలో మణిపూర్ గురించిన వ్యాసం చాలా బావుంది. ఈశాన్య రాష్ట్రాల్లో మన ప్రభుత్వం సాగిస్తున్న అనేక దశాబ్దాల దమనకాండ గురించిన వివరాలు అనువాదం రూపంలోనైనా వరుసగా వ్యాసాలుగా వేస్తే బావుంటుంది.

**– రోహిణీప్రసాద్**
అట్లాంటా, యు.ఎస్.ఎ.

మీరు నిర్వహిస్తున్న పత్రిక రాజకీయ, సామాజిక పరిస్థితులను సమగ్రంగా విశ్లేషించడంతో పత్రిక చాలా సరైన భూమిక నిర్వహిస్తున్నది.

**– గోపన్న**
సెంట్రల్ ప్రిజన్, చెర్లపల్లి

'వీక్షణం' ఎటువంటి పరిస్థితులలోను ఆగిపోవడానికి వీలులేదు. అందరం తలా ఒక చెయ్యివేసి కాపాడుకుందాం. నా వంతుగా మూడు సంవత్సరాల చందా చెల్లిస్తున్నాను.

**– ఉప్పల గోపాలరావు**
హైదరాబాద్

పత్రిక చాలా ఉపయోగకరంగా ఉంటున్నది. ఎన్నో వ్యాసాలు ఉద్యమక్రమంలో అవసరమయిన సమాచారాన్ని, దృక్పథాన్ని అందిస్తున్నాయి. అన్నిటికన్న ముఖ్యంగా పత్రిక ఏ నెలది ఆ నెల మొదటి తారీఖు కల్లా మా చేతిలో ఉంటున్నది. ఇలాగే కొనసాగించండి.

**– పి. జయ**
అచ్చంపేట, మహబూబ్‌నగర్

నేను చాలా ఆసక్తితో చదివే పత్రికలలో 'వీక్షణం' ఒకటి. ప్రతి సంచికలోనూ నేను శ్రద్ధతో చదవవలసిన వ్యాసాలు ఉంటున్నాయి. తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ కి సమానంగా వస్తున్న ఈ పత్రికను క్రమం తప్పకుండా తీసుకురండి. నావంతు సహాయం అందిస్తాను.

**– డా. ఎన్. భాస్కరరావు**
న్యూ ఢిల్లీ

'వీక్షణం' ఏప్రిల్ 2009 సంచికలో డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్ గారు రాసిన 'చరిత్ర విజ్ఞానశాస్త్రమా?' వ్యాసంలో ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలు సరియైనవి కావు. 'హిస్టరీకి మూలకారణం జాగ్రఫీ'. 'జనాభా పెరిగి అంతకంతకూ పరిమితమైపోతున్న వనరుల కోసం యుద్ధాలు జరుగుతుండేవి'. 'అలెగ్జాండర్, చెంఘిజ్‌ఖాన్, నెపోలియన్, హిట్లర్ తదితరుల సాహసం, స్వభావం, శక్తి సామర్థ్యాలు మొదలైనవి చరిత్రను తీవ్రంగా ప్రభావితం చేసిన మాట నిజమే.' ఈ అభిప్రాయాలు ఊరికే ఏర్పడినవి కావు. ఇవి అధికార సైన్స్‌కు సంబంధించిన భావాలు. వర్గ సమాజంలో విజ్ఞానశాస్త్రం కూడా అధికార స్వభావానికి లోనవుతుంది. ప్రధానమైన కారణాలను మరుగుపరుస్తుంది. ఈ తరానికి రోహిణీప్రసాద్ గారు ముందుకు తీసుకువచ్చిన వాదనలు కొత్తగా కనపడవచ్చుగానీ, దశాబ్దాల కిందట ఈ వాదనలను శాస్త్రీయ దృక్పథంతో ఖండించారు. జనాభా, యుద్ధాలకు సంబంధించిన మాల్థస్ సిద్ధాంతాన్ని కూడా తిరస్కరించారు. ప్రజలే చరిత్ర నిర్మాతలు. వ్యక్తుల పాత్ర కీలకమైంది కాదనేది చరిత్రనే నిరూపించింది. చరిత్ర విజ్ఞాన శాస్త్రంగా రూపొందింది. చారిత్రక భౌతికవాదం వల్లనే ఇది సాధ్యపడింది. చారిత్రక భౌతికవాద దృక్పథంతోనే సమాజం ముందు ముందు ఏ విధానానికి వెళ్లగలదో ఏ దిశలో ప్రయాణించగలదో స్పష్టంగా చెప్పగలం.

**– ఎస్. నర్సింగరావు**
ఎ.ఎస్.రావు నగర్, హైదరాబాద్

తెలుగులో మేధో వికాసానికి, చర్చకు అవకాశం ఇస్తున్న పత్రికలలో ఆశాజ్యోతిగా కనబడుతున్నది 'వీక్షణం' ఒక్కటే. అభినందనలు.

**– రావెల సోమయ్య**
హైదరాబాద్

'వీక్షణం' ఏప్రిల్ సంచికలో 'ప్రజాస్వామ్యమంటే ఎన్నికలు మాత్రమేనా?' వ్యాసం చాలా బాగుంది. ఎన్నో కొత్త ఆలోచనలను, వాదనలను ప్రేరేపించింది. ముఖ్యంగా బహుళ అస్తిత్వాల సమాజంలో ప్రాతినిధ్యం సాధ్యమేనా అనే చర్చ ఇంకా ఎక్కువగా జరగవలసి ఉంది.

**– బి. రామకృష్ణ**
హైదరాబాద్

'వీక్షణం' ఏప్రిల్ సంచికలో అచ్చువేసిన కృష్ణా భరద్వాజ్ గారి అనువాద వ్యాసం బాగుంది. కొన్ని మామూలు విషయాలే అయినా అక్కడక్కడ జ్ఞానాన్నిచ్చే పరిశీలనలు, సూత్రీకరణలు ఉన్నాయి.

**– పినాకపాణి**
కర్నూలు

'వీక్షణం' సంచిక ద్వారా 'స్విస్' బ్యాంకుల్లో భారతీయుల అక్రమ ఖాతాల గురించి ప్రచురించి దేశంలోని అన్నీ రాజకీయ పార్టీలకు, నాయకులకు చర్చనీయ అంశంగా మార్చినటువంటి 'వీక్షణం'ను ముందుగా అభినందిస్తున్నాను. భారతదేశంలోని జాతీయ పార్టీలు అన్నీ 'స్విస్' బ్యాంకుల్లోని సొమ్మును అంతా వెనక్కి రప్పిస్తామని, దాన్ని మన దేశ అభివృద్ధి కార్యక్రమాలకు వినియోగిస్తామని, ఎన్నికల సమయంలో ఎజెండాగా తీసికొని చర్చను కొనసాగిస్తున్నాయి. రాజకీయ పార్టీలకు, పాలకులకు నిజంగా చిత్తశుద్ధి ఉంటే ఈ అంశాన్ని ఎన్నికల 'ఎర'గా కాకుండా ప్రజల ఆశలకు, ఆశయాలకు అనుకూలంగా రాబోయే కాలంలో ఏపార్టీ అధికారంలోనికి వచ్చినా గాని, ప్రజల ఆస్తుల, భూముల, వనరుల దోపిడీ ద్వారా 'స్విస్' బ్యాంకులకు తరలించిన సుమారు 75 లక్షల కోట్ల రూపాయలను తిరిగి వెనక్కి రప్పించి దేశ సమగ్ర అభివృద్ధికి ఖర్చుపెట్టి పాలకుల నిజాయితీని నిరూపించు కునే అవసరం ఎంతైనా ఉంది. ముఖ్యంగా ఈ అక్రమార్జనకు మూలకారణాలను రూపుమాపి, అభివృద్ధి కార్యక్రమాలకు కేటాయించే నిధులు దుర్వినియోగం కాకుండా, వనరుల దోపిడీ జరగకుండా అరికట్టాలి. ఈ విషయంలో 'వీక్షణం' ముందు ముందు మరిన్ని విశ్లేషణాత్మక వ్యాసాలు అందించాలని ఆశిస్తున్నాను.

**– బోరెడ్డి మధుసూదన్**
సిద్ధిపేట, మెదక్

దార్ల వెంకటేశ్వరరావుగారి వెలువడని పుస్తకం 'దళిత సాహిత్యం – మాదిగ దృక్పథం' పాఠకులకు అందుబాటులోకి రాకముందే గుండిమెడ సాంబయ్య గారి వ్యాసాన్ని 'వీక్షణం'లో అచ్చువేయడం, ఆయన వ్యక్తిగత ప్రయాణ ఇబ్బందులు ఏకరువు పెట్టడం పాఠకులకు అనవసరం.

**– పి. వెంకటేశ్**
మహబూబ్‌నగర్

## మీకు నచ్చినట్లు చేసుకోండి

గనుల లీజుకోసం వచ్చిన పిటిషన్‌పై కోర్టు ధిక్కార నేరంగా పరిగణిస్తూ హైకోర్టు విచారణ చేపట్టింది. గనుల శాఖ ఉన్నతాధికారుల పనితీరు పై మార్చ్ 24న జస్టిస్ గోడ రఘురామ్ తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. ప్రభుత్వ పాలన అంటేనే తప్పించుకు తిరగడంలా ఉందన్నారు. 'కోర్టులు ఆదేశాలు జారీచేయడం, వాటిని మీరు ఉల్లంఘించడం, ఇవన్నీ ఎందుకు, మీరు నచ్చినట్లు చేసుకోండ'ని అన్నారు. న్యాయవ్యవస్థను రద్దు చేసేయండన్నారు. అప్పుడు ఏడు కోట్లమంది సచివాలయాన్ని ముట్టడిస్తారని, ఏ సైన్యం వచ్చి మిమ్మల్ని రక్షిస్తుందో చూద్దాం అని తీవ్రంగా వ్యాఖ్యానించారు.

## ఎన్నికల బరిలో ఎం.ఆర్.పి.ఎస్.

మహాకూటమి పిలుపుకోసం వేచి చూసి విసిగిపోయిన మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి (ఎం.ఆర్.పి.ఎస్.) ఒంటరిగా ఎన్నికల బరిలోకి దిగుతున్నట్లు ప్రకటించింది. 217 మంది అభ్యర్థుల తొలి జాబితాను మార్చ్ 27న విడుదల చేసింది. ప్రస్తుతం సామాజిక ఉద్యమ సంస్థగానే ఎన్నికల బరిలోకి దిగుతున్నామని, ఎన్నికలు అయ్యాక రాజకీయ పార్టీగా అవతరిస్తామని మందకృష్ణ మాదిగ ప్రకటించారు. మొత్తం 294 అసెంబ్లీ, 42 లోక్‌సభ సీట్లకు పోటీ చేయనున్నట్లు తెలిపారు.

## ఎట్టకేలకు మహాకూటమి

రాష్ట్రంలోని ఎన్నికల నామినేషన్‌ల చివరిరోజు మార్చ్ 30న పలు తర్జన భర్జనల తరువాత మహాకూటమి సీట్ల సర్దుబాటు కుదిరింది. తెలుగుదేశం పార్టీ – 221 అసెంబ్లీ స్థానాలకు, 29 లోక్‌సభ స్థానాలకు; తెలంగాణ రాష్ట్ర సమితి – 45 అసెంబ్లీ స్థానాలకు, 9 లోక్‌సభ స్థానాలకు; సిపిఎం – 14 అసెంబ్లీ స్థానాలకు, 02 లోక్‌సభ స్థానాలకు; సిపిఐ – 14 అసెంబ్లీ స్థానాలకు, 02 లోక్‌సభ స్థానాలకు పొత్తు ఖరారయింది.

## బాధితులపై కేసులా ? – సుప్రీంకోర్టు

బాపట్ల వ్యవసాయ వ్యవసాయ కళాశాల విద్యార్థిని త్రివేణి ర్యాగింగ్ కేసులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వ్యవహరించిన తీరుపై సుప్రీంకోర్టు అసంతృప్తి వ్యక్తంచేసింది. ఆత్మహత్యకు యత్నించిన త్రివేణి ర్యాగింగ్ కేసు దర్యాప్తు వివరాలతో వారం రోజుల్లో నివేదిక అందజేయాలని జస్టిస్ అరిజిత్ పసాయత్, జస్టిస్ ఎ.కె. గంగులీలతో కూడిన డివిజన్ బెంచ్ ఏప్రిల్ 2న విచారించిన మీదట కేసును ఏప్రిల్ 17కు వాయిదా వేసింది.

## ఎస్పీ నాగిరెడ్డిపై ఎన్నికల కమిషన్ వేటు

తూర్పు గోదావరి జిల్లా ఎస్పీ నాగిరెడ్డి చమురు దొంగలకు సహకరించడం, గతంలో అదనపు ఎస్పీగా పని చేసిన రంగనాథ్‌తో వివాదం, ముఖ్యమంత్రి తనయుడు జగన్‌మోహన్‌రెడ్డితో సాన్నిహిత్యం, ఒక సామాజికవర్గానికి చెందిన వారిపై వివక్ష లాంటి ఆరోపణలను ఎదుర్కొంటున్నారు. కాకినాడ రెంజ్ డిఐజి విచారణ జరిపి ఇచ్చిన నివేదికను గత డిజిపి ఎస్ఎస్‌పి యాదవ్ తొక్కిపెట్టారు. ఆ తర్వాత కూడా నాగిరెడ్డిపై ఫిర్యాదులు అందడంతో ఇసి ఆదేశాల మేరకు డిజిపి మహంతి ఈ ఉదంతం పై వివరమైన నివేదికను రాష్ట్ర ఎన్నికల ప్రధానాధికారికి అందించారు. ఆయన వెంటనే కేంద్ర ఎన్నికల సంఘానికి నివేదిక పంపారు. కేంద్ర ఎన్నికల సంఘం ఈ అంశాన్ని పరిశీలించి ఎస్పీని తక్షణం అక్కడి నుంచి తప్పించాలని సిఇఓని ఏప్రిల్ 4న ఆదేశించింది.

## ఎన్నికల్లో పెరుగుతున్న హింస

ఎన్నికల కమిషన్ మార్చ్ 2న ఎన్నికల షెడ్యూల్ ప్రకటించిన నాటి నుంచి రెండో విడత ఎన్నికలు పూర్తయ్యేనాటికి రాష్ట్ర వ్యాప్తంగా 989 హింసాత్మక సంఘటనలు చోటుచేసుకున్నాయి. వీటికి సంబంధించి ఇప్పటి వరకు 14660 కేసులు నమోదు అయ్యాయి. వివిధ పార్టీలకు చెందిన 400 మంది గాయపడ్డారు. పోలీసు దాడుల్లో లైసెన్స్‌లేని 19563 ఆయుధాలు లభించాయి. తొలి, మలివిడత పోలింగ్‌లకు సంబంధించి రు. 32,39,24,866 ల అనామతు నగదును పోలీసులు స్వాధీనం చేసుకున్నారు.

## పోలేపల్లి సెజ్ బాధితులు

రాజకీయపార్టీలు తమ ఎన్నికల మేనిఫెస్టోలో సెజ్‌లపై తమ విధానాన్ని ప్రకటించని కారణంగా సెజ్‌ల వలన భూములు కోల్పోయిన పోలేపల్లికి చెందిన 16 మంది నిర్వాసితులు మహబూబ్‌నగర్ పార్లమెంట్ స్థానానికి పోటీచేసేందుకు సిద్ధమయ్యారు. ఒక సమస్యపై ఇంత మంది బాధితులు ఎన్నికల్లో పోటీచేయడం జిల్లా ఎన్నికల చరిత్రలో ఇదే మొదటిసారి. రాజకీయ పార్టీలు తమకు న్యాయం చేయనందుకు నిరసనగానే ఎన్నికల బరిలో నిలబడాలని నిర్ణయించినట్లు బాధితులు తెలిపారు. జడ్చర్ల అసెంబ్లీ ఉప ఎన్నికలో కూడ పదమూడు మంది సెజ్ బాధితులు ఊహించని విధంగా పదమూడు వేల ఓట్లు సాధించారు.

## ఎన్నికల బరిలో...

రాష్ట్రంలోని ఎన్నికల నామినేషన్‌ల ఉపసంహరణ ప్రక్రియ ముగిసాక 294 అసెంబ్లీ స్థానాలకు 3656 మంది, 42 లోక్‌సభ స్థానాలకు 569 మంది బరిలో మిగిలారు. ప్రస్తుతం ఎన్నికలలో 5,77,65,733 మంది ఓటర్లు తమ ఓటు హక్కును వినియోగించుకోనున్నారని రాష్ట్ర ఎన్నికల ప్రధాన అధికారి ఐ.వి.సుబ్బారావు ఒక ప్రకటనలో తెలిపారు. రాష్ట్ర పోలీసు బలగాలతో పాటు, కేంద్ర బలగాలు 1,18,976 మంది ఎన్నికల విధుల్లో పాల్గొంటారని తెలిపారు.

## శాసనసభ ఎన్నికలలో కులాల ప్రాతినిధ్యం

రాష్ట్రంలోని శాసనసభ ఎన్నికలలో పాల్గొంటున్న ప్రధాన పార్టీల అభ్యర్థుల సీట్ల కేటాయింపు కులాలవారీగా పరిశీలిస్తే : కాంగ్రెస్ తరపున ఒసి లు–147; బిసి లు–69; ఎస్‌సి లు–48; ఎస్‌టి లు–19; మైనారిటీలు–11 మంది; మహాకూటమి తరపున ఒసి లు–145; బిసి లు–71; ఎస్‌సి లు–49; ఎస్‌టి లు–17; మైనారిటీలు–12 మంది; ప్రజారాజ్యం తరపున ఒసి లు–102; బిసిలు–104; ఎస్‌సి లు–50; ఎస్‌టి లు–23; మైనారిటీలు–15 మంది బరిలో ఉన్నారు. వీ

*ప్రజల కోసం జరిగిన ఎన్నికలలో, ప్రజలు పాల్గొన్న ఎన్నికలలో ప్రజా సమస్యలు ఎలా నిర్లక్ష్యానికి గురయ్యాయో వివరిస్తున్నారు* **రాజవరం పార్థసారథి**

# ఎన్నికలు ఎలా జరిగాయి?

**రా**ష్ట్రంలో ఎన్నికల ప్రహసనం ముగిసిపోయింది. అన్ని రాజకీయ పక్షాలూ తమదే విజయమని ప్రకటించుకుంటున్నాయి. మే 16న ఓట్ల లెక్కింపు జరగగానే ఎవరో ఒకరి మాటే నిజమై వారు ప్రభుత్వాన్ని స్థాపిస్తారు గాని ఈ లోగా అసలు ఎన్నికలు జరిగిన తీరును సమీక్షించుకోవలసి ఉంది. ప్రజల పేరు మీద జరుగుతున్న ఈ మహానాటకంలో ప్రజలు పాత్ర ఎంత ఉందో, రాజకీయ నాయకులూ, పక్షాలూ, ప్రచార సాధనాలూ, ఎన్నికల కమిషన్ వంటి అధికారిక యంత్రాంగం ఎటువంటి పాత్ర వహించాయో, ప్రజలను మాయ చేయడానికి, ఐదు సంవత్సరాలపాటు నిద్రపుచ్చడానికి, ప్రజలను ఏమార్చి పాలకవర్గాలు తమ దోపిడీ, పీడనలు సాగించడానికి జరిగిన తతంగంలో ఎవరెవరు తమ పాత్రలను ఎలా పోషించారో అంచనా వేయవలసి ఉంది.

ఈ ఎన్నికలలో అన్నిటికన్నా కొట్టవచ్చినట్టు కనిపించిన అంశం ప్రజా సమస్యలు ఏ రాజకీయ పక్షానికీ, అభ్యర్థికీ ప్రధానం కాకపోవడం. ఎట్లాగూ అధికార పక్షం తన పాలనలో అంతా సుభిక్షంగా ఉన్నట్టు, పాలూ తేనే ప్రవహించినట్టు, అందువల్ల ప్రజలకు ఏ సమస్యలూ లేనట్టు చెప్పుకుంటుంది గాని, కనీసం ప్రతిపక్షాలయినా ప్రజల నిజమైన, నిత్యజీవిత సమస్యలను ప్రస్తావించి, పాలకపక్షమే ఆ సమస్యలను ఎలా సృష్టించి పెంచి పోషించిందో, తాము అధికారంలోకి వస్తే వాటిని ఎలా పరిష్కరిస్తామో చెప్పుకోవాలి. కాని ఈసారి ఎన్నికలలో ప్రతిపక్షాలు కూడ ప్రజల నిజమైన సమస్యల మీద కేంద్రీకరించలేదు. అధిక ధరలు, నిరుద్యోగం, పేదరికం, ఆర్థిక మాంద్యం, ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు వల్ల, బాక్సైట్, యురేనియం తవ్వకాల వల్ల, అభివృద్ధి కార్యక్రమాల పేరు మీద వచ్చిన విధ్వంసం వల్ల వేలాది మంది ఉపాధి కోల్పోవడం, రైతుల ఆత్మహత్యలు, చేనేత కార్మికుల ఆత్మహత్యలు, అటవీ భూముల ఆక్రమణ, భూసంస్కరణలు, ప్రభుత్వరంగ ఉద్యోగ కల్పన, విద్య, వైద్య, ఆరోగ్య రంగాలలో పెరిగిపోతున్న ప్రైవేటీకరణతో కలుగుతున్న అనర్థాలు, పోలవరం ప్రాజెక్టు, గంగవరం ఓడరేవు వంటి వాటివల్ల నిరాశ్రయులైన ప్రజల కడగండ్లు వంటి ప్రజల నిత్య జీవిత సమస్యలలో కొన్ని అసలు ప్రస్తావనకైనా రాలేదు. కొన్ని మాటవరసకు ప్రస్తావనకు వచ్చినా వాటి మీద వివరంగా, ఆచరణాత్మకంగా మాట్లాడడానికి ప్రతిపక్షాలకు ఓపికలేదు. చివరికి ఎన్నికల ప్రకటనకు ముందు ఉధృతంగా వినిపించిన వాన్‌పిక్, కోస్తా కారిడార్, కాకినాడ – విశాఖ పారిశ్రామిక కారిడార్, సిరిసిల్ల నేత కార్మికుల ఆత్మహత్యలు వంటి సమస్యలు కూడ రాష్ట్ర వ్యాపిత ఎజెండా కాకుండాపోయాయి.

ప్రజల కోసం జరుగుతున్న ఎన్నికలలో, ప్రజలు పాల్గొనవలసిన ఎన్నికలలో ప్రజా సమస్యలు ఇలా నిర్లక్ష్యానికి గురి కావడమేమిటి?

ఎన్నికలలో పాల్గొంటున్న ప్రధాన రాజకీయ పక్షాలన్నిటికీ ప్రజా సమస్యల పట్ల ఒకేరకమైన వైఖరి ఉన్నప్పుడే ఇలా జరుగుతుంది. లేదా, ఎన్నికలకు ముందు వరకూ ప్రజలను సమీకరించుకోవడానికి, తమ వెనుక నిలుపుకోవడానికి, ప్రజలను మభ్యపెట్టడానికి ఇటువంటి సమస్యలను ఎత్తిపట్టుకున్నట్టు నటించినప్పటికీ వాటిని ఎన్నికల సమస్య చేయడంలో వాళ్లు వెనుకాడుతున్నారన్నమాట. దేన్నయినా ఎన్నికల సమస్య చేయడమంటే, దాని పరిష్కారానికి ఏదో ఒక స్థాయిలో జవాబుదారీగా ఉండడం గనుక వాటిని పక్కనపెట్టకతప్పదు. నిజానికి కోస్తా కారిడార్ గురించి, పోలవరం గురించి అంతకుముందు ఎంతో కొంత ఆందోళన చేసిన రాజకీయ పక్షాలు కూడా ప్రస్తుతం మహాకూటమిలో చేరినతర్వాత ఆ ప్రస్తావన మానేశాయి. మహాకూటమిలో ప్రధాన భాగస్వామి అయిన తెలుగుదేశం పార్టీ కోస్తా కారిడార్‌కు, అటువంటి బహుళజాతి సంస్థల అనుకూల పథకాలకు అనుకూలమైన పార్టీ అయినందువల్ల కావచ్చు. ఎన్నికల ప్రచార క్రమం అంతా కూడా తాము అధికారంలోకి వస్తే పోలవరాన్ని ఇంకా త్వరగా నిర్మించి తీరుతామని తెలుగుదేశం అధినేత ప్రకటించారు.

ఈ రకంగా రాష్ట్రవ్యాపితంగా ప్రజలను కలవరపరుస్తున్న సమస్యలు ఎవరికీ ఎన్నికల ఎజెండాలో లేకపోయేసరికి, ఆరోగ్యశ్రీ, ఇందిరమ్మ ఇళ్లు, వృద్ధాప్య పెన్షన్లు, అవినీతి, నగదు బదిలీ పథకం, ఉచిత కలర్ టివి పథకం వంటి తాత్కాలిక ఉపశమనాలు, జనాకర్షక కార్యక్రమాలు, సామాజిక న్యాయం వంటి సారాంశంతో సంబంధంలేని పైపై వాగ్దానాలు ఎన్నికల అంశాలయ్యాయి. ఈ కార్యక్రమంలో కొన్నిటి విశ్వసనీయత ప్రశ్నార్థకం కావడం వల్ల చాల నియోజకవర్గాలలో స్థానిక అంశాల ప్రాధాన్యత హెచ్చింది.

తెలంగాణలోని నియోజకవర్గాలలో అత్యధిక భాగంలో తెలంగాణ సమస్య ప్రధానం అయి ఉండవచ్చుగాని, మిగిలిన నియోజకవర్గాలలో మాత్రం రాష్ట్రస్థాయి సమస్యలు, రాష్ట్రస్థాయి పరిష్కారాలు, రాష్ట్రస్థాయి రాజకీయ పక్షాలు ముఖ్యం కాకుండాపోయాయి. స్థానిక సమస్యలు, అభ్యర్థి స్థానికుడా కాదా అనే ప్రశ్న, అభ్యర్థి అందుబాటులో ఉంటారా

ఉందరా అనే ప్రశ్న, అభ్యర్థి గతంలో పోటీచేసి ఓడిపోయి ఉంటే ఆ సానుభూతి, అభ్యర్థి కులం, అభ్యర్థి పంచిపెట్టగల డబ్బు, అభ్యర్థికి ఉన్న అంగబలం, వరవతి వంటి పూర్తి స్థానిక అంశాలే ప్రధానమయ్యాయి. ప్రజాసమస్యలు కూడ స్థానిక ప్రజాసమస్యలు మాత్రమే ప్రస్తావనకు వచ్చాయి.

స్థానిక ప్రాధాన్యతలు పెరగడం ఒక ఎత్తయితే, ఓటర్లలో పెద్ద ఎత్తున నిరాసక్తత వ్యక్తం కావడం మరొక ఎత్తు. గుంటూరు, ప్రకాశం, కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరిలలో వ్యాపించిన అనేక నియోజకవర్గాలలోనూ, హైదరాబాదులోనూ విస్తృతంగా ప్రజలతో మాట్లాడిన తర్వాత ఏర్పడిన అభిప్రాయమేమంటే, ఎవరు గెలిచినా ఏమీ ఒరిగేది లేదనే నిరాశ ప్రజలలో విపరీతంగా వ్యాపించింది. ఎవరికో ఒకరికి ఓటేయక తప్పదని, తాము ఓటు వేయకపోయినా ఎవరో ఒకరు అధికారంలోకి వస్తారని ఓటేయడమే గాని, ఓట్ల మీద, ఓట్ల పవిత్రత మీద ఎవరికీ నమ్మకంలేని స్థితి వచ్చింది.

ఇక ఆ ఓటు అనేది తమ అభిమతానికి సంపూర్ణ చిహ్నం కానప్పుడు, అది పవిత్రంగా తమ అభిప్రాయాన్ని సూచించి ఒక మంచి వ్యక్తిని తమ ప్రతినిధిగా శాసనకర్తగా ఎన్నుకునే ప్రక్రియ కానప్పుడు, ఆ ఓటు హక్కు ఒక సరుకుగా మారి అమ్ముకోదగిన వస్తువు అయినప్పుడు దాన్ని డబ్బుకో, కులానికో, మరొక ప్రయోజనానికో అమ్ముకోవచ్చు గదా అనే అభిప్రాయం బలపడింది. ఓటర్లలో ఈ అభిప్రాయం బలపడడానికి తోడుగా, రాజకీయాలు వ్యాపారం కావడం, సంపన్నులు తమ సంపదను పెంచుకోవడానికి చట్టసభల సభ్యత్వాన్ని ఒక మార్గంగా చూడడం, ప్రపంచబ్యాంక్ ప్రవేశం నాటినుంచి జలయజ్ఞం దాకా ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలోకి విపరీతంగా ప్రవహించిన డబ్బు వంటి అంశాలు కలగలిసి, ఈ సారి ఎన్నికలు వందలకోట్ల వ్యాపార లావాదేవీగా మారిపోయాయి.

ఈసారి ఎన్నికలలో ఓటర్లు చాల ఉత్సాహంగా వచ్చి తమ ఓట్లు వేశారనీ, కనుక ఓటర్ల నిరాసక్తత అనేది వాస్తవిక విశ్లేషణ కాదని అభ్యంతరం రావచ్చు. కాని ఓటర్లు ఉత్సాహంగా వచ్చినట్టు కనబడిన దృశ్యమూ నిజమే, నిరాసక్తత ఉండడమూ నిజమే. 2004 ఎన్నికలకూ 2009 ఎన్నికలకూ మధ్య రాష్ట్రంలో ఓటర్ల సంఖ్య ఐదు కోట్ల పదకొండు లక్షల నుంచి ఐదు కోట్ల డెబ్బై ఎనిమిది లక్షలకు చేరింది. అంటే ఓటర్ల సంఖ్యలో పదమూడు శాతం పెరుగుదల కనబడింది. ఇలా కొత్తగా మొదటిసారి ఓటర్లయినవారిలో ఎక్కువమంది ఓట్లు వేయడానికి ఉత్సాహం చూపారు. కాని పోలయిన ఓట్ల శాతం 2004 లో ఎంత ఉండిందో నగటున 2009లో కూడా అంతే ఉంది. కొన్ని నియోజకవర్గాలలో బాగా తగ్గింది గాని, కొన్ని నియోజకవర్గాలలో మళ్లీ స్థానిక కారణాలవల్లనే పెరిగినందువల్ల సగటు అంకె యథాతథంగా ఉండిపోయింది. అంటే పాత ఓటర్లలో 2004లో ఓటు వేసినవారు కూడా ఈసారి ఓటు వేయలేదన్నమాట. గణాంక విశ్లేషణ చేస్తే, కనీసం పదిశాతం ఓటర్లయినా తమ నిరాసక్తతను వ్యక్తీకరించి ఉంటారని తేలుతుంది. ఎన్నికల వ్యయ పరిమితి దాటగూడదని ఎన్నికల కమిషన్ కచ్చితమైన ఆదేశాలు ఇచ్చిందనే సాకుతో బ్యానర్లు, పోస్టర్లు, కరపత్రాలు, మైకు ప్రచారాలు తగ్గించడంతో అసలు ఎన్నికల వాతావరణమే కనబడక, నిర్లిప్తత పెరగడానికి దారితీసింది.

ఈసారి ఎన్నికలలో అధికార దుర్వినియోగం జరగలేదని, ఎన్నికల కమిషన్, పోలీస్ వ్యవస్థ చాల సమర్థంగా పనిచేశాయని, అందువల్లనే ఎన్నికలు స్వేచ్ఛగా, శాంతియుతంగా, సక్రమంగా జరిగాయని ఒక విశ్లేషణ చాల ఎక్కువగా వినబడుతున్నది. మరోవైపు ఎన్నికలలో డబ్బు పంపిణీ విచ్చలవిడిగా జరిగిందని, లోక్‌సభ అభ్యర్థులు ముప్పై నుంచి యాభై కోట్ల రూపాయలవరకు ఖర్చు పెట్టారని, శాసనసభ అభ్యర్థులు ఒక కోటి నుంచి పది కోట్ల రూపాయల వరకు ఖర్చు పెట్టారని, ఒక ఓటుకు రెండు వందల రూపాయల నుంచి ఐదు వేల రూపాయల వరకు కూడ ధర పలికిందని ఎందరో చెపుతున్నారు. ఓటర్లకు అన్ని పార్టీలు డబ్బు పంపిణీ చేశాయి. తమకు తప్పకుండా వేసేవారికే గాక, వేయరని తెలిసినవారికి కూడా పంపిణీ చేస్తామని, తద్వారా ఆ ఓటరు తటస్థంగా మారుతాడని ఒక ఎన్నికల నిర్వాహకుడు అన్నాడు. అందరు అభ్యర్థులూ సమానంగా రెండవందల చొప్పునో, ఐదువందల చొప్పునో ఇచ్చినప్పుడు, ఆపైన ఇచ్చే చీరగాని, మద్యంగాని, విందుగాని, లేదా కులంగాని, స్థానికుడు అనేది గాని పనిచేస్తుందట.

ఇలా మొత్తం మీద అన్ని రాజకీయ పక్షాలూ కలిపి కనీసం పదివేల కోట్ల రూపాయలయినా ఖర్చు పెట్టి ఉంటా/తీ. ఎన్నికల కమిషన్, పోలీసులు కలిపి పట్టుకున్న డబ్బు నలభై కోట్ల రూపాయలకు మించలేదు. అందులోనూ మూడు వంతులు ఎన్నికల డబ్బు కాదు. అంటే ఎన్నికల కమిషన్ చాల సమర్థంగా పనిచేసిందని చెప్పుకున్న సమయంలోనే పట్టుకున్న ఎన్నికల డబ్బు మొత్తం పంపిణీ అయిన ఒక్క శాతం కూడ చేరలేదు. ప్రచారాన్ని తగ్గించిన అభ్యర్థులు, పార్టీలు ఆ ఖర్చును విలేకరుల మీద, అధికారికంగానే జిల్లా అనుబంధాలను మొత్తంగా వ్యాపార ప్రకటనల వార్తా రచనలుగా మార్చిన పత్రికల మీద వెచ్చించారు. అధికార యంత్రాంగం ఈ దుర్వినియోగాన్ని చూసీ చూడనట్టు వదిలేసింది. ప్రాంతీయ, కుల, మత విద్వేషాలను రెచ్చగొట్టే ప్రకటనలను కూడ ఎన్నికల కమిషన్ చూసీ చూడనట్టు వదిలేసింది. కొన్నిసార్లు ఆ ప్రకటనలు తప్పు కాదని క్లీన్ చిట్ కూడ ఇచ్చింది. అంటే ఎన్నికల కమిషన్ గాని, దాని అధీనంలో పనిచేసిన పోలీసు, తదితర యంత్రాంగం గాని బైటికి కనబడుతున్నంత స్వచ్ఛంగా, చట్టబద్ధంగా పనిచేయలేదని చెప్పడానికే ఎక్కువ ఆధారాలున్నాయి.

ఇవన్నీ ఎన్నికల కార్యక్రమం ప్రారంభమయినాక తలెత్తిన సమస్యలు కాగా, ఈసారి ఎన్నికలను రెండు గందరగోళాలు – డిలిమిటేషన్, బహుముఖ పోటీ – ఆవహించాయి. ఆ గందరగోళాల వల్ల అటు రాజకీయ పక్షాలకూ, ఇటు అభ్యర్థులకూ, ఒకవైపు ప్రజలకూ, మరొకవైపు పరిశీలకులకూ కూడ ఎటూ తేల్చి చెప్పలేని అనిశ్చిత స్థితి నెలకొంది. డిలిమిటేషన్‌తో చాల నియోజకవర్గాల పరిధి మారడం, కొత్త మండలాలు వచ్చిచేరడం, పాత మండలాలు మరొక నియోజకవర్గం లోకి పోవడం, రిజర్వేషన్లు మారడం జరిగాయి. దానితో సాంప్రదాయికంగా ఆ నియోజకవర్గాలలో ప్రాబల్యం ఉన్న అభ్యర్థులు తమ విజయావకాశాల గురించి నిశ్చితంగా చెప్పలేని స్థితి వచ్చింది. అసలు కొందరికి తమ పాత నియోజకవర్గంలో పోటీ చేయలేని స్థితి వచ్చింది. ఆ గందరగోళం అలా ఉండగానే రాష్ట్ర రాజకీయ రంగంలో అప్పటివరకూ ఉన్న రెండు ప్రధాన పార్టీలకు తోడుగా మరొక పార్టీ వచ్చి చేరింది. తెలుగుదేశం పార్టీ, సిపిఐ, సిపిఎం, తెలంగాణ రాష్ట్ర

*పార్లమెంటరీ ఎన్నికలలో డొల్లతనాన్ని విశ్లేషిస్తూ, ఎన్నికలలో గెలిచిన ప్రజా ప్రతినిధుల ప్రాతినిధ్యమెంతో వివరిస్తున్నారు* **వి. హనుమంతరావు**

# చీడపట్టిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం

రాష్ట్ర ఓటర్లలో 1951 నుంచి ఇప్పటి వరకూ జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో సగటున ప్రతీ ముగ్గురిలో ఒకరు ఓటింగ్‌లో పాల్గొనలేదు.

– 1972లో ఇందిరాగాంధీ 'గరీబీ హఠావ్' నినాదంతో సగానికి మించి ఓట్లు పడిన ఒక్క సందర్భం తప్ప మరే ఎన్నికలలోనూ దేశాన్ని పరిపాలించింది మైనారిటీ ఓట్లతోనే. ఒక్క రెండు ఎన్నికల్లో తప్ప, మిగతా ఎన్నికలన్నింటిలో కాంగ్రెస్‌కు నలభై శాతానికి లోపుగానే ఓట్లు పడ్డాయి. అంటే కాంగ్రెస్ పాలన అంతా మైనారిటీ ఓట్లతోనే.

– రాష్ట్రంలో 1983లో ఆవిర్భవించిన తెలుగుదేశం పార్టీకి పోలైన ఓట్లు 40–50 శాతం మధ్యన నాలుగుసార్లు, అంతకు తక్కువగానే రెండు సార్లు అంటే మైనారిటీ ఓట్లతోనే ఎన్నికల బరిలో సాధించింది. ఎన్.టి. రామారావు కూడా గెలిచింది 46.3 శాతం ఓట్లతోనే.

అంటే 30 శాతం ఓటే వెయ్యలేదు. మిగిలిన 70 శాతంలో మైనారిటీ ఓట్లతో పరిపాలన – ఇది ప్రజాస్వామ్యం అనిపించుకుంటుందా అని ప్రజలు, మేధావులు ఆలోచించుకోవాలి. 1951లో అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం (నెహ్రూ ప్రధానిగా ఉండగానే) ప్రవేశపెట్టి ఆమోదింప చేసిన ఎన్నికల చట్టంలో ఎన్నికల వ్యవస్థను రూపొందించారు. ఇలాంటి అప్రజాస్వామిక వ్యవస్థకు కాంగ్రెస్ ప్రభుత్వం అప్పట్లోనే పునాదులు వేసిందన్నమాట. ప్రతీ అయిదేళ్లకు ఎన్నికలు జరుపుతూ రావటమే ప్రజాస్వామ్యమయితే, ఆ లెక్కన ఈ మధ్య పాకిస్థాన్‌లో ఎన్నికలు జరిగాయి. కాబట్టి ఆ దేశం కూడా ప్రజాస్వామ్య దేశమనాలి.

కాలం గడిచిన కొద్దీ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పదునెక్కటం పోయి, మరింత ప్రజాస్వామ్యాన్ని సంతరించుకోకపోగా రాను రాను మరింతగా పాతాళంలోకి దిగజారిపోతోంది. కోట్లకు కోట్లు డబ్బు, మద్యం సీసాలు దొరికిపోతున్నాయి. క్రిమినల్ నేపథ్యం గలవారిని ఎన్నికల్లో పోటీకి నిలబెడుతున్నాయి పార్టీలు. ఆయారాం, గయారాం సర్వసాధారణమైపోయింది. పాలక పార్టీలే ఈ దగుల్బాజీ పనులకు దిగజారిపోతుంటే, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని రక్షించేదెవరు? ప్రజలే అని జవాబు చెప్పినంత సులువుగా వారిని కులం, మతం, వెనుకబాటుతనం, నిరక్షరాస్యత, మూఢనమ్మకాల నుంచి రక్షించి వారిలో చైతన్యం కలిగించనిదే, వారిని కార్యోన్ముఖులను చేయటం సాధ్యం కాదు. ఏ దేశమైనా తమది డెమోక్రసీ అని చెప్పుకోవాలంటే స్వేచ్ఛాయుత ఎన్నికల నిర్వహణ, స్వతంత్రంగా వ్యవహరించే న్యాయ వ్యవస్థ, పరిపాలనా వ్యవస్థలు, పత్రికా స్వాతంత్ర్యం అనే పునాదులు బలంగా ఉండాలి. కాని ఏదీ? డబ్బిచ్చి ఓట్లు కొనుక్కోవటం బజారులో ఉప్పు, పప్పు కొనుక్కొనే సరుకుగా అయిపోయింది. పారిశ్రామికవేత్తలు, కార్పొరేట్లు విరాళాలిచ్చి ప్రభుత్వాలను, మంత్రులను, అధికారులను కొనేస్తున్నారు. ఈ ధోరణులను గమనించే పార్టీలకు ఎన్నికల నిధులను ప్రభుత్వమే సమకూర్చాలనే ప్రతిపాదన చాలాకాలంగా చర్చనీయాంశంగా ఉంది. వాళ్లిచ్చే విరాళాలను ఎన్నికల నిధిలో జమచేసి ఆ నిధి నుంచి పార్టీలకు నిధులను ఏర్పాటు చేయటం పారదర్శకత అనిపించుకొంటుంది. సుప్రీం కోర్టు న్యాయవాది కె.కె. వేణుగోపాల్‌కు ఇంకో ఆలోచన వచ్చింది. ఆదాయపు పన్ను మీద సర్‌చార్జి విధించి, అలా వసూలైన సొమ్మును ఈ నిధికి జమ చేయటమే. కాని ఇలాంటి మంచి ఆలోచనలు పాలకపార్టీల గొంతు దిగవుకదా.

ప్రస్తుత ఓటింగ్ విధానంలో ఎంత ప్రజాస్వామ్యం ఉందో మరో కోణం నుంచి కూడా చూడవచ్చు. ఉదాహరణకు 2004 ఎన్నికల్లో విశాఖ-2 నియోజకవర్గంలో 1,26,220 ఓటర్లుండగా 72,373 మంది వారి ఓటు హక్కు వినియోగించుకొన్నారు. 53,847 మంది (42.66 శాతం) పోలింగుకు వెళ్లనేలేదు 72,373 మందిలో 41,652 మంది (57.55 శాతం) మంది మాత్రమే కాంగ్రెస్‌కు ఓటు చేశారు. మిగతా 84658 మంది కాంగ్రెస్‌కు వ్యతిరేకమన్నమాట. మరో మాటల్లో చెప్పాలంటే కాంగ్రెస్‌కు ఎంతమంది ఓటు చేశారో, అంతకు రెట్టింపు మంది ఆపార్టీకి వ్యతిరేకం. అయినా కాంగ్రెస్ అభ్యర్థే ఆ నియోజకవర్గానికి ప్రతినిధి. ఇది మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం.

సమితి ఒక కూటమిగా ఏర్పడి పోటీ చేసినప్పటికీ, కాంగ్రెస్, ప్రజారాజ్యం లతోపాటు చాల నియోజకవర్గాలలో భారతీయ జనతాపార్టీ, లోక్‌సత్తా, ఎం.ఆర్.పి.ఎస్., బహుజన సమాజ్ పార్టీలు కూడ బరిలో నిలిచాయి. అలాగే చాలచోట్ల స్వతంత్ర అభ్యర్థులు కూడ పోటీ చేశారు. రాష్ట్రంలో ప్రతి శాసనసభ స్థానానికి సగటున పదమూడు మంది పోటీలో ఉన్నారు. అంటే ఓట్ల చీలిక గతంలో కంటె చాల పెరిగింది. అంటే ఎన్నికయ్యే అభ్యర్థి ప్రాతినిధ్యం వహించే జనాభా శాతం చాలా తగ్గింది.

ఈ స్థితిలో ఎవరు గెలిచినా, ఎవరు ఓడినా, అది ప్రజాస్వామ్యానికి విజయంగా పరిణమిస్తుందని ఆశించే పరిస్థితి మాత్రం లేదు. ప్రజలు విజయం సాధిస్తారని చెప్పడానికి లేదు. ప్రజా సమస్యలకు సృజనాత్మకమైన పరిష్కారాలు కనిపెట్టడమే రాజకీయ ప్రక్రియ అనే నిర్వచనం నిజమవుతుందని నిశ్చయంగా చెప్పే పరిస్థితిలేదు. ప్రజల పేరుమీద రాజకీయ వ్యాపారం మరింత పెద్ద ఎత్తున, నిర్విఘ్నంగా సాగడానికి అవకాశమిస్తూ ముగిశాయి 2009 ఎన్నికలు. ■

ఇప్పటికే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఎలా భ్రష్టు పట్టిందో ప్రస్తుత ఎన్నికల పోకడలను, తీరుతెన్నులను చూస్తే అర్థమవుతుంది. దొంగ ఓట్లు, రిగ్గింగ్, స్మగ్లర్లతో సంబంధాలు, డబ్బుతో ఓట్ల కొనుగోలు వగైరా అన్ని కళ్లకు కనబడుతున్న పరిణామాలు. ఇవన్నీ ఇలా జరుగుతున్నాయంటే పాలకవర్గం, ముఖ్యంగా కాంగ్రెస్ ఎన్నుకొన్న (పార్లమెంట్‌లో మెజారిటీతో ఆమోదముద్ర వేయించుకొన్న) ఎన్నికల విధానం కారణం. పోటీ చేసే అభ్యర్థుల్లో ఎవరికి ఎక్కువ ఓట్లు వస్తే వారిదే విజయం. ఒకరికి 99 ఓట్లు వచ్చి మరొకరికి నూరు ఓట్లు వస్తే, రెండవ వారే గెలిచినట్లు లెక్క. 99 ఓట్లకు ఎటువంటి విలువలేదు. బూడిదలో పోసిన పన్నీరే. ఇది ప్రజాస్వామ్యమా? ఈ విధానమే అభ్యర్థులను ఎలాగైనా సరే, ఏం చేసైనా సరే గెలవాలి, ఎన్ని పార్టీ ఫిరాయింపులైనా సరే చట్టసభలో ప్రవేశించాలి. ఎందుకు? ప్రజాసేవ అనేది వారి జవాబు. కాని గత 14 సార్వత్రిక ఎన్నికల్లో గమనించిన దేమంటే, గెలిచి ఎంత ఖర్చు చేశారో, అంతకు అంత తిరిగి రాబట్టుకోవడానికి పైరవీలు చేసి డబ్బు సంపాదించడం, వచ్చే ఎన్నికల్లో మళ్లీ పోటీ చేసి గెలవడానికి అవసరమైనంత డబ్బు సంపాదించడం, అందుకోసం నానా గడ్డి కరవటం. ఈ క్రమంలో పవిత్రమైన ఓటు మార్కెట్‌లో కొనుక్కొనే సరకుగా మారింది. ఇదంతా సిద్ధాంతాలు గట్టునపెట్టి, ప్రజస్వామ్య ముసుగులో జరగటం అత్యంత శోచనీయం. లక్ష్యం అనేది కాకెత్తుకపోయింది. ఒక ఎన్నిక తర్వాత మరో ఎన్నిక వచ్చేసరికి అక్రమ పద్ధతులు కొత్త పుంతలు తొక్కుతున్నాయి. ఇపుడు ఎన్నిక కాబోయే శాసనసభ్యుల లక్ష్యం ఎలాగోలా కోటీశ్వరులు కావటం. దేశ ఆర్థిక వ్యవస్థలో ఆర్థిక సంస్కరణలు ప్రారంభించిన నాటి నుంచి సమాజంలో అంతరాలు పెరిగిపోతున్నాయి. ప్రపంచ బిలియనీర్ల పట్టికలో భారతీయ కార్పొరేట్లు చేరిపోతుంటే, రెండో పక్క రోజుకు ఇరవై రూపాయల ఆదాయంతో, అర్ధాకలితో అలమటించే అభాగ్యుల సంఖ్య అంబరాన్ని చుంబిస్తోంది. ఇంత డబ్బు సంపాదించిన తర్వాత ఆ సంపాదన ఆధారంగా తామే తమ అవసరాల మేరకు శాసన రచన ఎందుకు చేయకూడదని అనుకొన్నారో ఏమో వారే చట్టసభల్లో ప్రవేశిస్తున్నారు. ప్రస్తుత ఎన్నికల బరిలో శాసనసభకు పోటీ చేస్తున్న వారిలో ఎంతమంది కోటీశ్వరులన్నారో పత్రికలు వారి పేర్లు, ఆస్తులతో సహా వివరాలు సేకరించి (రిటర్నింగ్ ఆఫీసర్ల ముందు వారే సమర్పించిన పత్రాల ఆధారంగా) ప్రకటించాయి. అయితే దేశంలో ఇదేమీ కొత్త విషయమేమీ కాదు. ఇటీవల ఢిల్లీ నగరంలో కాంగ్రెస్ గెలిచింది. ఎన్నికైన వారిలో 46 మంది మిలయనీర్లున్నారు. వారి ఆస్తులు సగటున ఒక్కొక్కరికి ఒక కోటి రూపాయలు. అయిదు కోట్ల ఆస్తులు ప్రకటించినవారిలో 13 మంది ఎన్నికయ్యారు కూడా. అదే సమయంలో అయిదు లక్షలకన్న తక్కువ ఆస్తులున్న వారు ఒక్కరూ లేరు. ఎన్నికైతే చట్టం కల్పించే రక్షణ కోసం కొంతమంది అక్రమార్కులు ఎన్నికల బరిలో దిగుతున్నారు.

మాజీ సిబిఐ అధికారి జోగిందర్ సింగ్ ప్రకారమే 14వ లోకసభలో 543 మంది సభ్యుల్లో 120 మందికి క్రిమినల్ రికార్డులున్నాయి. వీరిలో బిజెపి కి చెందినవారు 29, కాంగ్రెస్ - 24, రాష్ట్రీయ జనతా దళ్ - 8, సిపిఐ (ఎం) - 2, ఇండిపెండెంట్లు - 27, సమాజ్‌వాదిపార్టీ - 11 మంది గా ఉన్నారు. కొంచెం వెనక్కు పోయి చూస్తే 1996 లో దేశంలోని సార్వత్రిక ఎన్నికల సమయంలో 2000 తుపాకులు, 11 వేల గుళ్లూ, 173 పేలుడు పదార్థాలు, 57 వేల బాంబులు పట్టుబడ్డాయి. 1,39,526 మంది అభ్యర్థుల్లో 1500 మందికి క్రిమినల్ రికార్డులున్నాయి. 4722 మంది శాసనసభలకు పోటీచేయగా 700 మంది క్రిమినల్ కేసుల్లో కోర్టు విచారణ కోసం ఎదురుచూస్తున్నారు. ఇది ఎంత మాత్రం అభిలషణీయం కాదని పార్లమెంట్ 1997లో ఎన్నికల సంస్కరణలు ప్రవేశ పెట్టాలని తీర్మానించింది. కాని ఈనాటి వరకు అది కాగితాలకే పరిమితమైంది. ఇలాంటి నేర చరితుల నుంచి ప్రజానుకూల విధానాలు వస్తాయని ఆశించటం ఒక ఎండమావి.

ఈ ఎన్నికల్లో ఒక విశేషమేమంటే కుటుంబ పాలన జరుగుతోందని కాంగ్రెస్ నాయకత్వాన్ని విమర్శిస్తూ, వారే కుటుంబపాలనకు బీజాలు వేశారు. ముఖ్యమంత్రి, ప్రతిపక్ష నాయకుడు, ప్రజారాజ్యం నాయకులు కుటుంబ సభ్యులకు టికెట్లు ఇవ్వటమో, లేక ప్రచారంలోకి దించడమో చూసాం మనం.

ఈ ఎన్నికల్లో పొత్తులని ఎద్దేవా చేస్తున్న వారే కేంద్రంలో పొత్తులతోనే గత అయిదేళ్లు పరిపాలించారు. అంతకుముందు బిజెపి కూడా అంతే. మేమే పోరాడి స్వరాజ్యం తెచ్చామని కాంగ్రెస్ అనటం మా తాతలు నేతులు తాగారనే సామెతను గుర్తుకు తెస్తోంది. అపుడు స్వాతంత్ర్యం కోసం పోరాడిన కాంగ్రెస్ వేరు, ఇప్పటి కాంగ్రెస్ వేరు. గత దశాబ్దన్నర కాలంగా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పొత్తు పెట్టుకొంటే తప్ప అధికార పీఠం దక్కని పరిస్థితి ఏర్పడింది. ఇది కాంగ్రెస్ పార్టీ స్వయంకృ తాపరాధమే. మనది ఫెడరల్ వ్యవస్థ అయినా, ఆచరణలో రాష్ట్రాల అధికారాలను కుంచింప చేస్తూ, వాటి ఆర్థిక వనరులను అపహరిస్తూ, భారీ ఆదాయం వచ్చే వనరులను కాజేస్తూ దేశంలో ఏకఛత్రాధిపత్యం వహించి పెత్తనం సాగిస్తూండడంతో రాష్ట్రాల్లో అసంతృప్తి ఏర్పడి, ప్రాంతీయ పార్టీలు ఆవిర్భవించి రాష్ట్రాల్లో పాలక పార్టీలుగా రూపొందాయి. రాష్ట్రాలు లేకపోతే కేంద్రం మిథ్య అని ఎన్.టి.రామారావు నినదించారు. ప్రాంతీయ పార్టీలతో జతకట్టి, వారికి కేంద్ర మంత్రి మండలిలో మంత్రిపదవులిచ్చి మచ్చిక చేసుకోకపోతే పబ్బం గడవని పరిస్థితులు దేశంలో ఏర్పడ్డాయి. బిజెపి పాలనలో కూడా ఇదే జరిగింది. ప్రస్తుత ఎన్నికల అనంతరం తృతీయ ప్రత్యామ్నాయం ఏర్పడే సూచనలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. రాష్ట్రంలో కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా ఏర్పడిన పొత్తుల మీద రాళ్లు రువ్వుతున్న కాంగ్రెస్‌వాదులు కేంద్రంలో ఆ పార్టీ పొత్తులతోనే గత అయిదేళ్లు పాలించిందని గుర్తుంచుకోవాలి. వివిధ ఎజెండాలున్న పార్టీలు, సిద్ధాంతరీత్యా, విధానరీత్యా కలిసి ప్రభుత్వాలేర్పడి నపుడు పొరపొచ్చాలు తప్పవు. అందువల్ల పరిపాలన సవ్యంగా సాగకపోవచ్చు. అలాంటి దుస్థితి ఏర్పడిందంటే దానికి కాంగ్రెస్ బాధ్యత వహించాలి. కేంద్ర - రాష్ట్ర సంబంధాల గురించి ఇదివరలో సర్కారియా కమిషన్ ఏర్పాటు చేయగా, ఆ కమిషన్ సిఫార్సుల్లో తనకనుకూలమైనవి మాత్రమే అమలు పరిచినందువల్ల ప్రాంతీయ పార్టీలకు బీజం పడింది. ఈ విషయాన్ని కేంద్ర-రాష్ట్ర సంబంధాలను పున సమీక్షిస్తున్న రెండవ కమిషన్, రేపు ఏర్పడబోయే నూతన కేంద్ర ప్రభుత్వం గమనంలో ఉంచుకోవాలి.

ప్రవేశద్వారంలో రిజస్టరులో సంతకం పెట్టేసి (దినభత్యం కోసం) వెళ్లిపోయే ప్రబుద్ధులు కొందరైతే, కొందరు సభలో ప్రశ్నోత్తరాల సమయం అయిపోగానే, బయటకు వెళ్లి పైరవీలు చేసే వారుకొందరు. కూర్చున్న వారి సంఖ్య ఒకోసారి కూడా సరిపోదు. అలాంటి సమయంలో ఓటింగ్

## బొర్రా వెంకటేశ్వర్లు



**కా**కతీయ విశ్వవిద్యాలయంలో రాజనీతి శాస్త్ర అధ్యాపకుడిగా, వివిధ ప్రజాసంఘాల సహప్రయాణికుడిగా, ఉపన్యాసకుడిగా మూడు దశాబ్దాలపాటు వేలాదిమంది విద్యార్థులనూ, ప్రజాసంఘ కార్యకర్తలనూ, శ్రోతలనూ ఉర్రూతలూగించిన బొర్రా వెంకటేశ్వర్లు తన 62వ ఏట ఏప్రిల్ 1న హైదరాబాద్‌లోని మెడిసిటీలో మరణించారు. గుండెపోటుతో ఆసుపత్రిలో చేరి వారంరోజుల చికిత్స తరువాత ఆయన తుదిశ్వాస విడిచారు. ముగ్గురు కూతుళ్లు విదేశాల్లో ఉండడంతో, కొంతకాలం క్రితం సహచరి మరణంతో ఆయన బాగా కుంగిపోయారు. ఖమ్మం జిల్లా మధిర తాలూకా కమ్యూనిస్టు ప్రభావం ఉన్న కుటుంబం నుంచి వచ్చి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పొలిటికల్ సైన్స్ లో ఎం.ఎ. చేసిన వెంకటేశ్వర్లు వరంగల్‌లో ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాలలో డిగ్రీ తరగతులకు, విశ్వవిద్యాలయ రాజనీతి శాస్త్ర శాఖలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ విద్యార్థులకు రాజనీతి శాస్త్రం బోధించారు. ఎమర్జెన్సీ అనంతర ప్రజాస్వామిక వెల్లువలో వరంగల్‌లోనూ, తెలంగాణ అంతటా జరిగిన అనేక విద్యార్థి, ఉపాధ్యాయ సదస్సులలో ఆయన అనేక సమకాలీన అంశాలపై ఉత్తేజకరమైన ఉపన్యాసాలు ఇచ్చేవారు. రాజనీతి శాస్త్రంలో పి.ఎచ్‌డి. సిద్ధాంత వ్యాసంతో పాటు అంబేద్కర్ ఓపెన్ యూనివర్సిటీ పాఠ్యపుస్తకాలలో పాఠాలు కూడా రచించారు. అంతర్జాతీయ సదస్సుల కొరకు, అధ్యయనా ల కొరకు చెకొస్లొవేకియా, పోలెండ్ వంటి దేశాలు పర్యటించారు. 1990ల తరువాత తన అభిప్రాయాల మీద విచికిత్సలో పడి సామాజిక కార్యాచరణలో పాల్గొనడం తగ్గించినప్పటికి సమకాలీన రాజకీయ పరిణామాలన్నిటి మీద పదునైన వ్యాఖ్యలు చేస్తుండేవారు. వీ

వస్తే కూర్చొన్న వారిలో మెజారిటీ ఉంటే బిల్లు పాసయి పోతుంది. అసలే మెజారిటీ ఓట్లు పడని పార్టీ మనలను పరిపాలిస్తోంది. మైనారిటీలో మైనారిటీ శాసనాలు చేసేస్తోంది. పోనీ అలా కూర్చొన్న వారు శ్రద్ధగా చర్చలో పాల్గొంటారా? అంటే ప్రతిపక్షంలో కూర్చొన్నవాళ్లు కేకలు వేయటం, నియమాలకు వ్యతిరేకంగా లేచి నిల్చోవటం, స్పీకర్ పోడియం వద్దకు దూసుకుపోవటం, సభలో కల్లోలం సృష్టించటం, ప్రదర్శనలు, వాకౌట్లు చేయటం, సభా కార్యకలాపాలను స్తంభింపచేయటం – ఇందుకేనా ప్రజలు తమ ఓటు వేస్తున్నది. ఆలోచించండి. పార్లమెంట్‌లో మొట్టమొదటి సభలో ప్రతిపక్ష నాయకులు, ముఖ్యంగా కమ్యూనిస్టులు లేచి మాట్లాడుతోంటే నెహ్రూ అతి శ్రద్ధగా వినేవారు. హితేన్‌ముఖర్జీ మాట్లాడుతుంటే సభ్యులు యావన్మంది నిశ్శబ్దంగా మంత్రముగ్ధులై వినేవారు. మన మొదటి శాసనసభల్లో సుందరయ్యను కోరి మరి మంత్రిత్వ శాఖ పని చేసే తీరు తెన్నుల గురించి వినేవారు. నేడు శాసనసభలో సభా నాయకుడు జవాబిస్తుంటే, ఆయనను ప్రశాంతంగా మాట్లాడ నివ్వకపోవటమే తమ బాధ్యత అన్నట్లు ప్రవర్తిస్తున్న ప్రతిపక్షం తీరు మనం చూస్తున్నాం. ఇందులో ఏ ఒక్క పార్టీ తక్కువ తినలేదు. నేటి చట్టసభలు కేకల, అరుపుల, కుస్తీ కేంద్రాలుగా తయారయ్యాయి. కొన్ని శాసనసభల్లో హింసాత్మక సంఘటనలు చోటుచేసుకున్న సందర్భాలనేకం ఉన్నాయి. అవును మరి, క్రిమినల్స్ చట్టసభలో ప్రవేశిస్తే ఇలా కాక మరెలా ఉంటుంది. శాసనసభ నిర్వహణలో గత అనుభవాల దృష్ట్యా, నిర్వహణా నియమావళిని సవరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

ఈ దిగజారుడు నుంచి నిష్కృతి లేదా? ప్రజాస్వామ్యానికి మంచి రోజులు రావా? ఈ పతనాన్ని గమనించిన మేధావులు, రాజ్యాంగ నిపుణులు ఇతర దేశాల్లో ఉన్న పద్ధతులను అధ్యయనం చేసి ఉన్న పద్ధతుల్లో మెరుగైన పద్ధతి అని సూచించారు. గత కొద్ది సంవత్సరాలుగా ఈ పద్ధతి ప్రత్యామ్నాయంగా చర్చించటం జరుగుతోంది. ఈ పద్ధతిలో 1) ఓటు పార్టీలకు వేస్తారు, వ్యక్తులకు ఓటు వేయటం జరగదు; 2) ఓటు ఒకపార్టీ విధానానికే గాని, వ్యక్తులకు కాదు; 3) పార్టీ ఎవరిని చట్టసభలకు ఎంపిక చేస్తుందో, ఆ సభ్యుల పట్టికను ఎన్నికల కమిషన్‌కు సమర్పిస్తుంది. ప్రజలు ఆ లిస్టుకు ఓటు వేస్తారు. ఆ పార్టీకి వచ్చిన ఓట్ల ప్రకారం లిస్టులో మొట్టమొదట ఉన్న సభ్యులను ఆ పార్టీకి వచ్చిన ఓట్ల సంఖ్య ఆధారంగా ఎంపిక చేసి, వారు ఎన్నికైనట్లు ప్రకటిస్తుంది; 4) ఇందువల్ల ప్రతి ఓటుకు విలువ ఏర్పడుతుంది. (ఇపుడు ఓడిపోయిన వారికి వేసిన ఓట్లు చిత్తు కాగితాలతో సమానం). రెండవ ప్రత్యామ్నాయం యాభై శాతం ఓట్లకు పైగా వేయించుకోగలగిన వారే ఎన్నికైనట్లు ప్రకటించాలి. యాభై శాతం రాకపోతే? తిరిగి ఎన్నిక ప్రకటిస్తారు? అలా తిరిగి ఎన్నిక జరిగినపుడు తమకు ఛాన్సులేదని పోటీ నుంచి విరమిస్తే అలా విరమించిన పార్టీకి ఓటు వేసిన ఓటర్లు పునరాలోచించుకొని, గెలిచే అవకాశాలున్న పార్టీకి ఓటు చేస్తారు? ఇలాంటి వివరాలన్ని అధ్యయనం చేయాల్సి ఉంది.

పార్టీ తరఫున నిలబడిన అభ్యర్థులు తమమీద ఎటువంటి పోలీసు కేసులు లేవని, తమకు ఎటువంటి క్రిమినల్ రికార్డు లేదని స్వయంగా పార్టీ నాయకునికి లిఖితపూర్వకమైన స్టేట్‌మెంట్ ఇవ్వాలి. కేవలం ప్రకటించడమే కాదు, అందుకు పోలీసు అధికారుల ధృవీకరణ పత్రం జతపర్చాలి. ఒకవేళ అసత్య ప్రకటనకొస్తే, వారిని ఎన్నికల్లో ఆరేళ్లపాటు ఎన్నికకు అనర్హుడుగా ప్రకటించాలి. ప్రస్తుతం నేర చరితుందని తెలిసి కూడా వారిని అభ్యర్థులుగా నిలబెడుతున్న పార్టీలకు ముక్కుతాళ్లు బిగించడం అవసరం.

ప్రస్తుతం కోటీశ్వరులు ఎన్నికల బరిలో దిగి, డబ్బుతో ఓట్లు కొని సభ్యులవుతున్నారు. దీనిని అరికట్టాలంటే, ఇంతకుమించిన ఆస్తులున్న వారు ఎన్నికల్లో పాల్గొనరాదని నిబంధన విధించాలి. కోటీశ్వరులు పేదరికం పోకూడదని, పేదలు తమ దయాదాక్షిణ్యాల మీద బతకాలని, అణిగి మణిగి ఉండాలని, వారు చైతన్యవంతులు కాకూడదని కోరుకుంటారు. అలాంటివారు ప్రతినిధులైతే పేదరికం శాశ్వతంగా ఉండిపోతుంది. దానికి అడ్డుకట్ట వేయాలి.

లోక్‌సభ ఎన్నికై సమావేశమవటంతోనే మొట్టమొదటగా ఎన్నికల చట్టానికి పై విధంగా సవరణలు ప్రతిపాదించాలి. చాలాకాలంగా ఈ ప్రతిపాదనలు చర్చలో ఉన్నాయి కాబట్టి కాలయాపన చేయకుండా చట్టాన్ని పాస్‌చేసి వచ్చే జనరల్ ఎన్నికలలో సవరించిన చట్టం ఆధారంగా జరగాలి. అపుడే ప్రజాస్వామ్యం ఏదో నిలువుల లోతుకు పడిపోకుండా నిలువరించగలం. వీ

*పార్లమెంటరీ పంథాలో ప్రజల ఆకాంక్షలు నెరవేరిన దాఖలాలు లేవనీ, ఉద్యమాల ద్వారానే న్యాయమైన హక్కులను సాధించుకోగలమనీ అంటున్నారు* **ఎం. శ్రీనివాస్**

# రిజర్వేషన్‌ల వర్గీకరణ - ప్రభుత్వాల మోసపూరిత వైఖరి

'మాదిగ జాతి సామాజిక వర్గంకోసం ఎంతటి త్యాగాలకైనా సిద్ధమే. అందుకోసం మాదిగ జాతిని ఏకం చేస్తాం. సమరశీల పోరాటాలకు సన్నద్ధపరుస్తాం. మా జాతి న్యాయమైన ప్రజాస్వామిక హక్కును సాధించుకోవడానికి సమాజ మద్దతును కూడగడుతాం. పాలకుల మెడలు వంచుతాం. అవసరమైతే బలిదానాలకు వెరవం. రక్తాన్ని చిందించైనా వర్గీకరణ సాధిస్తాం' అని ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం చేసిన ఈ వ్యాఖ్యలను సార్థక పరుచుకున్నది. నిజంగానే ఉద్యమం బలిదానాలకు వెరవలేదు. తన ముద్దుబిడ్డలైన సురేంద్ర మాదిగ, దామోదర్ మాదిగ, మహేష్ మాదిగలను బలిపెట్టుకుంది. దీనికి సాక్షి భూతం గాంధీభవనే.

గాంధీ భవన్ సంఘటన నేపథ్యంలో ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమ కార్యాచరణపై భిన్న కోణాలలో అంచనాలు, విశ్లేషణలతో కూడిన కొన్ని వ్యాసాలు ఆంధ్రజ్యోతి పత్రికలో తాజాగా వెలువడినాయి. ఏ ఉద్యమమైనా నిర్దిష్టమైన నిర్మాణం, సామాజిక, రాజకీయ అవగాహన కలిగి ఉంటుంది. దాని ఉద్యమ కార్యాచరణ పలు రూపాలలో ఉండవచ్చు. ఉద్యమం లేవనెత్తిన డిమాండ్లకు పరిష్కారం, అవి సాధించే వరకు దాని సజీవత్వం అనేది ఉద్యమం నడిపే తీరుపై నాయకత్వం నిజాయితీ, చిత్తశుద్ధి, అంకితభావం, త్యాగనిరతి పైన, అది అనుసరించిన విధానపరమైన ఎత్తుగడలపైన ఆధారపడి ఉంటుంది. గత మూడున్నర దశాబ్దాలుగా వివిధ సామాజికపరమైన డిమాండ్లపై వచ్చిన, వస్తున్న ఉద్యమాలను చూస్తున్నాం. 2004 తరువాత వచ్చిన ఉద్యమాలలో ప్రధానమైనవి 'తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు', 'ఎస్.సి. వర్గీకరణ ఉద్యమం', 'ముస్లిం రిజర్వేషన్‌లు' ఉద్యమాలు. ఈ డిమాండ్లు అత్యంత ప్రజాస్వామికమైనవి. ఇవి ఆ సెక్షన్‌ల, ఆ ప్రాంతానికి చెందిన ప్రజల ప్రజాస్వామిక ఆశలు, ఆకాంక్షలు. ఇది వారి రాజకీయపరమైన ప్రజాస్వామిక హక్కు కూడా. రాజకీయ సామాజికపరమైన ఈ డిమాండ్లను సాధించుకోవటానికి ఉద్యమాలు వివిధ రూపాల్లో కొనసాగుతున్నాయి. మరి ముఖ్యంగా చెప్పాలంటే గత దశాబ్దన్నర కాలంగా అత్యంత సజీవంగా కొనసాగుతున్నది ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం. ఇటీవల జరిగిన కొన్ని సంఘటనలు ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం మరోసారి తీవ్రతరం కావటానికి దోహదం చేసాయి.

ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమ నైతికతను ప్రశ్నించటం ఈ వ్యాసకర్త ఉద్దేశ్యం కాదు. ఉద్యమ కార్యాచరణను శంకించటం ఈ వ్యాసకర్త అభిప్రాయం అంతకంటే కాదు. ప్రస్తుతం పాలకులు మహిళా సాధికారత అంటే మహిళా రిజర్వేషన్‌లకూ రాజకీయరంగంలో నియోజకవర్గాల రిజర్వేషన్లకూ సామాజిక రంగంలో విద్య, ఉపాధి రంగాలకూ యువత రాజకీయాలలోకి రావడమంటే అసెంబ్లీ, పార్లమెంట్‌లోకి ప్రవేశించడానికీ సామాజిక న్యాయాన్ని పరిమితం చేస్తున్నారు. సామాజిక న్యాయానికి ఉండే విస్తృత పరిధి దాని నిర్వచనం దృక్కోణంలో సామాజిక న్యాయం అంటే భూపంపిణీ, సంపదలో సమ పంపిణీ, ఉన్నత మానవజీవ నాభివృద్ధికి అవసరమైన బౌద్ధిక వసతులు సమకూర్చడమే. అందుకే సామాజిక న్యాయానికి, రిజర్వేషన్‌లకు మధ్య మౌలికమైన తేడా ఉంది. సామాజిక న్యాయంలో రిజర్వేషన్‌ల కల్పన ఒక అంశం మాత్రమే. అందుకే రిజర్వేషన్ల క్రమబద్ధీకరణలో ఇమిడి ఉన్న సామాజిక న్యాయ సమ పంపిణీ సూత్రాన్ని బట్టి దండోరా ఉద్యమాన్ని సామాజిక పరివర్తన ఉద్యమంగా భావించరాదు. కాబట్టి దండోరా ఉద్యమానికి, దాని నాయకత్వానికి పరిధులు, పరిమితులున్నాయి. సరియైన రాజకీయ సైద్ధాంతిక దృక్పథంతో భారతీయ సమాజం పట్ల ఉన్న అంచనా, విశ్లేషణను బట్టి ఉన్న వైరుధ్యాలలో ప్రధాన వైరుధ్య పరిష్కారాన్ని బట్టే నిజమైన సామాజిక న్యాయం, అన్ని రంగాలలో సమాన అవకాశాలు లభిస్తాయనేది నిస్సందేహం. అయితే దళితుల రిజర్వేషన్‌లలో అంతర్గతంగా ఉన్న అంతరాలను సరిచేయడానికి మాదిగ సామాజిక వర్గం, దాని ఉప కులాలకు రిజర్వేషన్‌లలో సమపంపిణీ చేయడం సరియైనదే. ఇది ప్రజాస్వామికమైన సామాజిక స్ఫూర్తికి అనుగుణమైనదే.

కానీ దశాబ్దన్నర కాలంగా ఎం.ఆర్.పి.ఎస్. ఆధ్వర్యంలో సాగుతున్న ఈ ప్రజాస్వామిక ఉద్యమం దళిత సామాజికవర్గంలో అన్ని కులాలు దామాషా పద్ధతిలో రిజర్వేషన్‌ల ఫలాలను పొందాలన్నదే. అయితే ఇది ఆచరణలో సాధ్యపడాలంటే క్రియాశీల ఉద్యమమే ఏకైక మార్గం. అంటే విశాలమైన ప్రజాస్వామిక ఉద్యమం అవసరం. ఉద్యమం కొనసాగింపు క్రమంలో ఎత్తుగడల రీత్యా అంది వచ్చే అవకాశాలను లక్ష్య సాధనకు సానుకూలంగా మలచుకోవటం తప్పుకాదు. అవసరమైనది కూడా. విశాల ప్రజాస్వామిక ఉద్యమ నిర్మాణం అంటే సమస్య బాధితులేకాక ప్రజాస్వామిక శక్తులను, మేధావులను కలుపుకురావటం. వివిధ పార్టీల, ప్రజాసంఘాల భౌతికపరమైన ప్రత్యక్ష సహకారాన్ని పొందటం. ఇది నాయకత్వం శక్తిసామర్థ్యాలు, నైపుణ్యాలపై ఆధారపడి ఉంటుంది. ఈ విషయంలో నాయకత్వం ఏ మేరకు

సఫలీకృతమయిందన్న ప్రశ్నకు సమాధానం ఉద్యమ ఆచరణయే గీటురాయి.

## దండోరా ఉద్యమం - నేపథ్యం

దండోరా ఉద్యమ లక్ష్యం దళితులను వర్గీకరించి రిజర్వేషన్‌లను వర్తింపజేసి అమలు చేయించటం. అంటే అంబేద్కర్ చెప్పిన 'సామాజిక సమన్యాయ పంపిణీ సిద్ధాంతాన్ని' ఆచరణాత్మకంగా వాస్తవీకరించడం. రాజ్యాంగరీత్యా కూడ ఇది సానుకూలమైనదే. దళిత సామాజిక వర్గంలో ఎక్కువ అణచివేతకు, అన్యాయానికి గురౌతున్న ఉపవర్గాలకు తగిన ప్రాధాన్యత ఇవ్వాలని రాజ్యాంగంలోని 46వ ఆర్టికల్ చెబుతోంది. అంటే సమన్యాయం పంపిణీ దృక్పథాన్ని నిర్దేశించడం. 1978లో అధికరణ 38, 2వ క్లాజుకు 44వ రాజ్యాంగ సవరణ చట్టం కూడా ఈ విషయంలో కేంద్రం, రాష్ట్రం తగిన చర్యలు తీసుకోవచ్చునని మరింత స్పష్టం చేసింది. అసలు రిజర్వేషన్‌లను కల్పించిందీ వెనుకబడిన అట్టడుగు వర్గాలను దృష్టిలో పెట్టుకునే. నిజానికి ఏ వర్గాలు రిజర్వేన్‌లను పొందాల్సి ఉన్నదో ఆ వర్గాలకు ఆరు దశాబ్దాలుగా సమపంపిణీలో తీవ్ర వివక్షత, అన్యాయం జరుగుతోంది. ఎస్.సి. వర్గాలలో అట్టడుగున ఉన్న కులాలు అపారమైన నష్టానికి గురవుతున్న విషయం విజ్ఞులకు, ప్రజాస్వామిక శక్తులకు, అభ్యుదయ సామాజిక వర్గాలకు విదితమే. దశాబ్దాలుగా దళితులలోని అట్టడుగువర్గాల కులాలకు జరుగుతున్న అన్యాయాన్ని తొలగించుకొని సమన్యాయాన్ని పొందటానికి వారు ముందుకు వచ్చారు. అందుకు సమరశీలమైన సంఘటిత ఉద్యమమే పరిష్కారమని వారు గ్రహించారు. అలా ప్రారంభమైనదే ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం. దళితులలో అట్టడుగు కులాలకు చెందినవారు లేవనెత్తిన డిమాండ్లు, చేపట్టిన ఉద్యమం అత్యంత ప్రజాస్వామికమైనవి. సమాజ వివక్షతకు గురవుతున్న దళిత వర్గంలోనే కొన్ని ఉపవర్గాలకు న్యాయబద్ధంగా రావాల్సిన అవకాశాలు రాకపోవడంతో వారిలో ఏర్పడిన తీవ్ర అసంతృప్తి, వ్యతిరేకతలే ఉద్యమ రూపంలో ముందుకువచ్చాయి. అయితే తమ వర్గ ప్రయోజనాల కోసం పాలకులు భిన్న సెక్షన్‌ల, కులాల, తెగల, జాతుల మధ్య వైరుధ్యాలు సృష్టించి, కొనసాగిస్తున్నారు. ఈ కోణంలో దళితులలోని అట్టడుగు కులాలు తమ హక్కుల కోసం సంఘటితపడటం, ఉద్యమరూపంలో ముందుకు రావటం సహించ లేకపోయినప్పటికీ, పాలకులు అది అందివచ్చిన వరంగా భావించారు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని పాలకులు దళితుల్లో చీలికలు సృష్టించారు. వారి మధ్య శత్రుత్వాన్ని పెంచి పోషించారు. తమ అవసరాలకనుగుణంగా వాడుకోవటానికి ప్రయత్నిస్తూ వస్తున్నారు. ఈ విషయాన్ని దళిత సామాజిక వర్గానికి చెందిన సోదరులు కూడా గుర్తించి ఉంటారు. గతానికి, వర్తమానానికి సంబంధించిన పాలకుల ఆచరణ, సంకుచిత రాజకీయ ప్రయోజనాలే రిజర్వేషన్‌ల వర్గీకరణలో జరుగుతున్న జాప్యానికి కారణం.

గతంలో ఒక అనుభవం ఉన్నప్పటికీ ఒక రాజకీయ సైద్ధాంతిక నిబద్ధత, త్యాగనిరతి కలిగిన విప్లవ పార్టీలు ప్రజల, ప్రజాస్వామిక వాదుల ఆకాంక్షలకనుగుణంగా ప్రభుత్వంతో చర్చలకు వచ్చినట్లే, యావత్ మాదిగజాతి ఆశలు, ఆకాంక్షలను గౌరవించి మాదిగ దండోరా (ఎం.ఆర్.పి.ఎస్.) ఉద్యమం గత టిడిపి ప్రభుత్వాన్ని, ప్రస్తుత కాంగ్రెస్ ప్రభుత్వాన్ని, దాని అధినేతలను నమ్ముతూ వచ్చింది. ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమానికి కూడా అనుభవాలు లేకపోలేదు. ఎందుకంటే గత ప్రభుత్వం మాదిరిగానే వై.ఎస్. పలుమార్లు వర్గీకరణకు సానుకూలమంటూ ప్రకటించారు. అసెంబ్లీలో తీర్మానం చేయించారు. ఉషా మెహ్రా కమిషన్‌ను వేయించి నివేదిక తెప్పించారు. బూటాసింగ్ నివేదికను కేంద్ర ప్రభుత్వానికి అందేవిధంగా కృషిచేశారు. రేపోమాపో కేంద్ర క్యాబినెట్‌లో తీర్మానం చేయించి పార్లమెంట్‌లో బిల్లుకూడా పెట్టించ బోతున్నట్లుగా చివరివరకు నమ్మించారు. ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం కూడా ఈ పరిణామాలను నమ్ముతూ వచ్చింది. ఈ ప్రయత్నాలు సహజంగానే ఎవరికైనా ఒక 'నమ్మకాన్ని' కలిగిస్తాయి. ఇదే ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమానికి కలిగింది. ఈ ప్రయత్నాలు కూడా ఉద్యమ ఒత్తిడి ఫలితమే. తుది ప్రయత్నాలు కార్యరూపం దాల్చకపోవడానికి పలు కారణాలు ఉండవచ్చు. పాలకులు ఏ ప్రయత్నాలైనా తమ ప్రయోజనాలకు లోబడి చేస్తారన్నది జగమెరిగిన సత్యం. కనుక నమ్మకం కలిగి ఉండటాన్ని తప్పుపట్టడం లేదు. కాని ఇటువంటి సమయంలోనే నమ్మకంతో పాటు నాయకత్వానికి అప్రమత్తత, సమయస్ఫూర్తితో కూడిన సమరశీల ఉద్యమ కార్యాచరణ కూడా కలిగి ఉండాల్సిందే.

## వర్గీకరణ సమస్య - నాటి టిడిపి ప్రభుత్వ ద్వంద్వ వైఖరి

మాదిగ దండోరా చేసిన మూడేండ్ల సుదీర్ఘ (1994-97) పోరాటం, వివిధ రాజకీయ, ప్రజాసంఘాల ఒత్తిడి వలన అప్పటి టి.డి.పి. ప్రభుత్వం 1997లో రిజర్వేషన్‌ల వర్గీకరణ చేస్తూ జిఒ నెం.68, 69లను జారీ చేసింది. మాదిగ సామాజిక వర్గం దాని ఉపకులాలకు ప్రయోజనం చేయాలన్న సంకల్పం కంటే, దళితులలో అనైక్యతను సృష్టించి, సుదీర్ఘకాలం కొనసాగే విధంగా చర్యల్ని చేపట్టిందే తప్ప వర్గీకరణ సమస్యకు శాశ్వత పరిష్కారాన్ని చూపలేదు. అవకాశం ఉన్నప్పటికి టి.డి.పి. ప్రభుత్వం పట్టించుకోకపోవడానికి కారణాలు లేకపోలేదు. దళిత వర్గంలోని మాదిగ, మాల సామాజిక వర్గాలను ఏక కాలంలో తమ అధికార ప్రయోజనాలకు వాడుకోవడమే ఆ కారణం. రిజర్వేషన్‌ల వర్గీకరణ శాశ్వత పరిష్కార విషయంలో టి.డి.పి. ప్రభుత్వానికి కొరవడిన నిజాయితీ, చిత్తశుద్ధి లేమి వలన, తగిన చొరవను ప్రదర్శించలేకపోయింది. దీనితో హైకోర్టు డివిజన్ బెంచ్ ఈ జిఒలను రాజ్యాంగ విరుద్ధమంటూ రద్దు చేసింది. ఒకవేళ అప్పటి టి.డి.పి. ప్రభుత్వానికే నిజాయితీ, చిత్తశుద్ధి ఉండి ఉంటే, రాజ్యాంగంలోని ఆర్టికల్ 338 ప్రకారం జాతీయ షెడ్యూల్డ్ కులాల తెగల కమిషన్‌ను సంప్రదించాలి. ముందస్తుగా ఈ పనికీ పూనుకోలేదు. మాదిగ దండోర తిరిగి ఉద్యమాన్ని చేపట్టింది. తెలుగుదేశం ప్రభుత్వం నిజాయితీ లేనితనాన్ని ఎత్తి చూపింది. తమ న్యాయమైన ప్రజాస్వామిక డిమాండ్‌ను పరిష్కరించడానికి తగిన చర్యలను తీసుకోవాలనీ డిమాండ్ చేసింది. మాదిగ సామాజిక వర్గానికి చెందిన అన్ని ఉపకులాల వారిని సమీకరించి, సంఘటిత పరిచింది. సమరశీల పోరాటాలకు సన్నద్ధపరిచింది. భిన్న రాజకీయ పార్టీల, ప్రజాసంఘాల మద్దతును పొందింది. ఇతర సామాజిక వర్గాల మద్దతును విస్తారంగా కూడగట్టింది. పెరుగుతున్న ఉద్యమ ఒత్తిడి ఫలితంగా తలొగ్గిన నాటి టిడిపి ప్రభుత్వం ఎస్.సి., ఎస్.టి. జాతీయ కమిషన్‌ను సంప్రదించాల్సిన స్థితికి నెట్టబడింది.

ఇదే సమయంలో రిజర్వేషన్ల అమలు, దళిత వర్గంలోని వివిధ కులాలు రిజర్వేషన్లు పొందుతున్న తీరుపై అధ్యయనం చేయడానికి జస్టిస్ రాంచందర్ రాజు కమిషన్‌ను వేసింది. దళితవర్గంలోని వివిధ కులాలకు రిజర్వేషన్లు పొందుతున్న తీరులో అసమానతలు, వ్యత్యాసాలు ఉన్నట్లు కమిషన్ గుర్తించింది. సామాజిక న్యాయానికి అనుకూలంగా దళిత వర్గంలోని అన్ని కులాలు సమన్యాయాన్ని పొందాలంటే రిజర్వేషన్ల వర్గీకరణ అవసరమని సూచించింది. అంతేకాదు 'ఆయా గ్రూప్‌ల జనాభా వాస్తవ సంఖ్యను బట్టి ప్రాధాన్యత క్రమంలో ఎక్కువ అణచివేతకు గురవుతున్న వారికి మొదటి ప్రాధాన్యత ఇవ్వాలని సిఫార్సు చేసింది.' దీని ఆధారంగా రిజర్వేషన్ల సమ పంపిణీకి ఎస్.సి., ఎస్.టి. జాతీయ కమిషన్‌ను ఆనాటి టి.డి.పి. ప్రభుత్వం సంప్రదించింది. 1998 ఏప్రిల్ 22న అసెంబ్లీలో ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేసింది. 2000లో రాష్ట్ర శాసనసభ రిజర్వేషన్ల వర్గీకరణ హేతుబద్ధతను ఆమోదించింది. హైకోర్టు ధర్మాసనం కూడా ఇదే సంవత్సరం ధృవీకరించింది. దీనితో 2000-04 మధ్యకాలంలో రిజర్వేషన్ల వర్గీకరణ చట్టం అమలయింది.

వాస్తవానికి టి.డి.పి. ప్రభుత్వం తొలుత చేసిన తప్పును సరిదిద్దుకునే పేరిట మరో తప్పు చేసింది. ఫలితంగా మాదిగ సామాజికవర్గం, దాని ఉపకులాలు తీవ్రంగా నష్టపోవడమే కాకుండా, దళిత వర్గంలోని మాదిగ, మాల సామాజిక వర్గాలు విభజనకు గురై సుదీర్ఘకాలం ఘర్షణపడటానికి దోహదం చేసింది. రిజర్వేషన్ల వర్గీకరణ జి.ఒ.లు చెల్లవంటూ హైకోర్టు ఇచ్చిన తీర్పు నేపథ్యంలో ఆనాటి ప్రభుత్వం తీసుకోవాల్సిన జాగ్రత్తలన్నీ తీసుకోలేదు. భారత రాష్ట్రపతి ప్రకటించిన షెడ్యూల్డ్ కులాల జాబితాలో చేర్పులూ, మార్పులూ చేసే హక్కు రాజ్యాంగంలోని ఆర్టికల్స్ 341, 342 ప్రకారం ఒక్క పార్లమెంట్‌కే ఉంటుందన్న విషయం రాష్ట్ర ప్రభుత్వానికి తెలియదా? ఎస్.సి., ఎస్.టి, జాతీయ కమిషన్‌నూ, ఇతర రాజ్యాంగ నిపుణులను సంప్రదించిన సందర్భంలోనైనా ఈ విషయం రాష్ట్ర ప్రభుత్వం దృష్టికి రాకుండా పోతుందా? ఈ వ్యవహారమంతా తెలిసినప్పటికీ ఉద్దేశపూర్వకంగానే టి.డి.పి ప్రభుత్వం ఈ విషయాలను మరుగు పరిచిందనే చెప్పాలి. రాజ్యాంగపరంగా రాష్ట్ర ప్రభుత్వాలకు ఏ మేరకు అధికారాలున్నాయన్న విషయం టి.డి.పి. ప్రభుత్వానికి తెలవదా? నిజానికి ఈ విషయాలన్నీ టి.డి.పి. ప్రభుత్వానికి తెలుసు. అయినా ఎందుకు నిర్లక్ష్యం చేసిందంటే టి.డి.పి. ఎత్తుగడ దళిత సామాజిక వర్గంలోని మాల, మాదిగ వర్గాలను ఓటు బ్యాంకుగా ఉపయోగించుకోవడమే. కనుకనే జిఒల వరకు పరిమితమై చేతులు దులుపుకుంది. ఆ సమయంలో కేంద్రంలో ఉన్న ఎన్.డి.ఎ. ప్రభుత్వం తనకు అనుకూలమైనదే. ఎన్.డి.ఎ. ప్రభుత్వ కొనసాగింపుకు టి.డి.పి. కీలక పాత్ర పోషిస్తున్న సమయమది. అటువంటి పరిస్థితులలో టి.డి.పి. ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని ఒప్పించి పార్లమెంట్‌లో బిల్లు పెట్టించి రిజర్వేషన్ల వర్గీకరణకు చట్టబద్ధత కల్పించవలసి ఉండే. కాని టి.డి.పి. ప్రభుత్వం కావాలనే ఆ బాధ్యత నుండి తప్పుకుంది. 'తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయడాన్ని ఆనాటి ఎన్.డి.ఎ. ప్రభుత్వాధినేతలు చెబుతున్నట్లుగా అడ్డుకోగలిగిన టి.డి.పి. వర్గీకరణ చట్టం చేయడంలో ఎందుకు చొరవ ప్రదర్శించలేదు. ఇది మోసం కాదా? ముమ్మాటికి ఇది మోసం, దగాయే.

## వర్గీకరణ రెండోదశ పోరాటం

దళితులలోని మాదిగలు ఆరు దశాబ్దాలుగా అన్యాయానికి గురౌతూనే ఉన్నారు. మాదిగ సామాజికవర్గం, దాని ఉపకులాలకు విద్య, ఉపాధి రంగాలలో ఎంతో కొంత అవకాశాన్ని కల్పిస్తున్న రిజర్వేషన్లలో న్యాయమైన వాటా కోసం ప్రశ్నించటం మొదలుపెట్టారు. సమన్యాయానికి దూరం చేయబడ్డామన్న వారి ఆవేదన, రిజర్వేషన్లలో సమ పంపిణీ జరగాలన్న వారి ఆకాంక్ష, పాలకుల సాచివేత వైఖరికి విసుగుచెందిన పరిస్థితులలో సంఘటిత ఉద్యమానికి ఎం.ఆర్.పి.ఎస్. రెండోదశ ఉద్యమానికి శ్రీకారం చుట్టింది. క్రమంగా ఈ ఉద్యమం ఎస్.సి. రిజర్వేషన్ల వర్గీకరణ ఉద్యమంగా అభివృద్ధి చెందింది. తొలుత ఉద్యమం ప్రచారాందోళన కార్యక్రమాలు చేపట్టింది. విజ్ఞప్తులు, విన్నపాలకు పరిమితం కాకుండా జాతిని మేల్కొలిపి చైతన్యవంతులను చేసే ప్రక్రియలో నిమగ్నమైంది.

దశాబ్దన్నర కాలంగా కొనసాగుతున్న ఎస్.సి. వర్గీకరణ ఉద్యమం రాష్ట్రంలో భిన్న రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాల విస్తారమైన మద్దతును చూరగొన్నది. తొలి దశలో ఉద్యమ ఒత్తిడి ఫలితంగా టి.డి.పి. ప్రభుత్వ హయాంలో (2000-04 మధ్యకాలంలో) ఎస్.సి. వర్గీకరణ జరిగి రిజర్వేషన్లు అమలయ్యాయి. ఆ కాలంలో మాదిగ సామాజిక వర్గానికి దాని ఉపకులాలకు మంచి ప్రయోజనమే జరిగింది. అయితే ఎస్.సి. వర్గీకరణ శక్తుల ప్రతికూల ప్రభావం, సాంకేతిక కారణాలతో రాష్ట్ర ప్రభుత్వాలకు రిజర్వేషన్లను వర్గీకరించే హక్కు లేదంటూ, సుప్రీంకోర్టు 2004 నవంబర్ 5న ఇచ్చిన తీర్పు ఫలితంగా, 2004లో ఎస్.సి. వర్గీకరణ రద్దయింది. దీనితో మాదిగ సామాజిక వర్గానికి విద్య, ఉద్యోగ అవకాశాలకు, వారి సంక్షేమానికి తీవ్ర విఘాతం కలిగింది. ఉన్నత న్యాయస్థానం ఈ తీర్పు సందర్భంలో మాదిగ సామాజికవర్గం, దానిలోని ఉపవర్గాలకు విద్య, ఉద్యోగ రంగాలలో కలుగుతున్న ప్రయోజనాన్ని, రాజ్యాంగంలోని సామాజిక న్యాయస్ఫూర్తిని పరిగణనలోకి తీసుకోలేదు. ఇదే సమయంలో ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం ఈ తీర్పును నిరసిస్తూ, రిజర్వేషన్ల వర్గీకరణకు పార్లమెంట్ ద్వారా చట్టబద్ధత కల్పించాలన్న డిమాండ్‌తో మరోసారి ముందుకు వచ్చింది. రెండవ దశ పోరాటంలో ఎం.ఆర్.పి.ఎస్. మాదిగ సామాజిక వర్గానికి చెందిన లక్షలాది మందిని సమీకరించింది. సమాజం మద్దతు పొందడానికి పలు ప్రయత్నాలు చేసింది. ఈ ప్రయత్నాలలో భాగమే 'దళితులకు భూమి సమస్య', 'వికలాంగుల సమస్య', 'చిన్న పిల్లల గుండెజబ్బులు', 'మహిళా సాధికారత, రిజర్వేషన్లు' తదితర సమస్యలపై ఉద్యమించింది. కొన్ని విజయాలు సాధించింది. దీనితో మాదిగ సామాజిక వర్గం దాని ఉపకులాలకు చెందిన లక్షలాది మందియే కాక వివిధ సామాజిక వర్గాలకు చెందినవారు ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమంతో మమేకమయ్యారు. ఉద్యమం కార్యాచరణ పథకాన్ని రూపొందించుకొని ముందుకు సాగింది. బలమైన సంఘటిత ఉద్యమాన్ని నిర్మించింది. వివిధ రూపాల్లో పోరాటాలను నిర్వహించింది. రాష్ట్ర ప్రభుత్వం పై తీవ్రమైన ఒత్తిడిని తెచ్చింది. దీనితో 2004లో అధికారాన్ని చేపట్టిన వై.ఎస్. ప్రభుత్వం ఎస్.సి. వర్గీకరణకు హామీ ఇచ్చింది. అందులో భాగంగా ప్రజాభిప్రాయ సేకరణకు 2007లో ఉషామెహ్రా కమిటీని వేసింది. ఉషామెహ్రా

నాయకత్వాన కమిటీ రాష్ట్రంలో పర్యటించింది. ఈ సమయంలో రిజర్వేషన్‌ల వర్గీకరణను వ్యతిరేకిస్తున్న శక్తుల నుండి ప్రతికూలత ఎదురైనప్పటికినీ, కమిటీ తన ప్రక్రియను పూర్తిచేసి నివేదికను ప్రభుత్వానికి అందజేసింది.

### వర్గీకరణ సమస్య - ఉషామెహ్రా కమిషన్

దళితవర్గాల సమగ్రాభివృద్ధిని కాంక్షించే వారెవరైనా దళిత వర్గానికి సంబంధించిన సమగ్రాభివృద్ధిని గురించి చారిత్రక కారణాలను అవగతం చేసుకోకపోతే వర్గీకరణ సమస్యను అర్థం చేసుకోలేరు. 1965లోనే ఇందిరాగాంధీ ప్రభుత్వం దేశంలో ఎస్.సి, ఎస్.టి.లు రిజర్వేషన్‌లు ఉపయోగించుకుంటున్న తీరుతెన్నులపై కె.ఎన్. లోకూర్ ఆధ్వర్యంలో ఒక కమిషన్ వేసింది. ఈ కమిషన్ సమర్పించిన నివేదికలో 'కొన్ని షెడ్యూల్డ్ కులాలు, తెగలు తమకు అందవలసిన శాతం కంటే రెండు రెట్లు అదనంగా పొందారని వెల్లడించింది. కనుక షెడ్యూల్డ్ కులాలు, తెగల నుండి వీటిని మినహాయించాలని సూచించింది.' ప్రస్తుత పరిస్థితిలో ఈ సూచన ఆచరణ సాధ్యం కాకపోయినా, కనీసం రిజర్వేషన్‌ల వర్గీకరణ తక్షణమే అవసరం. 1997-98 మధ్యకాలంలో జస్టిస్ రాంచెందర్ రాజు కమిషన్ కూడా ఇదే విషయాన్ని మరోసారి స్పష్టం చేసింది. అయినా వై.ఎస్. ప్రభుత్వం ఉషామెహ్రా కమిషన్ వేసింది. ఈ కమిషన్ దాదాపు అవే విషయాలను సారాంశంగా చెప్పినప్పటికీ సమకాలీన పరిస్థితుల కనుగుణంగా కొన్ని నిర్దిష్ట సూచనలను చేసింది. విద్య, ఉద్యోగం, కేటగిరిల ప్రాతిపదికగా, తీసుకున్న ఉషామెహ్రా కమిషన్ మాదిగ సామాజిక వర్గానికి న్యాయం జరగాలంటే వర్గీకరణ అవసరమని అభిప్రాయపడింది. అందుకే మే 2008 మొదటివారంలో కేంద్ర ప్రభుత్వానికి ఉషామెహ్రా కమిషన్ తన నివేదికను అందజేసింది. రాజ్యాంగంలోని 341వ ఆర్టికల్‌లో ఒక క్లాజును అదనంగా చేర్చాలనేది ఉషా మెహ్రా కమిషన్ సారాంశం. ఎస్.సి.ల వర్గీకరణ చేయాలంటే రాజ్యాంగ సవరణ అనివార్యమని కమిషన్ పేర్కొన్నది. అంతేకాకుండా వర్గీకరణ ప్రతిపాదించే అధికారాలను రాష్ట్రాలకు ఇవ్వాలని సూచించింది. పార్లమెంట్‌లో రాష్ట్రాల ప్రతిపాదనలను పరిశీలించి, చట్టం చేయాలని చెప్పింది. రాజ్యాంగాన్ని ఇంతవరకు 120 సార్లు సవరించారు. అయినప్పుడు వర్గీకరణ విషయంలో సవరణ చేస్తే తప్పేంటనేదే? 'రిజర్వేషన్‌ల ద్వారా షెడ్యూల్డ్ కులాలన్నీ సమాన అవకాశాలు పొంది సమగ్రాభివృద్ధిని సాధించాలి' అని అంబేద్కర్ ఆశించాడు. అంబేద్కర్ సామాజిక న్యాయ స్ఫూర్తిని బలపర్చేవారంతా దళిత కులాలన్నింటికీ రిజర్వేషన్‌ల న్యాయబద్ధమైన పంపిణీ దృక్పథానికి కట్టుబడి ఉండడం కనీస కర్తవ్యం. ఇందుకు మాల సామాజిక వర్గం కూడా సానుకూలంగా ఉండటం కనీస బాధ్యత. తద్వారానే అంబేద్కర్ ఆశయ స్ఫూర్తికి నిజమైన వారసులౌతారు.

ఉషా మెహ్రా కమిషన్ ఇచ్చిన నివేదిక ఆధారంగా కేంద్ర క్యాబినెట్ ఆమోదించి పార్లమెంట్‌లో బిల్లు ప్రవేశపెట్టి రిజర్వేషన్‌ల వర్గీకరణకు చట్టబద్ధతను ఇవ్వాల్సి ఉండే. కానీ ఆ పనికి కేంద్రంలోని కాంగ్రెస్ సర్కార్ పూనుకోలేదు. ఈ సమయంలో ఎం.ఆర్.పి.ఎస్. బాధ్యతాయుతంగా ఆలోచించి చర్యల్ని చేపట్టడంలో కొంత వైఫల్యం చెందింది. ఉద్యమపరంగా కేంద్ర సర్కార్‌పై ఒత్తిడి తేవడానికి ఢిల్లీని కార్యక్షేత్రంగా చేసుకొని మాదిగ, దాని ఉపకులాలకు చెందిన వారిని సమీకరించి, పోరాటాన్ని కొనసాగించడం. రెండవది పార్లమెంట్‌లోనూ ఒత్తిడి తేవడానికి వివిధ పార్టీల మద్దతు కూడగట్టలేకపోవడం, కనీసం మాదిగ సామాజిక వర్గానికి చెందిన ప్రజా ప్రతినిధుల ద్వారానైనా పార్లమెంట్‌లో ఒత్తిడి పెంచేవిధంగా చేయడానికి జరిగిన కృషి నామమాత్రమే. కాని ఇదే సమయంలో ఉషా మెహ్రా కమిషన్ నివేదిక కేంద్ర ప్రభుత్వానికి అందిన సమయంలో వర్గీకరణను వ్యతిరేకించే మాల సామాజిక వర్గానికి చెందిన వారంతా ఢిల్లీ స్థాయిలో తమకున్న బ్యూరొక్రసీ, రాజకీయ పలుకుబడిని ఉపయోగించి చట్టం కాకుండా నిలువరించగలిగారు.

### వర్గీకరణ సమస్య - వై.ఎస్. ప్రభుత్వ సాచివేత వైఖరి

వాస్తవానికి 2009 ఫిబ్రవరి పార్లమెంట్ సమావేశాలలో రిజర్వేషన్‌లకు చట్టబద్ధత కల్పించడానికి బిల్లు ప్రవేశపెట్టాలి. అంటే ఉషామెహ్రా కమిషన్ నివేదిక ఆధారంగా ముందు క్యాబినెట్ బిల్లును ఆమోదించాలి. తదుపరి పార్లమెంట్‌లో బిల్లు పెట్టాలి. కానీ పాలక, ప్రతిపక్ష పార్టీలు ప్రధానంగా కాంగ్రెస్ ప్రభుత్వానికి ఈ విషయంలో చిత్తశుద్ధి, నిజాయితీ లేనితనం వల్ల పార్లమెంట్‌లో బిల్లు ఏమోగానీ, కనీసం క్యాబినెట్‌లో కూడా బిల్లును ఆమోదించలేదు. ఇందుకు కారణాలు లేకపోలేదు. తొలి నుండి పాలక, ప్రతిపక్ష పార్టీలన్నీ కేవలం 'ఓటుబ్యాంక్', 'అధికార ప్రయోజనం" వరకే పరిమితమయ్యాయి. దళిత సామాజిక వర్గాన్ని వంచనకు గురిచేయడంలో కాంగ్రెస్‌కు కొత్తేమి కాదు. వర్గీకరణకు అభ్యంతరం లేదంటూనే తగిన మెజార్టీ కేంద్రంలో లేదని, అన్ని పార్టీల అంగీకారం కూడా అవసరమని, కాంగ్రెస్ ప్రభుత్వం చెప్పడం మోసపూరితమైంది. కాంగ్రెస్ పాలకులకు ప్రజాస్వామిక ఆకాంక్షలను, డిమాండ్లను, ఉద్యమాలను వంచించడం కొత్తేమి కాదు. అది నక్సలైట్ ఉద్యమం కావచ్చు, ప్రత్యేక తెలంగాణ ఉద్యమం కావచ్చు, ఆదివాసీ హక్కుల ఉద్యమాలు కావచ్చు. నమ్మించి మోసం చేయడం నెహ్రూ పాలననుండి మన్మోహన్ పాలన వరకు జరుగుతున్నదే. అంబేద్కర్ నుండి మందకృష్ణ మాదిగ వరకు కాంగ్రెస్ దగాకోరు విధానాలకు దగాపడ్డవాళ్లే.

### ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం - ఎన్నికలు

ఈ స్థితిలో నమ్మించి, మోసగించిన కాంగ్రెస్‌ను ఓడించడమే లక్ష్యంగా తాము మహాకూటమితో కలిసి ఎన్నికల బరిలోకి దిగబోతున్నట్లు దండోర ఉద్యమ నేత మందకృష్ణ మాదిగ ప్రకటించారు. ఇందుకు ఆయన మరో కారణం కూడా చెపుతున్నారు. ఇప్పటివరకు చట్టసభలలో సమర్థవంతంగా తమ వాణిని వినిపించడానికి ఎవరు లేనందునే అసెంబ్లీ, పార్లమెంట్‌లలో తమ సమస్య నివేదించబడటం లేదనీ, అందుకు కొంతమంది ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమ నేతలను చట్టసభలలోకి పంపడానికి రాజకీయ పార్టీని పెట్టి, మహాకూటమితో ఎన్నికల పొత్తుకు సిద్ధం అయినట్లు మందకృష్ణ మాదిగ చెప్పారు. ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం ఎన్నికల్లో పోటీచేసే ఉద్దేశమేమంటే కాంగ్రెస్‌ను ఓడించడం, తమ ఉద్యమ నేతలను చట్టసభల్లోకి పంపడం.

కానీ నాయకత్వ వ్యవహార శైలివలన మహాకూటమి తో ఎన్నికల పొత్తు సాధ్యపడలేదని కొందరి అభిప్రాయం. అభిప్రాయాలేమైనప్పటికీ పై ఎత్తుగడ రీత్యా ఒకరిద్దరూ ప్రతినిధులు చట్టసభల్లోకి వెళ్లవచ్చునేమోకాని భవిష్యత్‌కాలంలో ఉద్యమపరంగా నష్టాలే ఉంటాయి. అలా కాకుండా లక్ష్యసాధనలో తమ సభ్యులు చట్టసభల్లోకి వెళ్లినా, వెళ్లకపోయినా ఎం.ఆర్.పి.ఎస్. ఒంటరిగా పోటీ చేయడం ద్వారా కొన్ని స్థానాలలో మార్జిన్ ఓట్లతోనైనా కాంగ్రెస్‌ను ఓడించడానికి ఉపయోగపడుతుంది. అంతకంటే ముఖ్యమైన ప్రయోజనం ఉద్యమాన్ని నిర్మాణపరంగా, రాజకీయంగా పటిష్టపర్చుకోగలుగుతారు. క్యాడర్‌లో మరింత ఉద్యమస్ఫూర్తిని, పోరాటపటిమను పెంపొందించగలుగుతారు. 'ఎన్నికలు' 'చట్టసభలలో ప్రతినిధులు' వంటి భ్రమలవైపు క్యాడర్ వెళ్లకుండా ఉంచగలుగుతారు. ఎందుకంటే ఇదొక రాజకీయ నిర్ణయం కనుక. నిజానికీ రిజర్వేషన్‌ల వర్గీకరణ సామాజిక అంశంగా కనపడే రాజకీయ అంశం. సమరశీల రాజకీయ ఉద్యమమే ఈ సమస్యకు పరిష్కారం. దీనివలన ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమానికి మంచి రాజకీయ గుర్తింపు రావడానికి అవకాశం ఉంటుంది. వాస్తవానికి చట్టసభలో వర్గీకరణ ఉద్యమవాణి అసలు లేదనలేం. దశాబ్దన్నర కాలంగా నలుగుతున్న ఈ సమస్య రాష్ట్ర, కేంద్ర చట్టసభల్లో మాదిగ సామాజిక వర్గానికి చెందిన ప్రతినిధులు ఎంతోకొంత తమ వాణిని వినిపిస్తూనే ఉన్నారు. రాష్ట్రంలో కొనసాగుతున్న ఉద్యమ ప్రభావం వలన కూడా అన్ని పార్టీల్లో ఉన్న, ప్రధానంగా మన రాష్ట్రానికి చెందిన పార్లమెంట్ సభ్యులకు కూడా తెలుసు. అయినా నోరు విప్పలేదు. పార్లమెంట్‌లో సమస్య ఎజెండాలో రాకపోవడానికి పాలకవర్గ పార్టీల మోసపూరిత విధానాలే ప్రధాన కారణం. ఒకవేళ పాలకవర్గ పార్టీలే చేయాలనుకుంటే వాళ్ల ప్రయోజనాలు ఏ మేరకు ఉన్నాయనే దాన్ని బట్టే ఉంటుంది. ఈ విషయం ఎందుకు చెప్తున్నానంటే 'మహిళా రిజర్వేషన్‌ల బిల్లు' పరిస్థితి చూశాం కనుక. పార్లమెంట్‌లోను, అసెంబ్లీలోను ప్రతినిధులున్న టి.ఆర్.ఎస్. తెలంగాణ రాష్ట్రాన్ని ఎందుకు సాధించలేకపోయింది? ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు ఆవశ్యకత విషయంలో తమ వాదనను పార్లమెంట్‌లో బలంగా వినిపించిన టి.ఆర్.ఎస్. సభ్యులు ఈ విషయంలో విజయం ఎందుకు సాధించలేకపోయారు? ఉద్యమ బాటను వదలి ఎన్నికల బాటను పట్టారు కాబట్టే, ఎం.ఆర్.పి.ఎస్. కూడా ఎన్నికల బాట పడితే రేపు అదే పరిస్థితి ఉత్పన్నం కాదా?

ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమ నాయకత్వం కారణాలేమైనప్పటికీ పాలకవర్గ పార్టీలను నమ్ముతూ రావడం ఆయా సందర్భాలలో సందర్భానుసారంగా, వేసే ఎత్తుగడలు కూడా ఏదో ఒక పాలకవర్గానికి ఉపయోగపడుతూ రావడం దీనిలో భాగమే. ప్రధానంగా ఉషామెహ్రా కమిషన్ నివేదిక కేంద్ర ప్రభుత్వానికి నివేదించే సమయంలో ఎం.ఆర్.పి.ఎస్. నాయకత్వం ప్రభుత్వం మీద, ముఖ్యంగా వై.ఎస్. పైన భారం వేసిందే తప్ప ఈ కాలంలో మాదిగ సామాజిక వర్గానికి చెందిన ప్రజలను సమీకరించి, పోరాటాల్ని ఉధృతం చేయడం, ప్రతిపక్ష పార్టీలు, ముఖ్యంగా మాదిగ సామాజిక వర్గానికి చెందిన ప్రజా ప్రతినిధుల సహకారం పొంది, వారి ద్వారా పార్లమెంట్‌లో ఒత్తిడి పెంచడంలో పూర్తిగా వైఫల్యం చెందిందని చెప్పాలి. వ్యూహాత్మక ఎత్తుగడల రీత్యా ఆయా సందర్భాలలో పాలక ప్రభుత్వాలను నమ్ముతూ వచ్చానని మందకృష్ణ చెప్పడం ఏమేరకు సమంజసం? ఇది మాదిగ సామాజిక వర్గాన్ని మోసగించారన్న వారి వాదనకు బలం చేకూర్చడం కాదా? రిజర్వేషన్‌ల వర్గీకరణ చట్టబద్ధత విషయంలో సుప్రీంకోర్టు తీర్పు తరువాత అప్పటి టిడిపి ప్రభుత్వ వైఖరి అంతకుముందు పార్లమెంట్ ద్వారా చట్టబద్ధత సాధించి పెట్టే విషయంలో టిడిపి అనుసరించిన విధానం తదితర విషయాల నుండి మందకృష్ణ ఏమి గ్రహించినట్లు? అని కొంతమంది అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తున్నారు. ఇది నిజమే! ఎత్తుగడలనేవి వ్యూహాత్మక విధానాలపై ఆధారపడి ఉంటాయి. ఆ విధానాలను పటిష్టపరిచేవిగాను, ముందుకు తీసుకుపోయేవిగాను ఉంటాయి. అంతిమంగా వ్యూహాత్మక లక్ష్యాన్ని సాధించేవిగా ఉంటాయి. మందకృష్ణ మాదిగ చెప్తున్న వ్యూహాత్మక ఎత్తుగడలు అందుకు అనుగుణంగా ఉన్నాయా, లేవా? అనేది ఉద్యమ శ్రేయోభిలాషులు పరిశీలించవలసి ఉంది.

## ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం – కొరతలు

ఉషామెహ్రా కమిషన్ కేంద్ర ప్రభుత్వానికి నివేదిక సమర్పించిన సమయంలో ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం రెండు విషయాల్లో మరింత ఒత్తిడి పెంచి ఉంటే ప్రయోజనకారిగా ఉండేది. ఢిల్లీని ఉద్యమ కార్యక్షేత్రంగా చేసుకొని వేలాదిమందిని సమీకరించి ఉద్యమం ద్వారా ఒత్తిడి పెంచాల్సి ఉండే. మాదిగ సామాజిక వర్గంలో ప్రజా ప్రతినిధులను, వివిధ పార్టీలకు చెందిన ప్రజాప్రతినిధుల ద్వారా కూడా పార్లమెంట్‌లో ఒత్తిడి పెంచే విధంగా కృషి చేసి ఉంటే బాగుండేది. ఈ ప్రక్రియకు ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం పూనుకోకపోగా మౌనంగా పాలకనేతలపై ఆధారపడే వైఖరిని ప్రదర్శించింది. ఉద్యమాన్ని నడిపే, సమిష్టి నిర్ణయాలు తీసుకోవడంలో బలమైన కేంద్ర నాయకత్వం తగినంతగా లేకపోవడం. కొన్ని సందర్భాలలో అధినాయకుడి నిర్ణయాలే సమిష్టి నిర్ణయాలుగా అమలులోకి రావడం. వెసులుబాటులేనితనం నాయకత్వం నిర్ణయాల్లో కనపడడం. డెమోక్రటిక్ అప్రోచ్‌లోను లోపాలున్నాయి. విశాల ప్రజాస్వామిక ఉద్యమ నిర్మాణానికి అవసరమైన ప్రాతిపదికను ఏర్పర్చుకోవడంలోను, ప్రజాస్వామికశక్తులను, మేధావులను ఉద్యమం లోకి సమీకరించుకోవడంలోను, వారి మద్దతు సమకూర్చుకోవడంలోను ఉద్యమం వైఫల్యం కొంత కనబడుతోంది. రిజర్వేషన్‌ల వర్గీకరణను బలపరుస్తున్న వివిధ రాజకీయ పార్టీల, ప్రజాసంఘాల ఆచరణాత్మకమైన మద్దతును పొందలేకపోవడం, మాదిగ సామాజిక వర్గానికి చెందిన కొంత మేధావి సెక్షన్‌ను కూడా పోగొట్టుకోవడం ఉద్యమానికి నష్టకరమే.

## పాలకవర్గ పార్టీలన్నీ ఒకే తానులో ముక్కలే

తొలినుండి రిజర్వేషన్‌ల వర్గీకరణ విషయంలో పాలక, ప్రతిపక్ష పార్టీలన్నీ నిజాయితీగా వ్యవహరించలేదు. ప్రధానంగా సుప్రీంకోర్టు తీర్పు నేపథ్యంలో ఈ పార్టీలు చిత్తశుద్ధి లేమిని ప్రదర్శిస్తూ వచ్చాయి. కేవలం అధికార ప్రయోజనాల పరిధిలోనే ఆలోచిస్తూ వచ్చాయి. తాజా పరిణామాలు ఈ స్థితినే సూచిస్తున్నాయి. అందువలన విధిగా ఈ పార్టీలన్నీ ప్రస్తుత పరిణామాలకు బాధ్యత వహించాల్సిందే. అయినప్పుడు ఈ పార్టీలలోని మహాకూటమిని ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం

విశ్వాసంలోనికి తీసుకోవడం సరైన వైఖరి కాదు. ఎందుకంటే ఐదుగురు సభ్యులు గల టి.ఆర్.ఎస్., ఐదుగురు సభ్యులు గల టి.డి.పి. ఒకరో ఇద్దరో సభ్యులున్న మజ్లిస్‌పార్టీలు కానీ, అరవై మంది సభ్యులున్న వామపక్ష పార్టీలు కానీ ఏనాడూ పార్లమెంట్‌లో పల్లెత్తు మాట మాట్లాడలేదు. ఇక కాంగ్రెస్ సరేసరి. కనీసం కాంగ్రెస్ పార్టీలో ఉన్న మాదిగ సామాజిక వర్గానికి చెందిన సభ్యులు సైతం పెదవి విప్పకపోవడం శోచనీయం.

### మంచిచెడులను పరిశీలించుకోవడం ఉద్యమ బాధ్యత

ఆంధ్రజ్యోతి పత్రిక, కాంగ్రెస్ పార్టీ కార్యాలయాలపై దాడుల సందర్భాలలో ఉద్యమ నిరాశనుండి దండోరా ఉద్యమం హింసాత్మక మార్గాన్ని చేపట్టిందనే వాదన ముందుకు వచ్చింది. ఉద్యమ నడవడికపై పలు వ్యాఖ్యానాలు కూడా చేసినవాళ్లున్నారు. ఈ వ్యాఖ్యానాలతోను, వాదనలతోను ఏకీభవించకపోయినా ఒక విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. వస్తున్న విమర్శలలో వాస్తవాలను పరిశీలించుకోవాల్సిన బాధ్యత ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమంపై ఉన్నది. అయితే ఈ ఘటనలను ఇతరులు ఎవరైనా పరిశీలించవలసి వస్తే వాస్తవ కోణంలో పరిశీలించవలసి ఉంది.

గాంధీభవన్‌పైనా, ఆంధ్రజ్యోతి కార్యాలయంపైనా దాడులు యాదృచ్ఛికంగా జరిగిన ఘటనలు కావు. దళిత సామాజికవర్గం, ముఖ్యంగా మాదిగ సామాజిక వర్గానికి చెందిన వారు తమ పట్ల కొనసాగుతున్న నిర్లక్ష్యం, అణచివేత, అన్యాయం, ఆత్మగౌరవంపై జరుగుతున్న దాడికి ప్రతిఘటనగా ఈ చర్యలు జరిపారని ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం ప్రకటించింది. అయితే గాంధీభవన్‌పై దాడిని, ఆంధ్రజ్యోతి కార్యాలయంపై జరిగిన దాడిని ఒకేరకంగా చూడలేం. గాంధీభవన్‌పై జరిగిన దాడి కాంగ్రెస్ ప్రభుత్వం చేసిన వంచన, మోసం, దగాకోరు విధానాలపై జరిగిన దాడి కాగా, రెండోది కారణాలేమైనా పత్రికా స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలపై జరిగిన దాడి. సామాజిక న్యాయం గురించి మాట్లాడుతున్న ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం పత్రికా స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను కాపాడటం కూడా సామాజిక న్యాయంలో భాగమేనని గుర్తించాలి. తాత్విక దృక్కోణం నుండి ఈ విషయాన్ని చూస్తే పత్రికలు ఏ వర్గం చేతిలో ఉన్నాయనేది మౌలికమైన అంశమే అయినప్పటికీ జర్నలిస్టిక్ విలువలను, స్వేచ్ఛను పరిరక్షించాల్సిన బాధ్యత కూడ ఉందన్న విషయాన్ని ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం విస్మరించరాదు. అందువలన ఈ కోణంలోనే దాడి సరికాదనేది. అదే సమయంలో అణగారిన బడుగువర్గాల పట్ల ఆంధ్రజ్యోతి యాజమాన్యం వైఖరిని కాని, పత్రికా సిబ్బంది తదుపరి ప్రవర్తన శైలి కాని అంగీకరించదగినవి కావు. ఎందువల్లనంటే పత్రికా కార్యాలయంపై దాడి అనంతరం జరిగిన పరిణామాలు ఒక తప్పును సరిదిద్దే పేరుతో తప్పును సరిదిద్దే వాళ్లే తప్పు చేయడం కూడా సరియైనది కాదు. పరిణామాలను పరిశీలిస్తే మాత్రం అది పత్రికా స్వేచ్ఛనా, లేక యాజమాన్యపు స్వేచ్ఛనా? అనే సందేహం రాక మానదు. పత్రికా స్వేచ్ఛా ఉన్నదనేది భౌతిక సత్యం. దానిని గౌరవించడం మన బాధ్యత. ఎవరైనా స్వేచ్ఛను దుర్వినియోగం చేయడం సరికాదు. అది వ్యక్తి స్వేచ్ఛ కావచ్చు, పత్రికా స్వేచ్ఛ కావచ్చు.. స్వేచ్ఛ పేరుతో జరిగే దుర్వినియోగాన్ని నిలువరించే బాధ్యత పౌర సమాజంపై ఉంది. అవినీతి ఒక అంశం అనుకుంటే దాన్ని ఎత్తిచూపి, నిర్మూలనకు జరిగే కృషిలో తేడాలు, వివక్షతలు ఉండరాదు. ఆ విచక్షణను ఆంధ్రజ్యోతి పత్రిక పాటించిందా అన్నదే ప్రశ్న.

పాక్షిక పోరాటాల నుండి ఉన్నత సాయుధ పోరాటాల వరకు నడిపిన నేల మనది. మాతృభాష నుండి వెట్టిచాకిరి మొదలు భూమి, భుక్తి, విముక్తి కోసం ఉద్యమాలు నిర్మించిన గడ్డ మనది. వేలాది మంది వీరుల నెత్తుటి సాక్షిగా నవ తెలంగాణ ఆవిష్కరణ కోసం పోరాటాలను నడిపిన పురిటి గడ్డ మనది. ఈ ఉద్యమాలలో కీలకమైన భూమికను పోషించిన దళిత వర్గాలు ఆ తరువాత కాలంలో కూడా ఈ గడ్డ మీద తమ ఆత్మగౌరవం కోసం, రాజ్యాంగం కల్పించిన కొన్ని హక్కుల సాధన కోసం శాంతియుతంగా ఉద్యమాలు నిర్మించి పోరాటాలు నిర్వహిస్తున్న నేల మనది. అందువలన పార్లమెంటరీ పంథా అంటేనే పాకురుపట్టిన జారుడు బండ లాంటిది. దాని ద్వారా హక్కులు సాధించుకోవాలనుకోవడం మన ఉద్యమాన్ని మనమే బలహీనపరుచుకోవడం అవుతుంది. సరిగ్గా పాలక వర్గాలు కోరుకునేది కూడా ఇదే. పాలకుల దృష్టిలో ఏదో రకంగా, ఏదో ఒక రూపంలో రాజకీయ, సామాజిక ఉద్యమాల్ని బలహీనం చేయడమే లక్ష్యంగా ఉంటుంది. ఎం.ఆర్.పి.ఎస్. ఉద్యమం అందుకు లక్ష్యం కాకూడదు. అలా కాకపోవడం ద్వారానే సురేందర్ మాదిగ, దామోదర్ మాదిగ, మహేష్ మాదిగల ఆశయ స్ఫూర్తికి నిజమైన వారసత్వాన్ని అందించగలుగుతాం. ■

**వచ్చే సంచికలలో...**

- **ఫోకస్ - జూన్ 2009 : కొత్త ప్రభుత్వం - సొంత ఎజెండా - ప్రజల ఆకాంక్షలు**
- **ఫోకస్ - జూలై 2009 : కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నెల రోజుల పనితీరు**
- **గ్రామాభివృద్ధి, గ్రామీణ ఉపాధి పథకం - ఒక సమీక్ష - ముదునూరి భారతి**
- **జాతీయ ఉపాధి హామీ పథకం - అమలు - బుర్ర శ్రీధర్, కేతిరెడ్డి వాసు**
- **ప్రైవేటీకరణ పడగ నీడలో సింగరేణి - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి**

*నిజమైన అభివృద్ధి శాస్త్రీయ, మౌలిక ప్రణాళికల పునాదిపై జరుగుతుందనీ, ఇప్పటి సంక్షోభానికి పెట్టుబడి ఎగదోసిన కృత్రిమ పెరుగుదలే కారణమనీ అంటున్నారు* **కె. నరేంద్రమోహన్**

# ప్రపంచ ఆర్థిక మాంద్యం

ప్రస్తుతం ప్రపంచం ఎదుర్కొంటున్న ఆర్థిక సంక్షోభం వ్యాపార చక్రంలోని తాత్కాలిక మాంద్యం కాదనీ, 1929–33 మధ్య చవిచూసిన మౌలిక, దీర్ఘకాలిక మాంద్యమన్న వాస్తవికత భారత వ్యాఖ్యాతలు ఇప్పుడిప్పుడే గుర్తిస్తున్నారు. రెండవ ప్రపంచ యుద్ధంలో కార్మికశక్తిని పెద్ద ఎత్తున సైనికులుగా చేర్చుకోవడం, మట్టుపెట్టడం, పారిశ్రామిక సామర్థ్యాన్ని యుద్ధకాల ఉత్పత్తికి మార్చటం, మిలిటరీ, కర్మాగార నిల్వలను పెద్ద ఎత్తున విధ్వంసం చెయ్యటం, చివరిగా యుద్ధంలో నేలమట్టమైన యూరపు, జపాన్‌ల పునఃనిర్మాణ కార్యక్రమాల ద్వారా అప్పటి ప్రపంచ సంక్షోభాన్ని అధిగమించగలిగారు.

ఇప్పటి సంక్షోభం నుంచి ప్రపంచాన్ని బయటికి లాగే చోదకశక్తి ఏది? ఒకవేళ అటువంటిది దేనినైనా కనుగొంటే ఈ సంక్షోభం నుంచి 'బయటపడడానికి' మానవాళి ఈ మూల్యం చెల్లించవలసిందేనా? అన్నిటికి మించి ఈ మాంద్యం ప్రభావం ఉపాధి మీద, వేతనాల మీద, ఆహారం, వైద్యం, విద్య వంటి ప్రజాసేవల మీద ఎలా ఉంటుంది?

ముందుగా పెద్ద ఆర్థిక వ్యవస్థలను చూద్దాం. అన్ని సూచికలలో అమెరికా తీవ్ర రోగ లక్షణాలను కనబరుస్తోంది. కార్మిక శక్తిలో నిరుద్యోగం 8 శాతంగా ఉందని అమెరికా కార్మిక గణాంకాల బ్యూరో చెబుతోంది. ఇతరులు ఇది 9.5 శాతమని చెబుతున్నారు. పూర్తికాల ఉద్యోగం కోరుకుంటున్న అసంఖ్యాక పార్ట్–టైం ఉద్యోగులను పరిగణనలోకి తీసుకుంటే నిరుద్యోగం అసలు చిత్రం 19 శాతం దాకా ఉండవచ్చు. గత పన్నెండు నెలలోనే 50 లక్షలమంది కార్మికులు పని కోల్పోయారు. నిరుద్యోగుల సంఖ్య 1.25 కోట్లని అధికారిక గణాంకాలే చెబుతున్నాయి. 2008 చివరి త్రైమాసికంలో వ్యాపార కార్యకలాపాలు 6 శాతం మేర తగ్గిపోయాయి. యాభై సంవత్సరాలకు పై నుంచీ అమెరికా ఆర్థిక విధానానికి వెన్నెముకగా ఉన్న మోటారు కారు పరిశ్రమ అవసాన దశలో ఉంది. ప్రభుత్వం నుంచి ప్రజాధనం సహాయంగా లభించినప్పటికీ మహా అయితే మరికొన్ని నెలలు మాత్రమే కంపెనీని నడపటానికి నిల్వలున్నాయని జిఎం కంపెనీ ఆడిటర్లు అంచనా వేశారు. తన నిర్వహణకు నిధులను సమకూర్చుకోవటానికి లగ్జరీ యూరోపియన్ బ్రాండ్లు అయిన జాగ్వార్, లాండ్‌హోవర్ వంటి వాటిని ఫోర్డ్ అమ్మేసుకుంటోంది. క్రిస్లర్ కంపెనీకి 1980లలో ప్రభుత్వ ధనం లభించింది. మధ్యలో రెండుసార్లు చేతులు మారింది. ఇప్పుడు మరోసారి ప్రజాధనాన్ని అందుకుంటోంది.

మరి కార్మికుల పరిస్థితి ఏమిటి? 1.9 కోట్ల ఇళ్లు అమ్ముడు పోకుండా ఉన్నాయి. ఇంకోవైపున పట్టణాలు, నగరాల బయట వేలాది మంది గుడారాలలో ఉంటున్నారు. ఇంతకుముందు 'గౌరవప్రదమైన' మధ్యతరగతి జీవనం గడిపిన సేల్స్‌పర్సన్స్‌తో సహా అనేకమంది గుడారాలలోనూ, కారు ఇళ్లల్లోనూ నివసించడమూ అన్ని నగరాలలో పెరిగిపోతోంది.

రెండవ అతిపెద్ద ఆర్థిక శక్తి అయిన జపాన్‌లో జనవరిలో పారిశ్రామిక ఉత్పత్తి 10 శాతం తగ్గింది. నవంబర్ – ఫిబ్రవరి త్రైమాసిక కాలంలో 27 శాతం తగ్గింది. 2008–09లో ఎగుమతులు 45.7 శాతం తగ్గాయి. 2008 జనవరితో పోలిస్తే 2009 జనవరిలో మోటారు కార్ల ఉత్పత్తి 45.7 శాతం తగ్గింది. ఫిబ్రవరిలో నిరుద్యోగుల సంఖ్య మరో రెండులక్షలు పెరిగింది.

యూరప్‌లో పరిస్థితి చూస్తే ఇంగ్లండ్‌లో ప్రధాన బ్యాంకులన్నీ సాంకేతికంగా దివాలా తీసినట్లే. అప్పులను తీర్చేటంతగా వాటి ఆస్తులు లేవు. అంతే కాకుండా ప్రభుత్వం వీటికి పెద్ద ఎత్తున నిధులు సమకూరుస్తున్నందున ఇవి పేరుకు మాత్రమే 'ప్రైవేట్' బ్యాంక్‌లుగా ఉన్నాయి. ఇక్కడ నిరుద్యోగుల సంఖ్య 25 లక్షలుగా అంచనా వేస్తున్నారు.

అతి చిన్న దేశమైన ఐస్‌ల్యాండ్ దివాలా తీసింది. లాట్వియాలో నిరుద్యోగం 2009లో 50 శాతానికి పెరుగుతుందని అనుకుంటున్నారు. లాట్వియాలో రెండవ అతిపెద్ద బ్యాంక్ అయిన ఫ్యారెక్స్ ఖాతాదారులు భయాందోళనలకు గురి కావడంతో అది కుప్పకూలిపోయింది. లాట్వియాలోని మూడు అతి పెద్ద బ్యాంక్‌లను ప్రభుత్వం జాతీయం చేసింది. 2008లో దీని స్థూల దేశీయ ఉత్పత్తి (జిడిపి) పది శాతం పడిపోయింది. 2009లో మరో పది శాతం పడిపోతుందని అంచనా వేస్తున్నారు. ఐస్‌ల్యాండ్ జాతీయ రుణం దాని జిడిపికి ఎనిమిది రెట్లకు పెరిగిపోయింది.

ఈ సంక్షోభం వల్ల ఎంతో శక్తిమంతమనుకున్న డాలర్‌పై విశ్వసనీయత పోతోంది. డాలర్ స్థానంలో మరో విశ్వకరెన్సీని ప్రవేశపెట్టాలని చైనా కోరినట్లు వాల్‌స్ట్రీట్ జర్నల్ (24 ఏప్రిల్) ప్రచురించింది.

కాలిఫోర్నియాలోని ఇల్లు లేని వాళ్ల దగ్గరనుంచి బీజింగ్‌లోని సెంట్రల్ బ్యాంక్ వరకు సంక్షోభానికి మూలం ప్రతి కార్మికుని శ్రమకీ, దాని ఉత్పత్తికీ మధ్య సంబంధంలో ఉంది.

మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతంపై ప్రస్తుతం చర్చలోకి వెళ్లకుండా ప్రపంచ సంక్షోభంలో కేంద్రంగా ఉన్న కార్మికుల పరిస్థితిని పరిశీలిద్దాం. అమెరికాలో 1973 నుంచి వాస్తవిక వేతనాలలో ఎదుగుదల లేదు. అమెరికాలో పనిచేస్తున్న పిల్లలు ఉన్న తల్లిదండ్రులకు ఈ విషయం వెల్లడవుతోంది. ఒక దశాబ్దం, రెండు దశాబ్దాల నాటితో పోలిస్తే వాళ్ల పిల్లలకు వస్తున్న జీతాలు పెద్దగా పెరగలేదు. ఇంకోవైపున శ్రామిక ప్రజలకు కార్పొరేట్ పెట్టుబడిదారీ విధానం అనంత సరుకులను (వీటిల్లో చాలావరకు వినియోగదారీ చెత్త) అమ్మే మౌలిక అవసరాన్ని కొనసాగించుకుంటోంది.

గత మూడు దశాబ్దాలుగా అమెరికాలోని కార్మికులు భార్యాభర్తలిరువురూ పనిచెయ్యడం, అనేక ఉద్యోగాలు చెయ్యడం, క్రెడిట్ కార్డు అప్పులు, ఇళ్ల తనఖా వంటి వాటి ద్వారా తమ ఖర్చుస్థాయిని నిలబెట్టుకోగలుగుతున్నారు. ఇంకోవైపున ఆర్థిక నియంత్రణల తొలగింపు, పెట్టుబడి అత్యంత చలనశీలత్వాన్ని సంతరించుకోవడం, తిరోగామి పన్నుల విధానం, ప్రైవేటీకరణ, మూడవ ప్రపంచంలోని శ్రమకొట్టాలకు ఉత్పత్తిని ఔట్‌సోర్సింగ్ చెయ్యడం వంటి వాటి ద్వారా అమెరికాలోని ఒక చిన్న వర్గం సంపద అనంతంగా పెరిగింది. దీంట్లో అధికభాగం సంపద హైడ్జ్ ఫండ్స్ స్పెక్యులేషన్, ఫ్యూచర్స్ స్పెక్యులేషన్, మార్ట్‌గేజ్ ఆధారిత డిరైవేటివ్స్ లోకి వెళ్లింది. అంటే ఇళ్ల ధరలు నిరంతరం పెరుగుతాయని అంచనా. భవిష్య కరెన్సీ విలువలు, సరుకుల ధరలు, రుణ చెల్లింపుల వైఫల్య బీమా, బ్యాంకర్లు సృష్టించిన ఇతరత్రా వంటి వాటి కారణంగా కాగితం మీద సంపద ఇబ్బడిముబ్బడిగా పెరిగింది.

కొంతమంది చేతులలో పెట్టుబడి పెద్ద ఎత్తున సమకూరడం, చైనాలో పర్యావరణానికి వినాశకరంగా పరిణమించే చెత్తను ఉత్పత్తి చేస్తుండటం, వాల్-మార్ట్ వంటి రిటైల్ చైన్ల ఆకలిని మూడవ ప్రపంచం పెంచటం, అంతిమంగా మిలిటరీ దాడులకు ప్రభుత్వం పెద్ద ఎత్తున నిధులు సమకూర్చటం వంటి వాటివల్ల ఒక పెద్ద పేకమేడ నిర్మితమయ్యింది. అది కుప్పకూలిందంటే ఆశ్చర్యపడాల్సింది కాదు, ఇంతకాలం నిలబడిందంటేనే ఆశ్చర్యపోవాలి.

2003లో ఇరాక్‌పై దాడి చేసిన నాటినుంచి అమెరికా మిలిటరీ బడ్జెట్‌పై మూడు లక్షల కోట్ల డాలర్లను ఖర్చు చేసింది. ప్రపంచవ్యాప్తంగా ఒక సంవత్సరంలో మిలిటరీపై ఖర్చు చేసే మొత్తంలో అమెరికా వంతు 47 శాతం. ఈ మిలిటరీ ఖర్చుకీ, దేశీయ ఖర్చుకీ అమెరికా ప్రభుత్వం బాండ్లను జారీచెయ్యటం ద్వారా నిధులను సమకూర్చుకుంది. అమెరికాకి, దాని ఖాతాదారులైన చమురు, పెట్రోలియం ఎగుమతి దేశాలకు (ఒపెక్) ఎగుమతులను సబ్సిడైజ్ చెయ్యటానికి చైనా, జపాన్‌లు ఈ బాండ్లను పెద్ద సంఖ్యలో కొనుగోలు చేశాయి. అమెరికా ప్రభుత్వ రుణ బ్యూరో ప్రకారం జాతీయ అప్పులు (ఏప్రిల్ 27 నాటికి) 11,046,928,257,101.20 డాలర్లు. దీనిని రూపాయలలోకి మార్చటానికి ప్రయత్నించకుండా తలసరి అప్పు ఎంత ఉందో చూస్తే పరిస్థితి కొంతవరకు అర్థమవుతుంది. సగటున ప్రతి అమెరికా పౌరుని పైన 36,314 డాలర్లు (సుమారుగా 15 లక్షల రూపాయల) అప్పు ఉంది. అమెరికా అప్పు ప్రతి సంవత్సరం ఐదు లక్షల కోట్ల డాలర్ల చొప్పున పెరుగుతోంది. దీనినుంచి బయటపడేమాట అటుంచి అమెరికా బాండ్లను చైనా తాజాగా కొనటం ఆపివేస్తే అమెరికా ఊబిలో మరింతగా కూరుకుపోతుంది. చైనా శ్రమకొట్టాలలో ఉత్పత్తి చేస్తున్న చెత్తకి గిరాకి తగ్గటం, డాలరు విలువ తగ్గటం వల్ల అమెరికా బాండ్లను ఉంచుకోవటం వల్ల చైనాకి పెద్ద ప్రయోజనమేమీ ఉండదు.

చైనాలో ఉత్పత్తి తగ్గడం వల్ల జపాన్‌లో కీలకరంగాలైన మోటారు కార్లు, ఓడలు, ఉక్కు, వినియోగ ఎలక్ట్రానిక్ సరుకులు, సెమికండక్టర్ల రంగాలు పడిపోవడం వల్ల ప్రపంచ వ్యాప్తంగా ముడిసరుకుల మార్కెట్లు పతనమవుతాయి. 2009లో చైనా ఎగుమతిలో సున్నా ఎదుగుదల లేదా తగ్గుదలను కూడా చూడవచ్చని స్టాండర్డ్ అండ్ చార్టర్డ్ ఆర్థికవేత్తలు అంచనా వేస్తున్నారు.

బ్యాంకులను జాతీయం చెయ్యకుండా, శ్రమ ప్రధాన పంథాలోకి (ఉదాహరణకి పర్యావరణ పరంగా సుస్థిరమైన పద్ధతుల్లోకి ఉత్పత్తినీ, ఇంధనం వెలికితీతను మార్చటం) నిధులను కేటాయించకుండా అమెరికా 11.6 లక్షల కోట్ల డాలర్లతో ఒక కార్యక్రమం తయారు చేసి కార్పొరేషన్ల 'విషపూరిత' ఆస్తులను కొనాలనుకుంటోంది. బ్యాంకులకు ఈక్విటీ సమకూర్చాలనుకుంటోంది. ఉత్పత్తిలోకి పెట్టుబడులను మార్కెటు 'అదృశ్యహస్తం' మళ్లిస్తుందని ఆశిస్తోంది.

వ్యవస్థపరంగా చూసుకుంటే ఒకసారి తగినంత పెట్టుబడి నిర్మూలింపబడిన తరువాత - ఆ పరిస్థితులు కొనసాగితే - కొత్త పెట్టుబడులు, అభివృద్ధి తరంగం వస్తుంది. శ్రామిక ప్రజలకు భవిష్యత్తులో ఏముందన్నది కచ్చితంగా ఊహించటం కష్టం. ఎందుకంటే ఆర్థికరంగం తిరిగి కోలుకోవటమన్నది ఎవరికీ తెలియదు. ప్రపంచంలోనే అత్యంత సంపన్నులైన ముగ్గురు వ్యక్తులు వారెన్ బఫెట్ (ఆర్థిక), బిల్‌గేట్స్ (పరిశ్రమ), జార్జ్ సోరోస్‌లు (హెడ్జ్ నిధులు) ఆర్థికరంగం తిరిగి కోలుకోవటానికి ఆరు నుంచి పది సంవత్సరాల వరకు పట్టవచ్చని అంచనా వేస్తున్నారు.

అయితే ఒక పరిమాణం మాత్రం కచ్చితంగా జరుగుతుంది. నష్టాలను అందరిమీదా రుద్ది, లాభాలను మాత్రం కొద్దిమంది జేబులో వేసుకుంటారు. కార్మికుల వేతనాలు, జీవన ప్రమాణాలు పడిపోతాయి. వైద్య, విద్య, పెన్షన్ వంటి వాటితో సహా సేవారంగం క్షీణిస్తోంది. కార్పొరేషన్లు ఉద్యోగస్తులను తొలగిస్తుండటంతో 50 ఏళ్ల వయసు పైబడి, ఉద్యోగం కోల్పోయినవాళ్లకు మళ్లీ ఉద్యోగం దొరికే అవకాశం ఉండక పోవచ్చు. చదువు పూర్తి చేసుకున్న విద్యార్థులకు ఉపాధి అవకాశాలు బాగా కుంచించుకుపోతాయి. వయసులో ఉన్న ఉద్యోగస్తులు తీవ్ర అభద్రతా భావానికి గురి అవుతారు. ఎవరి ఉద్యోగాలలో ఎదుగుదల ఉండదు. వేతనాలు పెరగవు, వ్యాపారసంస్థలు పనిగంటలు తగ్గించి వెయ్యటంతో పార్ట్‌టైం ఉద్యోగులుగా మారవచ్చు.

భారతదేశంలో 'కొత్త ఆర్థిక విధాన' రంగాలైన సాఫ్ట్‌వేర్, బిపిఒ, ఉన్నతవర్గాలకు గృహకల్పన, రిటైల్‌మాల్స్, సంపన్నుల హోటళ్లు, విమానయానం, మహానగరాల్లో అల్ప సంఖ్యాకులైన పెద్దమొత్తాల ఉద్యోగస్తుల జీవనశైలి అవసరాల కోసం ఏర్పడిన రంగాల వంటి వాటిల్లో ఎదుగుదల ఆగిపోయి, అంతిమంగా క్షీణతకు గురయ్యే ప్రమాదముంది.

క్షీణతకు గురవుతున్న సామ్రాజ్య దశలోకి అమెరికా అడుగుపెట్టడంతో హెచ్ 1 వీసాలు దొరకటమన్నది గతస్మృతిగా

*భిన్నాభిప్రాయాన్ని కలిగి ఉండడం, ప్రజల పక్షాన రాజ్యాన్ని ప్రశ్నించడం పాలకులకు ఎంత కంటగింపో బినాయక్ సేన్ నిర్బంధం మరోసారి రుజువు చేసిందని అంటున్నారు* **డి.వి. రామకృష్ణారావు**

# కొనసాగుతున్న బినాయక్ సేన్ నిర్బంధం

**డా.** బినాయక్ సేన్ చత్తీస్‌గడ్‌కు చెందిన రాయ్‌పూర్‌లో పిల్లల, ప్రజా వైద్యులు. అంతేకాక పౌరహక్కుల ఉద్యమ కార్యకర్త. ఆయన పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పియుసిఎల్)కు జాతీయ ఉపాధ్యక్షులుగా ఉన్నారు. గ్లోబల్ హెల్త్, మానవ హక్కుల కృషికి గాను మే 2007లో ఆయన జోనాథన్ మన్ అవార్డ్‌కు ఎంపికయ్యారు. రెండు దశాబ్దాలకు పైగా ఆయన వైద్యసేవలో నిమగ్నమై పసిపిల్లలకు, పేద ప్రజలకు, మారుమూల ప్రాంత గిరిజనులకు వైద్య సేవలందించారు. ఎటువంటి వైద్య సేవలు లేని, పోవడానికి కూడా దుర్లభమయ్యే ప్రాంతాలకు పోయి వేలాది మందిని మలేరియా, డయేరియా వంటి రోగాల బారినుంచి కాపాడారు.

బినాయక్ సేన్ 14 మే 2007న చత్తీస్‌గడ్ ప్రత్యేక ప్రజా భద్రత చట్టం (2005), చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (1967)ల కింద అరెస్ట్ అయ్యారు. ఇరవై మూడు నెలలుగా రాయపూర్ జైల్లో ఉన్నారు.

జైలు అధికారుల అనుమతితో సీనియర్ మావోయిస్టు ఖైదీ నారాయణ్ సన్యాల్‌కి వైద్య సేవలందించారు. ఆ క్రమంలో మావోయిస్టు ఖైదీ సన్యాల్ రాసిన ఉత్తరాలు పియూష్ గుహ అనే వ్యాపారికి బినాయక్ సేన్ అందజేసారనే ఆరోపణతో పోలీసులు ఆయనను అరెస్ట్ చేశారు.

నేరస్థుడు దేశం విడిచి పారిపోతాడనే భయం ఉన్నప్పుడో, సాక్ష్యాలను తారుమారు చేసే ప్రమాదం ఉందని భావించినప్పుడో, ప్రమాదకరమైన చర్యలకు పాల్పడవచ్చునే ఉద్దేశం ఉన్నప్పుడో ఖైదీకి బెయిల్ నిరాకరిస్తారు. అలాంటిది నిత్యం ప్రజాసేవలో ఉండే బినాయక్ సేన్‌కు చత్తీస్‌గడ్ ప్రభుత్వం బెయిల్ ఇవ్వడానికి నిరాకరించింది. జూలై 2007లో ఒకసారి, డిసెంబర్ 2008లో మరోసారి చత్తీస్‌గడ్ హైకోర్టు ఆయనకు బెయిల్ ఇవ్వడానికి నిరాకరించింది.

జోనాథన్ మన్ అవార్డ్‌ను అందుకోవడానికి బినాయక్ సేన్‌ను అనుమతించాలని కోరుతూ ఇరవై రెండు మంది అంతర్జాతీయ నోబుల్ బహుమతి గ్రహీతలు తమ సంతకాలతో కూడిన లేఖలో రాష్ట్రపతి, ప్రధాని లను కోరారు. జాతీయ, అంతర్జాతీయ మీడియా ఈ విషయాన్ని అందరి దృష్టికీ తీసుకువచ్చింది.

బినాయక్ సేన్ జైలులో ఉండడం వల్ల ఆయన ఆరోగ్యం మరింత క్షీణించే ప్రమాదం ఉందని కుటుంబ సభ్యులూ, ప్రజలూ ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఆయన 2003 నుంచే హైపర్ టెన్షన్‌తో బాధపడుతున్నారు.

బినాయక్ సేన్‌ని నిర్బంధించడంపై అరుంధతి రాయ్ స్పందిస్తూ చత్తీస్‌గడ్‌లో అంతర్యుద్ధ స్థితి వల్ల ఇప్పటికే వందలాది మంది చనిపోయారని, అనేకమంది అమాయక ప్రజలు జైళ్లలో మగ్గుతున్నారని అన్నారు. ప్రాణభయంతో పేద ప్రజలు అడవుల్లో తలదాచుకున్నారనీ, విద్య, వైద్యం, ఆహారం అందకుండా, బాహ్య ప్రపంచంతో ఎటువంటి సంబంధం లేకుండా జీవిస్తున్నారన్నారు. మరోవైపు ప్రభుత్వం ఏర్పాటు చేసిన సల్వాజుడుంలో ఉన్న పేదలు కూడా గూడారాల్లో సైనికుల పహారాలో గడిపే పరిస్థితే ఉంది. క్రూరమైన హింస ఒక ఉన్మాదంలా వ్యాపించిన స్థితి చత్తీస్‌గడ్‌లో ఉంది. మొత్తంగా పేద ప్రజల మధ్య చిచ్చుపెట్టారని అరుంధతి రాయ్ అన్నారు.

బినాయక్ సేన్ ఈ పరిస్థితులకు వ్యతిరేకంగా మాట్లాడడం వల్లనే ప్రభుత్వం ఆయనను జైల్లో పెట్టిందన్నారు. బూటకపు ఎన్‌కౌంటర్లపై నిజనిర్ధారణ చేసినందుకు, సల్వాజుడుంను వ్యతిరేకించినందుకు

---

మారుతోంది. లాభాలుతగ్గటం, ఆర్డర్లు తగ్గటం, ధరలు తక్కువగా ఉన్న నేపథ్యంలో లాభాల స్థాయిని కొనసాగించటానికి పెట్టుబడిదారీ వర్గం కార్మికుల (వారి వేతనాల)పై గొడ్డలి ఎక్కుపెట్టడంతో పారిశ్రామిక, గనుల, వ్యవసాయ కార్మికుల పరిస్థితి తీవ్రతరమౌతోంది. కార్మికుల అశాంతిని ఎదుర్కోటానికి ప్రభుత్వాలు అణచివేతకు గురిచేసే కొత్త చట్టాలు చేయడానికి పూనుకుంటాయని అనటంలో సందేహం లేదు. అదే సమయంలో తమ సామాజిక ఆధారాన్ని బలోపేతం చేసుకోటానికీ, ప్రజలు స్థూలంగా విప్లవ పంథావైపు పయనించకుండా ఉండటానికీ ఫాసిస్టు మితవాద వర్గాలు కొత్త దాడులకు పూనుకుంటాయి.

పెట్టుబడిదారీ విధానం కుప్పకూలిపోవటం లేదని వామపక్ష వర్గాలకు చెప్పాలి. భారాన్ని అంతా శ్రామిక ప్రజలకు బదిలీ చేసి అది కొనసాగుతుంది. లేదా యుద్ధాలలో పారిశ్రామిక మారణహోమం చేపడుతుంది. మధ్యతరగతి ప్రజల విషయానికొస్తే పరిస్థితుల అనివార్యత వల్ల రెండు దశాబ్దాల అనంతరం వాళ్లు వీథుల్లోకి వస్తారు. ఆర్థిక విధానాల పగ్గాలు సమాజ నియంత్రణలో పారదర్శకంగా, జవాబుదారీగా ఉండాలని కోరతారా లేక మతం రంగు పులుముకున్న ఫాసిజం ఢంకా రావాల వైపుకు అడుగు వేస్తారా అన్నది మనముందున్న ప్రశ్న.

(తెలుగు అనువాదం : కె. సురేష్) వీ

ఆయనను నిర్బంధించారని అన్నారు. చత్తీస్‌గడ్‌లో కొనసాగుతున్న అంతర్యుద్ధానికి బినాయక్ లాంటి వారి అరెస్టులతో నిశ్శబ్ద గోడలు నిర్మించడమే ప్రభుత్వ లక్ష్యమని అరుంధతి రాయ్ పేర్కొన్నారు. మొత్తంగా ఈ నిర్బంధం మాటను పేరు, ముఖం తెలియని వందలాదిమందిపై అమలవుతున్న నిర్బంధాన్ని ఏ గుర్తింపుకూ, ఎవరి దృష్టికీ రాకుండా చేయడమే ప్రభుత్వం ఉద్దేశ్యం. బినాయక్‌సేన్ లాంటి నిజమైన ప్రజాసేవకులు జైలులో ఉండడం, హంతకులు ఎన్నికల్లో పాల్గొనడమే మనముందున్న స్థితని అరుంధతి రాయ్ అభిప్రాయపడ్డారు. ఈ పరిస్థితి మన గురించి ఏం సూచిస్తోంది? మనం ఎవరి గురించి ఉన్నాం? ఎక్కడికి మన ప్రస్థానం? అని అరుంధతి ప్రశ్నించారు.

బినాయక్ సేన్ కూతురు ప్రాణహిత సేన్ తండ్రి ఆరోగ్యం గురించి చెబుతూ జనవరి, మార్చ్ నెలల్లో నాన్న ఛాతినొప్పితో అవస్థపడగా, న్యాయమూర్తి వైద్య సేవలకు సిఫారసు చేసారని, రాయ్‌పూర్‌లో హృద్రోగ వైద్యులు డా. ఆశీష్ మల్హోత్రా పరిశీలించి, బైపాస్ శస్త్రచికిత్స కోసం సి.ఎం.సి. వెల్లూరుకు సిఫారసు చేశారని చెప్పారు. అయితే ఆయనను ఇప్పటికీ వైద్యానికి అనుమతించక పోగా, చత్తీస్‌గడ్ ఎస్.పి. వైద్యునికి చూపించినందుకు జైలర్‌ను తిట్టారని తెలిపారు.

14 మే 2007 తన తండ్రిని అరెస్ట్ చేసాక ఇంట్లో సోదా చేయడానికి నూట యాభై మంది కానిస్టేబుళ్లు, ఇరవై ఐదు మంది పోలీసు అధికారులు వచ్చారన్నారు. ఇలాంటి చర్యల ద్వారా ప్రజలకు ఒక మావోయిస్ట్‌ను పట్టుకున్నామనే భావనను కలిగించదలచు కున్నారన్నారు. 'ఎరుపు' మాట ఉన్న ప్రతి పుస్తకాన్ని తీసుకుపోయారు. తన సోదరి లెక్కల పుస్తకాన్ని కూడా ఏదో సంకేతభాష ఉందని చెప్పి పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. తల్లి ఇలీనా మహాత్మాగాంధీ అంతర్జాతీయ హిందీ విశ్వవిద్యాలయం వార్ధాలో జనరల్ స్టడీస్ ప్రొఫెసర్‌గా పనిచేస్తూ రాయ్‌పూర్‌లో 'రూపాంతర్' అనే స్వచ్ఛంద సేవా సంస్థను నడుపుతున్నారు. బినాయక్‌సేన్ అరెస్ట్ తదనంతర పరిణామా లలో తల్లి, చెల్లెలు రాయ్‌పూర్ విడిచిపెట్టి వెళ్లాల్సి వచ్చిందని ప్రాణహిత సేన్ తెలిపారు. ఎప్పటికీ పోలీస్ నిఘా ఉండడంతో తల్లి, చెల్లి వార్ధాకూ, తాను ముంబయిలో చదువుకోసం తరలిపోయినట్లు చెప్పారు. ఫోన్లుట్యాప్ అవుతున్న కారణంగా మాటలు కూడా పరిమితమై పోయాయన్నారు.

జాతీయ మీడియా కూడ జైల్లో మగ్గుతున్న తన తండ్రి గురించి ఒత్తిళ్ల మూలంగానూ, భయంతోనూ బయట ప్రపంచానికి తెలియ జేయడం లేదన్నారు. మావోయిస్టులతో తన తండ్రికి ఎలాంటి సంబంధం లేదని, కులవివక్షకు గురవుతున్న గ్రామీణ పేద ప్రజల పట్ల సానుభూతితో మాత్రమే వ్యవహరించేవారని ఆమె తెలిపారు.

భర్త ఆరోగ్యం గురించి ఇలీనా తీవ్ర ఆందోళనకు గురవుతూ చత్తీస్‌గడ్ ప్రభుత్వం తన భర్తను అంతమొందించే కుట్రకు పాల్పడుతోందన్నారు. బినాయక్ సేన్ కు వెల్లూరు చికిత్సను నిరాకరించిన చత్తీస్‌గడ్ ప్రభుత్వం హత్య కేసులో నిందితుడిగా రాయ్‌పూర్ జైల్లో ఉన్న శివసేన నాయకుడు ధనంజయ్ సింగ్ పరిహార్ కు ప్రభుత్వ ఖర్చులతో  ముంబైలోని కెఇఎం ఆసుపత్రిలోనూ, చెన్నై శంకర్ నేత్రాలయలోనూ, ఇంకా మూడు వివిధ ఆసుపత్రులలో 2003లో వైద్యం చేయించిన సంగతి గుర్తు చేసారు. ఏ ఖైదీకైనా తనకు ఇష్టమైన, అవసరమైన దగ్గర వైద్యం చేయించుకునే హక్కు ఉంది. కాని బినాయక్ సేన్ విషయంలోనే వివక్ష ఎందుకని ఆమె వాపోయారు.

బినాయక్ సేన్ విడుదల కోసం వివిధ పద్ధతుల్లో నిరసనలు, ఆందోళనల ఒత్తిడి ఉన్నప్పటికీ చత్తీస్‌గడ్ ప్రభుత్వం నిరంకుశ వైఖరితో వ్యవహరిస్తోంది. ఈ క్రమంలో బినాయక్ విడుదల కోసం 16 మార్చ్ 2009 నుంచి రాయ్‌పూర్‌లో సత్యాగ్రహ కార్యక్రమాన్ని చేపట్టారు. మొదటి విడతగా జరిగిన ఈ సత్యాగ్రహంలో మెగాసెసె అవార్డ్ గ్రహీత సందీప్ పాండేతో పాటు ప్రజాస్వామిక హక్కుల కోసం పోరాడుతున్న కార్యకర్తలు దేశం నలుమూలల నుంచి పాల్గొన్నారు. బినాయక్ సేన్‌ను బందీగా ఉంచిన రాయ్‌పూర్ జైలు ముందు ప్రతి సోమవారం సత్యాగ్రహం చేపట్టాలని నిర్ణయించారు. సత్యాగ్రహంలో పాల్గొన్నవారిలో పౌర, మానవ హక్కుల సంఘాల వారు, ట్రేడ్ యూనియన్ కార్యకర్తలు, న్యాయవాదులు, వైద్యరంగానికి చెందినవారు, మహిళా సంఘాలకు చెందినవారు, ప్రజాస్వామిక వాదులు ఉన్నారు.

తప్పుడు ఆరోపణలతో ఇప్పటికే ఇరవై మూడు నెలలుగా జైల్లో బంధించిన బినాయక్ సేన్‌ను విడుదల చేయాలని, బెయిల్‌ను నిరాకరించ వద్దని చత్తీస్‌గడ్ ప్రభుత్వాన్ని కోరారు. బెయిల్ నిరాకరణ రాజ్యాంగం కల్పించిన మౌలిక హక్కులకు, న్యాయస్ఫూర్తికి విరుద్ధం అన్నారు. ప్రజాస్వామ్య స్ఫూర్తికి 'బెయిలే రూల్ అని, తప్పని స్థితిలోనే జైలు అని' నినదించారు.

17 ఏప్రిల్ 2009న సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి వి.ఆర్.కృష్ణ అయ్యర్ ప్రధాని మన్మోహన్ సింగ్‌కు రాసిన లేఖలో బినాయక్ సేన్ విషయంలో జరుగుతున్న ప్రభుత్వ తప్పిదాలను నిశితంగా విమర్శించారు. బినాయక్ సేన్ లాంటి వారికి బెయిల్ ఇవ్వకపోవడం వలన న్యాయవ్యవస్థపై సామాన్యులకు నమ్మకం పోతుందన్నారు. బినాయక్ సేన్ విషయంలో ప్రాసిక్యూషన్ ప్రవేశపెట్టిన 83 సాక్ష్యాలు వీగిపోయాయని, ఎటువంటి సాక్ష్యాధారాలు లేకుండా రెండుసార్లు బెయిల్ నిరాకరించడం సరైంది కాదన్నారు. బినాయక్ సేన్ ఆరోగ్యం గురించి ఆందోళన వ్యక్తం చేస్తూ ఆయన కోరిన వైద్యాన్ని అందివ్వక పోవడాన్ని తప్పుపట్టారు. తనను అదుపులోకి తీసుకునే అవకాశం ఉందన్న అంచనా ఉన్నప్పటికీ బినాయక్‌సేన్ పోలీసు స్టేషన్‌కు స్వచ్ఛందంగా వచ్చారని అరెస్ట్ చేసినప్పటి సందర్భాన్ని గుర్తు చేశారు. మానవహక్కుల కోసం పోరాడే వారిని టెర్రరిస్టులుగా ముద్రవేయడం సరికాదన్నారు. ఈ మొత్తం వ్యవహారం ప్రజాస్వామ్యాన్ని, పారదర్శక పాలనా విలువలను అపహాస్యం చేయడమే కాకుండా, ప్రభుత్వ తీవ్రవాద వ్యతిరేక వ్యూహాలు, చర్యలపై అనేక సందేహాలను రేపుతోందన్నారు. సీనియర్ న్యాయవాది రాజిందర్ సచార్ బినాయక్ సేన్‌కు బెయిల్ నిరాకరించడం భారత న్యాయవ్యవస్థకే ఒక మచ్చ అని విమర్శించారు. అమ్నెస్టీ ఇంటర్నేషనల్ మానవ హక్కుల సంస్థ భారత ప్రభుత్వ వైఖరిని తప్పుపట్టడమే కాక, బినాయక్ సేన్‌ను నిర్బంధించడం దురుద్దేశపూరితమైనదని, ఆయనను వెంటనే విడుదల చేయాలని ఒక ప్రకటనలో కోరింది.

ప్రతి సోమవారం రాయపూర్‌లో జరుగుతున్న సత్యాగ్రహంలో పాల్గొనదలచుకున్న సంస్థలూ, సంఘాలూ, వ్యక్తులూ, ప్రజాస్వామిక వాదులూ వివరాల కోసం releasebinayak@gmail.comకు సంప్రదించవచ్చని బినాయక్‌సేన్‌కు సంఘీభావంగా పనిచేస్తున్న ప్రజాస్వామికవాదులు తెలియజేస్తున్నారు. వీ

కుతుబ్‌షాహీలు, అసఫ్‌జాహీలు, బ్రిటిష్ వలసాధిపత్యాలు దాటి ప్రాంతేతరుల దోపిడీకి గురవుతూ, పోరాటాన్ని కొనసాగిస్తూనే ఉన్న తెలంగాణ పోరాటాల చరిత్రను వివరిస్తున్నారు **వరవరరావు**

# నలభై ఏళ్ల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం

కుతుబ్‌షాహీల కాలం నుంచి కూడ తెలంగాణకు భాషా, సాంస్కృతిక పరమైన వివక్షకు గురయిన సమస్య ఉన్నది. పొరుగున ఉన్న ఛత్రపతి శివాజీకి, కుతుబ్‌షాహీలకు ఢిల్లీ మొగల్ రాజులు బలవత్తరమైన ఉమ్మడి శత్రువులు. కనుక మొగల్ రాజుల దాడులు ఎదుర్కోవడానికి కుతుబ్‌షాహీలకు శివాజీ సైనిక సహాయం తీసుకోవాల్సి వచ్చేది. సైనిక సహాయంతో పాటు, పరిపాలనా సంబంధమైన సహాయం చేసే క్రమంలో ఇక్కడ హైదరాబాద్‌తోపాటు తెలంగాణ పట్టణాల్లో చౌత పన్నుల వసూళ్ల కోసం మహారాష్ట్రీయులు స్థిరపడినారు. తర్వాత అసఫ్జాహీల కాలంలో కూడ మరత్వాడలోని ఔరంగబాద్, పర్భనీ, భీడ్, నాందేడ్, హైదరాబాద్ సంస్థానంలో భాగం కనుక హైదరాబాద్ పరిపాలనలో వాళ్లు తెలంగాణ విద్యావంతులకన్నా కీలక పాత్ర పోషించారు. బీదర్, గుల్బర్గా, రాయచూర్ వంటి కర్ణాటక ప్రాంతాలు కూడ హైదరాబాద్ సంస్థానంలో భాగమైనా టిప్పు సుల్తాన్‌కు, నైజాంకు బ్రిటిష్ వారి పట్ల ఉన్న వైఖరిలోని వైరుధ్యాల వల్ల వాళ్లు మహారాష్ట్రు లంత ప్రాముఖ్యాన్ని పొందలేదు. వివేకవర్ధనీ కళాశాలలో తెలుగు మాట్లాడిన వారిపట్ల చులకన భావన కలిగి ఆంధ్ర జన కేంద్ర సంఘం ఏర్పడడం వెనుక గానీ, 1914లో మాడపాటి హనుమంతరావు మహారాష్ట్రుల ఆధిక్యం గురించి రాసిన వ్యాసంలోగానీ ఈ నేపథ్యాన్ని మనం దృష్టిలో పెట్టుకుంటే ముల్కీ సమస్య ఆరంభాలను పోల్చుకోగలం.

కుతుబ్‌షాహీల పాలన ముగిసి ఆసఫ్‌జాహీల పాలనలో ఇంకొక మార్పు వచ్చింది. ఔరంగజేబు కుతుబ్‌షాహీల గోల్కొండ రాజ్యాన్ని గెలిచి ఢిల్లీ నుంచి తన సుబేదారును 1724లో దక్కన్‌కు పంపినాడు. అతడు ఆ తర్వాత స్వతంత్రతను ప్రకటించుకొని ఆసఫ్‌జాహీ వంశ పాలనను ప్రారంభించినాడు. ఆయన వెంట ఉత్తర భారతం నుంచి కాయస్థ విద్యావంతులు వచ్చినారు. మహారాజా చందూలాల్, కిషన్ ప్రసాద్ మొదలుకొని పోలీసు చర్య తర్వాత ప్రధాన కార్యదర్శులు, ఐజిల దాకా కొనసాగిన భగవాన్‌దాస్, సుశీల్ కుమార్, శ్రావణ్‌కుమార్‌ల దాకా హైదరాబాద్ పరిపాలనా విభాగం (బ్యూరోక్రసీ)లో వీరి కీలక పాత్రను గమనించవచ్చు.

వీళ్లకు లక్నవీ ఉర్దూ వచ్చు. కనుక ఇక్కడ అధికార భాష ఉర్దూ ఉన్నప్పటికీ ఇక్కడి ఉర్దూ విద్యావంతులకన్న తమ ఉర్దూ ఆధిక్యత గలదనే భావన కూడ వీళ్ల అధికార దర్పంలో కనిపించేది. వీటికితోడు గంగా నదీ తీరం నుంచి వచ్చినవాళ్లు కనుక వీళ్ల భాష, సాహిత్యం, లలితకళల్లో, ఫొటోగ్రఫీతో సహా చాల ప్రావీణ్యం ఉండి హైదరాబాద్ సాంస్కృతిక రంగం పై ప్రాబల్యం ఉండేది. హైదరాబాద్ సంస్కృతి పై తొలి ప్రాబల్యం ఈ కారణాల వలన కాయస్థులది, మహారాష్ట్రులదే. దీవాన్, పేష్కార్ వంటి బిరుదులు కాయస్థుల నుంచి, దేశ్‌ముఖ్, దేశ్‌పాండే వంటి బిరుదులు మనకు మహారాష్ట్ర నుంచి వచ్చినవేనని గమనిస్తే ఇది అవగతమవుతుంది.

నిజాంసాగర్ నిర్మాణం తర్వాత వ్యవసాయం చేయడానికి కోస్తా ప్రాంతం నుంచి రైతుల్ని పిలవడంతో హైదరాబాద్ రాష్ట్రంలో మూడవ ప్రాబల్య బృందం వచ్చింది. 1956 ఆంధ్రప్రదేశ్ ఏర్పడడంతో ఈ ప్రాబల్యం స్థిరపడింది.

అయితే మహారాష్ట్ర, కాయస్థ నాన్‌ముల్కీ సమస్యకు, కోస్తా ఆంధ్ర ముల్కీ సమస్యకు రాజకీయార్థిక పరంగా ఒక తేడా ఉన్నది. ఆ తేడా అదనపు విలువను అనుభవించే వలసపాలనకు సంబంధించినది. కోస్తా డెల్టా ప్రాంతం నుంచి వచ్చిన పాలకవర్గం కృష్ణా గోదావరి నదులపై ప్రాజెక్టుల నిర్మాణం వలన ఏర్పడిన కొత్త సంపన్న వర్గం వ్యవసాయ రంగంలో పెట్టుబడి ప్రవేశించి, వాణిజ్య పంటలు పండించి, సమృద్ధిగా పోగుబడిన సంపదలతో వీళ్లు రాజకీయాలు, ఆర్థికరంగం, వ్యాపారాలు, పత్రికలు అన్నిటిపై ఆధిపత్యాన్ని, పట్టును సంపాదించారు. 1956 నుంచి ఆంధ్రప్రదేశ్‌ను పరిపాలిస్తున్న పాలకవర్గం ఇదే. ఈ పరిపాలన అన్ని రంగాలపై ఆధిపత్యాన్ని నెరపుతూ దోపిడీలో దళారీ స్వభావాన్ని ప్రదర్శిస్తున్నది.

1953కు పూర్వం ఆంధ్ర రాయలసీమ ప్రాంతాలు మద్రాసు ప్రావిన్సులో ఉన్నాయి. కృష్ణా, గోదావరి ఆనకట్టలు, విశాఖ నుంచి రైల్వేలైను, ఆంధ్ర విశ్వవిద్యాలయం వంటివి ఎన్ని వచ్చినా మద్రాసులో పరిపాలన, కావేరీ డెల్టా కింద భూస్వాములు, పారిశ్రామికవేత్తలు కూడా అయిన బ్రాహ్మణ తమిళుల చేతుల్లో ఉండడం ఇక్కడ కొత్తగా ఏర్పడిన సంపన్న వర్గానికి 'ఉత్పత్తిశక్తుల విముక్తి'కి ఊపిరి సలపని విషయమైంది. బ్రిటిష్‌వాడు నెలకొల్పిన బ్యూరాక్రసీ నుంచి, ఇంగ్లిష్ చదువుల నుంచి అబ్బిన తెలివితేటలు, తమిళ సోదరుల నుంచి ఎదుర్కొన్న కాల్జాతులాడ నివ్వని ఒత్తిడిల నుంచి 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు కొత్త ద్వారాలు తెరచినట్లయింది.

చరిత్రకారుడు గనుక ఆంధ్రప్రదేశ్ ప్రకటిస్తూనే అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ చెప్పిన పోలిక అందుకే అర్థవంతమైంది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడితే తెలంగాణ ఆంధ్ర వలసగా మారుతుందని, అది గడుసరి పురుషునితో అమాయక స్త్రీ సాహచర్యం అవుతుందని అంటూనే ఆయన అటువంటి సాంగత్యమే కూర్చాడు.

కనుక తెలంగాణ ప్రజలు వలసపాలనను, ఆధిపత్య భావజాలాన్ని ప్రతిఘటించే పోరాటంగానే ప్రత్యేక తెలంగాణ ఉద్యమం 1969లో ప్రారంభమైంది. అప్పటిదాకా అప్పుడప్పుడు వచ్చిన నాన్‌ముల్కీ ఉద్యమాలకు, 1969 నుంచి వచ్చిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి ఆ తేడా ఉన్నది.

ఆధిపత్య భావజాల వ్యతిరేక పోరాటాలకు, వలస వ్యతిరేక పోరాటాలకు తెలంగాణలో వెయ్యి సంవత్సరాల వేర్లున్నాయి. ఆధిపత్య భావజాల వ్యతిరేక పోరాటాలకు పాల్కురికి సోమనాథుడు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు, సమ్మక్క సారలక్క, పోతన వంటి ఉదాహరణలు చెప్పవచ్చు.

వలస వ్యతిరేక పోరాటానికి తుర్రెబాజీఖాన్ మొదలు కొమురం భీం వరకు, మొఖ్దుం మొహియుద్దీన్ మొదలు సైనిక చర్య తర్వాత 'రంగు రంగుల మారి నెవరుయ్యా' రంగు పసికట్టె పోరాడిన తెలంగాణ పామరుల వరకు ఎన్ని ఉదాహరణలైనా చెప్పవచ్చు.

సాలార్జంగ్ మొదలు, రజాకార్ 'సాలార్'ల వరకు – వాళ్లలో ఉన్న వలస అనుకూల దళారీ స్వభావాన్ని తెలంగాణ ప్రజలు కనిపెట్టే పోరాడారు. కనుక అది కేవలం ఫ్యూడల్ వ్యతిరేక పోరాటం కాదు. అది వలసవాద – భూస్వామ్య వ్యతిరేకం కూడ.

తెలంగాణ రైతాంగ పోరాట చరిత్ర వివరాల్లోకి వెళ్లకుండా 69లో ప్రారంభమైన ప్రత్యేక తెలంగాణ పోరాటాన్ని దాని కొనసాగింపుగా ఎట్లా విశ్లేషించవచ్చునో చెప్పడానికి మాత్రమే ఈ మాత్రం ప్రస్తావన.

1967–68 నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాలు, 1968 ఫ్రెంచ్ విప్లవ విద్యార్థి ఉద్యమం ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రభావితం చేసాయి.

శ్రీకాకుళం జిల్లాలో పార్వతీపురం, పాలకొండ, పాతపట్నం ఏజెన్సీ ఏరియాలతో పాటు, ఉద్దానంలో భూమి, భుక్తి, విముక్తి పోరాటాలు మొదలైనట్లే 68లోనే ఖమ్మం జిల్లా కొత్తగూడెం, ఎల్లెందు, వరంగల్ జిల్లా మానుకోట, ములుగు, కరీంనగర్ జిల్లా మంతెన, మహదేవ్‌పూర్ లలో – అంటే గోదావరిలోయ పొడుగునా విప్లవోద్యమం 1968లోనే ప్రారంభమైంది. 1969లోనే శ్రీకాకుళంతోపాటు ఈ ప్రాంతాలన్నిటినీ కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించడమైనా, ఈ ప్రాంతాల్లో కూడ పోలీస్ క్యాంపులు, ఎన్‌కౌంటర్లు కొనసాగడమైనా, ఆంధ్ర విశ్వవిద్యాలయంతో పాటు తెలంగాణలోని విద్యా సంస్థలన్నీ నక్సల్బరీ రాజకీయాల ప్రభావంలోకి రావడం అయినా ఇందుకు తిరుగులేని దాఖలాలు.

శ్రీకాకుళం సెట్‌బ్యాక్‌కు గురవుతున్న సమయానికి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఊపందుకున్నది. శ్రీకాకుళం పూర్తిగా చల్లారిన సమయానికి కూడ ప్రత్యేక తెలంగాణ ఉద్యమం కొనసాగింది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి వరంగల్, సికిందరాబాద్ వంటి ప్రాంతాల్లో నాయకత్వం వహించిన విప్లవకారులు శ్రీకాకుళ విప్లవాన్ని కాపాడుకోవడానికి మనం ఇక్కడ మరో ఫ్రంట్ తెరవాలి అని కూడ అనేవాళ్లు. శ్రీకాకుళంలో కేంద్ర ప్రభుత్వ బలగాలతో ప్రతిఘటన, వియత్నామ్‌లో అమెరికా సామ్రాజ్యవాద ప్రతిఘటనకు బలాన్ని చేకూరుస్తుందని భావించేవాళ్లు. వియత్నామ్ నుంచి నక్సల్బరీ నుంచి, ప్రత్యేక తెలంగాణ దాకా – ఈ ఉద్యమాలు శత్రువును – అంటే సామ్రాజ్యవాద – భూస్వామ్య దళారీ పాలకులను బలహీనపరచే పోరాటాలుగా అప్పటి నాయకత్వాలు, ప్రజలు భావించారు. 1969 పోరాటంలో ప్రధానంగా విద్యార్థులు, ఉద్యోగస్తులు, నిరుద్యోగులైన యువకులు పాల్గొన్నా – వాళ్లు మావో చెప్పిన 'ఈ ప్రపంచం ముఖ్యంగా మనది. మనం దీన్ని చేతుల్లోకి తీసుకోవాలనుకున్న వాళ్లు.' చారుమజుందార్ చెప్పిన – యువతరం త్యాగాల, బలిదానాల – అవసరాన్ని గుర్తించిన కాలం. ఆదర్శాల, స్వప్నాల కాలం. అది పోరాటాల ద్వారానే ఆవిష్కరింపబడుతాయనుకున్న కాలం.

చైనా శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవకాలంలో, అంతకు ముందు మన దేశంలో సహాయనిరాకరణ – శాసనోల్లంఘనల కాలంలో, నక్సల్బరీ పోరాట సమయాన కలకత్తా, జాదవ్‌పూర్ యునివర్సిటీల్లో విద్యార్థులు బుద్ధిజీవులు చేసిన పోరాటాలు, త్యాగాలు వంటివే ప్రత్యేక తెలంగాణ ఉద్యమకారులు చేసినవి.

ఆ పోరాట కాలమంతా ముఖ్యంగా 1969 జనవరి నుంచి తొమ్మిది నెలలపాటు విద్యాసంస్థలు మూతబడినవి. 1972 ఉద్యమం దాకా కూడా రావిశాస్త్రి చెప్పినట్లు పోలీసు శాఖ తప్ప ప్రభుత్వంలో ఏ శాఖా పని చేయలేదు. ప్రభుత్వం అంటే పోలీసు శాఖనే అన్నమాట అని ఆయన చమత్కరించాడు కూడ.

పోరాట లక్ష్యం విధిగా రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలు – ముఖ్యంగా పోలీసుస్టేషన్లు – బ్యారికేడ్లు కట్టి బాహాబాహీ పోరని చిన్న పట్టణం కానీ, నూటనలభై నాలుగు సెక్షన్ మొదలు, కర్ఫ్యూలు, పోలీసు కాల్పులు చవిచూడని చిన్న పట్టణం గానీ తెలంగాణలో మిగలలేదు. శ్రీకాకుళ పోరాటంలో అమరులైనంత సంఖ్యలో ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో అమరులయ్యారు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో అమరులయిన వాళ్లంతా దాదాపుగా విద్యార్థులే. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో ప్రజావెల్లువను పసికట్టింది లెనిన్ – అని భావించినప్పటికీ ఫ్రెంచి విద్యార్థి ఉద్యమానికి అండగా నిలిచిన సార్త్రే, రెజిడెబ్రే, తారీక్ అలీల భావాలు 'రెక్కవిప్పిన రెవల్యూషన్' శ్రీశ్రీ అనువాదం కూడా ఆ ఉద్యమకారుల స్వప్నాలను రగిలించినవి.

ఏటూరు నాగారం గోదావరి ఒడ్డున గోదావరి దాటివచ్చి ఆక్రమించుకున్న వాళ్ల భూములను, ఇక్కడి అగ్రహారికుల భూములను కూడా స్వాధీనం చేసుకోవాలన్నారు. ఢిల్లీ నుంచి వెళ్లేరైళ్లను కాజీపేట, వరంగల్‌లలో ఆపి వ్యాగన్లు బద్దలుకొట్టి పేదవాడల్లో ధాన్యాలు పంచుకున్నారు. పోలీసు సోదాలకు, దాడులకు, చిత్రహింసలకు గురయ్యారు. ప్రతిఘటించాల్సింది ప్రభుత్వాన్ని, ప్రశ్నించాల్సింది రాజ్యాన్ని – అది చదువు కోసమైనా సరే, ఉద్యోగం కోసమైనా సరే. వాస్తవానికి చదువు, ఉద్యోగం, స్థానికత వంటివి – వలస దోపిడీ పాలనతో విసిగిన ప్రజల ఆకాంక్షల వ్యక్తీకరణ ప్రతీకలు మాత్రమే.

గాంధీజీ 'క్విట్ ఇండియా' పిలుపునందుకుని 1942లో దేశవ్యాప్తంగా రైళ్లు స్తంభించినవి. ప్రసార సాధనాలు మూగబోయినవి. అజ్ఞాతంలో బాంబులు పేలినవి. శాసనోల్లంఘన, సహాయనిరాకరణ

కాలంలో కూడ చౌరాచౌరీ పోలీసుస్టేషన్‌పై దాడి, ఘర్వారీ సైనిక తిరుగుబాట్లు ఉన్నాయి. పొట్టి శ్రీరాములు ఆమరణ నిరాహార దీక్ష కాలంలోనూ, ముగిసినాక – జరిగిన 'హింసా విధ్వంసాలు' తక్కువకాదు.

'నెత్తుటి చుక్క కారని తొమ్మిదేళ్ల' ప్రస్తుత తెలంగాణ ఉద్యమం గురించి వేనోళ్ల పొగడుతున్న వాళ్లు – ఒక తమాషా గురించి, ఒక అభాస గురించి మాట్లాడుతున్నారు. సింగరేణి ఓపన్‌కాస్ట్‌లలో, బీడుబడ్డ భూముల్లో, పోలవరం, పులిచింతల విధ్వంసంలో, ఆదిలాబాద్ నుంచి భద్రాచలం దాకా ఆదివాసుల అభద్రతలో, ప్రత్యేక ఆర్థిక మండలాలలో, మెగాసిటీని శరీశృపంలా చుట్టేస్తున్న మెట్రో రైలులో, హైటెక్ సిటీలో, బస్తీల మురికి బతుకుల్లో, మూతబడిన పరిశ్రమల్లో, ముస్లింల భయభీతావహ చూపుల్లో చూడాల్సి ఉన్నది – నెత్తురు కన్నీళ్లు కూడా కాలేకపోతున్న అసహాయతను.

కరాచీ కాంగ్రెస్ (1936) వాగ్దానం చేసిన సామ్యవాద ప్రజాస్వామ్య ప్రజాకర్షక పతాకాలన్నీ 1950 నుంచి 66 వరకు రంగులు మారుతూ తమ అసలు రంగు బయట పెట్టుకున్నాయి. సోవియెట్ ఉత్తేజంతో పంచవర్ష ప్రణాళికలు, సహకార వ్యవసాయం మొదలు ప్రభుత్వరంగంలో భారీ పరిశ్రమల దాకా మిశ్రమ ఆర్థిక విధానం వల్ల సామ్రాజ్యవాదానికి, బడాపెట్టుబడిదారులకు, బడా భూస్వాములకే స్వార్థ ప్రయోజనాలు ఒనగూర్చి, 67లో ఏర్పడిన కాంగ్రెసేతర ప్రభుత్వాల స్వభావం కూడ బెంగాల్ లెఫ్ట్‌ఫ్రంట్ ప్రభుత్వంలో నక్సల్బరీలో బట్టబయలై అప్పటిదాకా వచ్చిన 'భూసంస్కరణల' చట్టాలన్నీ భూమి మీద పరీక్షకు ప్రజల నెత్తురు తాగే శాసనాలుగా తేలినపుడు ప్రజలు ప్రత్యామ్నాయ పోరాట పంథానెంచుకున్నారు.

మిశ్రమ ఆర్థిక విధానంతోపాటు 1966లో పబ్లిక్‌లా – 480 కింద అమెరికా నుంచి గోధుమలు, ఫోర్డ్ ఫౌండేషన్ నిధులు, అమెరికా సాంస్కృతిక దిగుమతులు, ఇంటర్నేషనల్ మానిటరీ ఫండ్, ప్రపంచ బ్యాంక్ అధిపతి మక్‌నామరారాక్ – జెకొస్లావేకియాపై రష్యా దురాక్రమణ – మన దేశం వలసపాలన నుంచి రాజకీయ పాలనలో విడవడి సామ్రాజ్యవాద ఆర్థిక దిగ్బంధంలోకి పోయే దిశలో ఆరో దశాబ్దం ముగిసింది.

నక్సల్బరీ, శ్రీకాకుళం, ప్రత్యేక తెలంగాణ ఉద్యమాలను ఆ నేపథ్యంలో అర్థం చేసుకోవాలి.

నక్సల్బరీ, శ్రీకాకుళ ఉద్యమాలపై చైనా శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం ప్రభావం ఉన్నట్లుగానే ప్రత్యేక తెలంగాణ ఉద్యమంపై ఫ్రెంచ్ విప్లవ విద్యార్థి ఉద్యమ ప్రభావం ఉంది. ఈ రెండింట్లోనూ ఉన్న సాధారణ స్వభావం ప్రశ్నించడం – మనకు అనుచానంగా ఇవ్వబడిన ప్రమాణాలను, సూత్రీకరణలను ప్రశ్నించడం. ఒక చట్రాన్ని, పడికట్టు విధానాన్ని, ఆధిపత్య భావజాలాన్ని ప్రశ్నించడం.

తెలంగాణలో 1971లో జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో కూడ దీని ప్రభావాన్ని చూడవచ్చు. ఇప్పుడు ప్రజారాజ్యం పార్టీ ఏర్పడినాక యువతరంలోని ఉత్సాహం గురించి మాట్లాడినారు గానీ అది మలివిడత ఎన్నికల నాటికే ఓటర్ల అనాసక్తత, ఓటింగ్ శాతం తగ్గిపోవడంతో నీటి బుడగలా తుస్సుమన్నది. కాని 71 లోక్‌సభ ఎన్నికల్లో గాలి అంతా విద్యార్థి, నిరుద్యోగ, ఉపాధ్యాయ, నాన్–గెజిటెడ్ ఉద్యోగుల ప్రభావానిదే. వరంగల్‌లో జరిగిన అపూర్వమైన ప్రత్యేక తెలంగాణ సదస్సులో పాల్గొనడానికి ఆఖరు నిమిషంలో నిరాకరించిన దగ్గర్నించి అఖండ విజయాన్ని సాధించి తెలంగాణ ప్రజాపార్టీని కాంగ్రెస్ పార్టీలో విలీనం చేయడం వరకు చెన్నారెడ్డి – ద్రోహం అని మనం ఇపుడు మాట్లాడుకుంటున్నది – ప్రజాచైతన్యాన్ని చూసి పాలకవర్గాలు తీసుకొనే జాగ్రత్తలుగా విశ్లేషించుకోవాలి – బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వ రాజీనామా, పివి నరసింహారావు ప్రభుత్వం తెచ్చిన భూసంస్కరణలు, ముల్కీ నిబంధనలకు సుప్రీం కోర్టు ఆమోదం, రాష్ట్రపతి ఆరు సూత్రాల పథకం, రెండు ప్రాంతాల పాలకవర్గాల ఒత్తిడిలో పివి నరసింహారావు రాజీనామా – రాష్ట్రపతి పాలన – శ్రీకాకుళం, ప్రత్యేక తెలంగాణ ఉద్యమాల నరహంతకుడు జలగం వెంగళరావు ఇంటెలిజెన్స్ వర్గాల సూచనపై ముఖ్యమంత్రిగా నియమించటం – ఎమర్జెన్సీ –

ఇవే దళారీ పాలన తీసుకున్న జాగ్రత్త చర్యలు, అణచివేత చర్యలు. అక్కడి నుంచి తెలంగాణలో రాడికల్ ఉద్యమ ప్రారంభం. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలోను, రాడికల్ ఉద్యమంలోను నాయకులు ఆ విద్యార్థులే. మొదటి సారిగా – గూగీకనుక – నాయికత్వ కేంద్రం తూర్పుకు మారిందన్నట్లుగా – రాజకీయ నాయకత్వం తెలంగాణ విద్యార్థి యువతరం చేతికి వచ్చింది. ఎమర్జెన్సీ ఎత్తివేయడం నిన్నటి తూర్పు నక్సల్బరీ, శ్రీకాకుళాలవలె – నేటి జగిత్యాల జైత్రయాత్ర – ఉత్తర చూసి ఎత్తర గంప – అన్నట్లుగా నాగేటిచాళ్లలో విప్లవ విత్తనాలు చల్లింది. గ్రామాలకు తరలండి క్యాంపెయిన్ – తాత్కాలికంగా ఓడిపోయిన శ్రీకాకుళం, ప్రత్యేక తెలంగాణ ఉద్యమాలు ఒక జైత్రయాత్రలో భాగమైనవి. విద్యార్థి యువజన ఉద్యమాలు, రైతాంగ పోరాటాలు, మిలిటెంటు కార్మిక పోరాటాలు, ఆదివాసీ పోరాటాలు, దళితుల ఆత్మగౌరవ పోరాటాలు, మహిళల పురుషాధిక్యత పోరాటాలు – 78–85 కాలమంతా – అదొక మహత్తర సమగ్ర విప్లవం.

1983లో ఎన్.టి.ఆర్ కేంద్రానికి వ్యతిరేకంగా ఆత్మగౌరవ పోరాటానికి ఇచ్చిన పిలుపు ఈ ఆకాంక్షలను ఎన్నికల రాజకీయాల్లోకి అనువదించుకోవడమే. మళ్లీ 85 నుంచి 89 వరకు అమలు చేసిన అణచివేత – రాజ్యహింస ఈ ఆకాంక్షలు పాలకవర్గాల అదుపు తప్పకుండా చేయడానికి విముక్తమయిన సామాజిక ఉత్పత్తి వర్గాలను అధికారంలోకి తెస్తున్న భ్రమల్లో నెట్టె ఎస్టాబ్లిష్‌మెంట్‌లో భాగం చేయడం. కేంద్ర ప్రభుత్వాన్ని, దానికి నమ్మినబంటుగా ఉన్న రాష్ట్ర ప్రభుత్వాన్ని వ్యతిరేకించడమంటే దళారీ పాలనను వ్యతిరేకించడమని మార్క్సిస్టులు కాని విశ్లేషకులు అంగీకరించకపోవచ్చు కానీ 1969–72 మధ్యకాలంలో ప్రత్యేక రాష్ట్రాల (తెలంగాణ – ఆంధ్ర) ఉద్యమాలను బలపరచిన ఎన్నో రాజకీయ శక్తులు 83లో ఎన్‌టిఆర్ 'ఆత్మగౌరవ' పిలుపును బలపరచినవి. అందులో కరడుగట్టిన ప్రత్యేక తెలంగాణ వాదులు కూడ ఉన్నారు. ఎన్‌టిఆర్, ఈనాడు – ప్రాంతీయ బూర్జువా వర్గ ఆకాంక్షలను ప్రాతినిధ్యం వహించే భ్రమలు కల్పించారు. రాగానే 1985 ఆగస్ట్‌లో గవర్నర్ తొలగించినపుడు 59లో నంబూద్రిపాద్ ప్రభుత్వాన్ని కేరళలో పడగొట్టినప్పటి కన్నా దేశవ్యాప్త మద్దతును ఎన్‌టిఆర్ పొందాడు. రాష్ట్రంలో మొదటిసారిగా ఆర్‌ఎస్‌ఎస్ నుంచి రాడికల్స్ దాకా గవర్నర్ చర్యను నిరసించి కేంద్రం మెడలువంచారు.

1985లో రాజీవ్‌గాంధీ దేశాన్ని 21వ శతాబ్దంలోకి తీసుక పోతాననే హామీతో టాడా చట్టం తెచ్చాడు. ఇందిరపాలనలో ఆత్మగౌరవం గురించి మాట్లాడిన ఎన్‌టిఆర్ టాడా చట్టాన్ని పంజాబ్, కాశ్మీర్‌ల కన్న ఎక్కువ అమలు చేసాడు. విద్య, వైద్య రంగాలను ప్రైవేటీకరించి తెలంగాణను ప్రజాస్వామిక హక్కులను లాటిన్ అమెరికా నియంతల శైలిలో అణచివేసాడు. కేంద్రంలో రాజీవ్‌గాంధీ పాలనను పంజాబ్, కాశ్మీర్, ఈశాన్య రాష్ట్రాలు చవిచూసిన చందంగా తెలంగాణ ఎన్‌టిఆర్ పాలనను చవిచూసింది. ఈ అగ్నిపర్వతం 1990లో బద్దలయింది. కాని సోవియెట్ రష్యా, తూర్పు ఆఫ్రికా పరిణామాలు 91 నాటికి అమెరికాకు అనుకూలమై సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానంలో మనం భాగమయ్యాం. పివి నరసింహారావు నూతన ఆర్థిక విధానం పేరుతో చేపట్టిన ప్రైవేటీకరణ, సరళీకరణ, ప్రపంచీకరణ – బాబ్రీమసీదు విధ్వంసం, హైదరాబాద్ పాతబస్తీలో వందలాది ముస్లింల ఊచకోత – నగరంలోని రాయలసీమ ఫ్యాక్షనిస్టుల బాంబుదాడుల రూపంలో వచ్చింది. ఫలితం మొదటిసారిగా 92లో పీపుల్స్‌వార్ నిషేధం – ప్రజాసంఘాల నిషేధం, సరిహద్దు బలగాలు తెలంగాణలో ప్రవేశం – దేశానికి – అంటే దేశం మీద కాంగ్రెస్ ప్రభుత్వం రుద్దిన విదేశీ ప్రపంచీకరణకు తెలంగాణ సరిహద్దు అయింది.

ఎన్‌టిఆర్ 85-89 మధ్యకాలంలో అమలు చేసిన ఆర్థిక విధానంలో విద్య, వైద్యాల ప్రైవేటీకరణతో పాటు, ప్రభుత్వ సారా దుకాణం (ప్రసాదు) ప్రతి గ్రామంలో నెలకొల్పడం ఒక ముఖ్యమైన చర్య. అది సారాపై ప్రభుత్వ రెవెన్యూను 187 కోట్ల నుంచి 800 కోట్ల రూపాయలకు పెంచింది. ప్రభుత్వపరంగా సారా వేలంపాట అనేది వలసపాలన ప్రారంభించిన ఆర్థిక విధానం. సారాలో ఉపయోగించే మొలాసిస్‌ను ప్రభుత్వ చక్కెర కర్మాగారాల నుంచి సరఫరా చేస్తారు. ప్రభుత్వమే వేలంపాట వేసి ధర నిర్ణయిస్తుంది.

ఈ సారా వల్ల ఛిద్రమవుతున్న జీవితాల నుంచి సింగరేణి కార్మికుల మహిళలు సారా వ్యతిరేక పోరాటాలను గోదావరిఖనిలో ప్రారంభించి ఉత్తర తెలంగాణకు విస్తరింప చేసారు. ఎన్‌టిఆర్ ప్రభుత్వ పతన కాలం నాటికి సారాను పోలీసు స్టేషన్‌లలో, డైరీ మిల్క్ వ్యాన్‌లలో అమ్మించే స్థితి వచ్చింది. బీడీ ఆకు పోరాటం, సారా వ్యతిరేక పోరాటం–తెలంగాణలో అడివంచులలో, మైదాన ప్రాంతాల్లో మహిళల పోరాటాల్లో అవిభాజ్యమైన జీవన శైలిగా మారినవి.

1990లో చెన్నారెడ్డి రెండోసారి అధికారంలోకి వచ్చి కల్లోలిత ప్రాంతాల చట్టాన్ని ఎత్తివేసి, బహిరంగ సభలకు అనుమతించినప్పటికి 91-92 నిర్బంధం రాజ్యహింసలో రానున్న రెండవ దశకు సంకేతమయింది. 92లో నిషేధమైనా 92 నుంచి అమలయిన నిర్బంధమైనా స్పష్టంగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణను అమలు చేసే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధానాలకు అనుగుణంగా తీసుకున్న చర్యలేననేది గ్రహించాలి.

ఈ చర్యలు ఎన్నికల పార్టీలు తాత్కాలిక ప్రజాకర్షక పథకాల వాగ్దానాలు చేసి కూడ ఎక్కువ కాలం బతకలేని స్థితిని కల్పించినవి. అందులో 94లో అధికారంలోకి వచ్చిన ఎన్‌టిఆర్ ప్రభుత్వమే నిదర్శనం. రెండు రూపాయల కిలో బియ్యం, సారా నిషేధం వాగ్దానంతో అధికారంలోకి వచ్చిన ఎన్‌టిఆర్ నియమించిన ఆర్థిక మంత్రి చంద్రబాబు నాయుడు సచివాలయంలోనే ప్రపంచబ్యాంక్ బృందానికి ఒక శాఖ కేటాయించి వైస్రాయి హోటల్ కుట్ర ద్వారా ఎన్‌టిఆర్ ను పదవీచ్యుతుణ్ని చేసి అధికారం చేపట్టడమే ప్రపంచబ్యాంక్ సిఇఒ గా చేపట్టారు. కనుక 96 నాటికి పీపుల్స్‌వార్‌ను నిషేధించి, సారాపై నిషేధం ఎత్తివేసి, సంక్షేమ పథకాలు రద్దు చేసి ప్రపంచబ్యాంక్ అభివృద్ధి నమూనాను హైటెక్ స్థాయిలో చేపట్టారు. హైదరాబాద్‌ను సైబరాబాద్‌గా మార్చే ఒక విధ్వంస కార్యక్రమాన్ని ఆయన ఒక పవిత్ర విశ్వాసంగా చేపట్టారు. దీనికంతటికీ తెలంగాణ ఒక ప్రయోగశాల అయింది.

వ్యవసాయానికి కాలం చెల్లిందన్నారు. పబ్లిక్ సెక్టర్‌లోని పరిశ్రమలన్నీ మూసేసారు. రైతుల, వృత్తిపనివాళ్ల ఆత్మహత్యలు పెరిగిపోయినవి. ప్రతి సంవత్సరం ప్రపంచబ్యాంక్ ఇచ్చే ప్రణాళికలను అమలు చేయడమే పనిగా పెట్టుకున్నారు. విద్యుచ్ఛక్తి, ఆర్‌టిసి, సింగరేణి బొగ్గగనులు ప్రైవేటుపరం చేసే పనికి పూనుకుని విద్యుత్ శాఖను జెన్‌కో, ట్రాన్స్‌కోలుగా విభజించారు. విప్లవోద్యమం నాయకత్వంలో ప్రజలు ప్రతిఘటిస్తే ఎన్‌కౌంటర్లు, కోవర్టులు, మాఫియాలతో రక్తపాతం సృష్టించారు.

'96లో చంద్రబాబునాయుడు చేపట్టిన ఈ ప్రయోగానికి ప్రత్యామ్నాయంగా పీపుల్స్‌వార్ దండకారణ్యంతోపాటు ఉత్తర తెలంగాణలో కూడ స్వావలంబన, అభివృద్ధి నమూనాను గ్రామరాజ్య కమిటీల నాయకత్వంతో చేపట్టింది. గ్రామరాజ్య కమిటీల నాయకత్వంలో గ్రామ అభివృద్ధి కమిటీ తాగునీరు, సాగునీరు, విత్తనాలు, ఎరువులు, ప్రాథమిక విద్య, ప్రాథమిక వైద్యం సదుపాయాలు కల్పిస్తూ, దున్నే వారికి భూమి పంచి ఎన్నికలు, పన్నులు బహిష్కరించి గ్రామస్థాయిలో స్వావలంబన అమలు చేయడం ప్రారంభించింది. ఇందుకోసం ఉత్తర తెలంగాణను ప్రత్యేక గెరిల్లా జోన్‌గా ప్రకటించింది.

అట్లే 96లో ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ డిమాండ్‌ను కూడ ముందుకు తెచ్చింది. 97 డిసెంబర్‌లో ఆల్ ఇండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరమ్ వరంగల్‌లో ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ సదస్సు నిర్వహించి లక్షలాదిమంది ముందు వరంగల్ డిక్లరేషన్‌ను ప్రకటించింది. 98లో ఏర్పడిన తెలంగాణ జనసభ ప్రత్యేక తెలంగాణ లక్ష్య ప్రకటనతో ఉద్యమాలను నిర్మించే కృషి చేసింది.

2001లో తెలుగుదేశం పార్టీ నుంచి బయటికి వచ్చి కె. చంద్రశేఖర రావు తెలంగాణ రాష్ట్ర సమితి ఏర్పాటు చేశారు. తరువాత ఇందులో బిజెపి ఆలె నరేంద్ర కూడా వచ్చారు. 2003 పంచాయతీ ఎన్నికల్లో ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనాతో పాటు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు కూడా ఒక ముఖ్యమైన అంశమై తెలంగాణ రాష్ట్ర సమితి గణనీయమైన విజయాలు సాధించింది. 2004లో శాసనసభకూ, లోక్‌సభకూ చంద్రబాబు నాయుడు ముందస్తుగా తెచ్చిన ఎన్నికలలో ఆయనే ప్రకటించినట్టుగా ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనాతోపాటు తెలంగాణ కూడా ఎన్నికల ఎజెండాగా ఒక రెఫరెండం అవసరమైంది. అయితే ఈ రెండిటికీ ప్రాతిపదికగా నక్సలైట్లతో బేషరతుగా చర్చలు అనేది కూడా ఒక ఎజెండా అంశం అవడమనేది 1996-97 నుంచి విప్లవోద్యమం ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ కోసం చేసిన పోరాటాలు,

త్యాగాలు మహత్తరమైనవి కావడమే కారణం. ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ రూపకల్పన చేసిన శ్యామ్, మహేష్, మురళిల ఎన్‌కౌంటర్ 2004 వరకు ఈ ఉద్యమానికి ప్రజలను సమీకరించి సంఘటితపరిచి కదిలించి అమరులైన ఎందరో విప్లవకారుల కృషికీ, త్యాగానికీ ఒక సారభూతమైన ప్రతీక. అట్లే తెలంగాణ కళా సమితికి చెందిన బెల్లి లలిత, అయిలయ్య హత్యలు ప్రత్యక్షంగా, పురుషోత్తం, ఆజం అలీల హత్యలు పరోక్షంగా తెలంగాణ సాధన కోసం చేసిన త్యాగాలలో భాగాలే. తెలంగాణ రాష్ట్ర సమితి ఏర్పడిన తరువాత 2004 ఎన్నికల తరువాత కూడా తెలంగాణ గురించి ఎన్నికల పార్టీలలో ఎవరు ఒక్క నెత్తురు చుక్క కూడా ఓడ్చలేదేమో కాని ప్రజాస్వామిక ఆకాంక్షలతో పనిచేసిన తెలంగాణ జన సభకే చెందిన సుదర్శన్, కనకాచారిల హత్యలు తెరాస ప్రస్తావించడం మానేసిన వసంత్ ఎన్‌కౌంటర్ కొనసాగుతున్న ఈ త్యాగాల పరంపరలో కొన్ని ఉదాహరణలు.

2004 ఎన్నికల నాటికి స్పష్టమైన సమైక్యవాదంతో చంద్రబాబు ముందుకు వచ్చారు. తెలంగాణ గురించి మాత్రమే కాకుండా నక్సలైట్ ఎజెండాయే తన ఎజెండా అని కెసిఆర్ ఎన్నికలలో పాల్గొన్నారు. మిగిలిన అన్ని పార్టీలు టిడిపి కి వ్యతిరేకంగా నిలిచాయి. నక్సలైట్లతో బేషరతు చర్చ అనే అంశంలో టిడిపి తప్ప మిగిలిన అన్ని పార్టీలు తమ ఎజెండాలో చేర్చాయి. అంటే సారాంశంలో సమైక్య వాదం, ప్రపంచబ్యాంక్ ఆర్థిక విధానం, నక్సలైట్ల అణచివేత ఒక విధానంగా ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం, ప్రపంచ బ్యాంక్ ఆర్థిక విధానాలు విభేదించడం, నక్సలైట్లతో శాంతి చర్చలు ఒక అంశంగా ఎన్నికలు జరిగాయి. అందుకే 2005 లో రెండు విప్లవ పార్టీలతో జరిగిన చర్చల్లో ప్రజాస్వామిక హక్కులు, భూసంస్కరణలతో పాటు మూడో అంశంగా చర్చింపబడకుండా మిగిలి పోయిన అంశం స్వావలంబనలో భాగంగా ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం డిమాండ్ అయిపోయింది. కాంగ్రెస్ పార్టీ తెరాస తో పొత్తు ఉండి కూడా ఎన్నికలప్పుడు ఎట్ల గోడమీది పిల్లి వాలకం తీసుకున్నదో అట్లే చర్చల్లో స్వావలంబన, తెలంగాణ అంశాలు చర్చకు రాకుండా అట్లే దాటవేత విధానాన్ని అనుసరించింది. అయితే గత పది సంవత్సరాలలో అంటే ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ సదస్సు జరిగిన దగ్గర్నుంచి తెలంగాణ విస్తృతంగా తన మూలాలు వెతుక్కునే కృషిలో గొప్ప విజయాన్ని సాధించింది. 1969 ఉద్యమం పోరాటం లేని రోజుగా సాగినట్లుగానే ఈ పదేళ్ల ఉద్యమం తెలంగాణ గురించిన ఒక ఆలోచన, ఒక సృజన లేకుండా సాగలేదు. ఒకరకంగా రానున్న పోరాట ఉద్యమకాలానికి కావలసినంత సమాచారం పోగుపడిన కాలంగా ఇది సాగింది. విద్యావంతులు, కళాకారులు, సాంస్కృతిక కార్యకర్తలు, ప్రజాస్వామ్యవాదులు వెనుక ముందుగా ప్రతి ఒక్కరు ప్రత్యేక తెలంగాణ డిమాండ్‌ను బలపరిచే సమీకరణలు వచ్చాయి. ముఖ్యంగా ఎన్నికల పార్టీలన్నీ బయట ఉండే ఇటువంటి వ్యక్తులూ, శక్తులూ, సంఘాలూ, బృందాలూ అన్నీ కూడా తెలంగాణ రాష్ట్ర సాధన అంశాన్ని అసమ అభివృద్ధికి వ్యతిరేకంగా పోరాట అంశంగా, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట అంశంగా, ఒక స్వావలంబన పోరాట అంశంగా చూసాయి. అట్లే అన్ని రకాల ఆధిపత్య భావజాలాలు ఆత్మగౌరవానికి ప్రతీకగా చూసాయి.

కాని ఒకటి రెండు మినహాయింపులతో తప్ప బయట పనిచేస్తున్న ప్రజాసంఘాలూ ఏవీ ఈ డిమాండ్(లు) కోసం మిలిటెంట్ పోరాట రూపం తీసుకోలేదు. బోధన్‌లో నిజామాబాద్ చక్కెర ఫ్యాక్టరీ కోసం, మహబూబ్‌నగర్ కలెక్టర్ ఆఫీస్ ముందు పోలేపల్లి సెజ్ కు వ్యతిరేకంగానో ఒకటి రెండు ప్రదర్శనలూ, ధర్నాలూ, లాఠీచార్జ్‌కు దగ్గరా వెళ్లే మిలిటెంట్ రూపాలు మినహా ఒకరకంగా ఈ ఉద్యమాలు నల్లేరు మీద బండిలాగా నడిచాయి. తెరాస నాయకత్వమైతే లాబీయింగ్ మీదే విశ్వాసం పెట్టుకున్నది. కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ కాంగ్రెస్‌తో అధికారంలో పాలుపంచుకొని ఆరు నెలలు తిరగకుండానే బిజెపి, టిడిపి లు కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ అసంపూర్ణంగా వదిలిన ప్రపంచబ్యాంక్ ఆర్థిక విధానాలు వేగంగా కొనసాగించడంలో పాల్గొన్నాయి. కెసిఆర్ అయితే స్వయంగా కార్మికుల వ్యతిరేక విధానాలు అవలంబించే కార్మిక మంత్రిగా కేంద్రంలో పనిచేసారు. ఒకే ఒక సందర్భం చర్చల్లో పాల్గొన్న ప్రతినిధి రియాజ్ ఎన్‌కౌంటర్ తరువాత రాష్ట్రంలో మంత్రివర్గం నుంచి తెరాస మిలిటెంట్ వైఖరితో వైదొలిగింది. ఆ సందర్భంగా తెలంగాణ సమస్యలను సరిగానే ప్రస్తావించింది, ఎన్‌కౌంటర్లను ఖండించింది. కేంద్రంలో అధికారంలో 2004 కు ముందున్న ఎన్‌డిఎ ప్రభుత్వం తన తక్షణ రాజకీయ ప్రయోజనాల కోసం జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్, ఉత్తరాంచల్ రాష్ట్రాలను ఇచ్చినట్టుగా తరువాత అధికారంలోకి వచ్చే యుపిఎ (బహుశా ఎన్‌డిఎ కూడా) ఇస్తుందనే ఒక నెంబర్ గేమ్ తోటే తెరాస తెలంగాణ పై తన పావులు కదిపింది.

ఏమైనా నలభై సంవత్సరాల తెలంగాణ ప్రజల ఆకాంక్షలూ, పోరాటాలూ, వాటి ఆటుపోట్లూ 69-72ల మధ్య త్యాగాలు, నలభై ఏళ్ల నక్సలైట్ల ఉద్యమ ప్రభావం, గత పది సంవత్సరాల ప్రచారం మొదలైన ఎన్నో కారణాల వల్ల 2009 ఎన్నికల నాటికి తెలంగాణ 1969 వలె ఒక బలమైన పోరాటాంశం కాలేకపోయినా స్పష్టంగా ఎన్నికల ఎజెండా మాత్రం అయ్యింది. అందులోనూ 2004లో వలె బరిగీసిన పద్ధతిలో కాకుండా అధికార అనధికార పార్టీలన్నీ తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌ను నోటితో వ్యతిరేకించలేని స్థితి ఏర్పడింది. అట్లా ఏర్పడడమే దానంతట అదే ఒక బలమైన అంశమూ,ఒక బలహీనమైన అంశమూ. బయటి ప్రజాస్వామిక ఉద్యమాలే కాకుండా, ఎన్నికల పార్టీలు కూడా గుర్తించక తప్పని, స్వార్థబుద్ధి లేని ఆంధ్రప్రాంత ప్రజలు కూడా గుర్తించక తప్పని ఒక ప్రజాస్వామిక వాస్తవ డిమాండ్‌గా తెలంగాణ ముందుకురావడం దాని బలం. అయితే ఇది తమ చేయిజారిపోకుండా ఒక పోరాట క్షేత్రంగా మారకుండా తమ వాగ్దానాలలో, మ్యానిఫెస్టోలలో కమిటీలలో, లాబీలలో మాత్రమే ఉండేలా అన్ని ఎన్నికల పార్టీలు మేనేజ్ చెయ్యగలగడం ఒక బలహీనత.

కొసమెరుపుగా మొదటి విడతలో తెలంగాణలో ఎన్నికలు ముగిసే వేళ నంద్యాలలో ముఖ్యమంత్రి వైఎస్ఆర్ తన మనసులో ఉన్న ఎన్నికల ఎజెండాను బయటపెడుతూ తెలంగాణ ప్రజలకు ఒక పోరాట ఎజెండా అందించారు. బహుశా ఈ ఎన్నికల తరువాత అది తప్పకుండా తెలంగాణ ప్రజలకు ఒక పోరాట ఎజెండా అయినప్పుడే అది వైఎస్ఆర్ కు తగిన జవాబు అవుతుంది. తాను ఓడిపోతే జలయజ్ఞం ఆగిపోతుందనీ, హైదరాబాద్‌లో తెలంగాణలో వ్యాపారాలు చేసుకోవడం సాధ్యం కాదనీ, కార్పొరేట్ విద్యాసంస్థలు మూతపడతాయనీ, తమను

*ఎన్నికల ముందు, ఎన్నికల తరువాత తెలంగాణ పట్ల పాలకుల వైఖరి అనుభవంలో తెలిసిందేనని, విశాల ప్రజా ఉద్యమాల ద్వారానే తెలంగాణను సాధించుకోగలమని అంటున్నారు* **ఆకుల భూమయ్య**

# ప్రత్యేక తెలంగాణ ఉద్యమం - ఒక పరిశీలన

ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ప్రారంభమై నలభై సంవత్సరాలు గడిచింది. అప్పుడప్పుడు – విరామాలున్నా తెలంగాణ ప్రజల చిరకాల వాంఛగా ప్రత్యేక తెలంగాణ వ్యక్తమవుతూనే ఉంది. 1969 లో ప్రారంభమయిన రాష్ట్ర సాధన ఉద్యమం 1972 దాకా ఉధృతంగా సాగింది. తెలంగాణ ప్రజా సమితి ద్రోహంతో, కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలోని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల తీవ్ర అణచివేత కారణంగా ఉద్యమం ఆగిపోయింది.

1967లో నక్సల్బరీలో ప్రారంభమై 1968లో శ్రీకాకుళంకు పాకి ఉధృతంగా సాగిన ప్రజాస్వామిక విప్లవోద్యమాలు కూడ 1972 నాటికి తీవ్ర అణచివేతకు గురయినాయి. రాష్ట్రంలో కొంతకాలం రాష్ట్రపతి పాలన కూడ చోటుచేసుకొంది. అంతలోనే ఎమర్జెన్సీ చీకటి రోజులు. దేశవ్యాప్తంగా కార్మిక, రైతాంగ ఉద్యమాలు – మరోవైపు జయప్రకాశ్ నారాయణ్ సంపూర్ణ స్వాతంత్ర్యోద్యమాలు చోటు చేసుకున్నాయి. ఆనాడు వెల్లువలా సాగిన జనతా ప్రజాతంత్ర ఉద్యమంలో తెలంగాణ ప్రాంతం అగ్రభాగాన నిలిచింది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమ కంటినూటిని మనం ఎమర్జెన్సీ వ్యతిరేక ప్రజాస్వామిక విప్లవోద్యమాల్లో చూడగలం. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో చురుకుగా పనిచేసిన చాలామంది విద్యార్థి యువకులు, మేధావులు తర్వాత కాలంలో విప్లవోద్యమ నాయకులుగా ఎదిగిన విషయం అందరికీ తెలుసు. ఆ తర్వాత కాలంలో జనతా పార్టీ ప్రభుత్వం – రాష్ట్రంలో ఎన్‌టిఆర్ ప్రభంజనం – తెలుగుదేశం 'ఆత్మగౌరవం' నినాదం కొంతమేరకు భ్రమలు రేపింది. కాని అనతి కాలంలోనే ఎన్‌టిఆర్ నిజస్వరూపం తెలంగాణ వ్యతిరేకత, తెలుగుదేశం ప్రభుత్వానికి తెరతీసింది. తెలుగుజాతి పార్టీ నియంతృత్వ పోకడలు – విప్లవోద్యమాల పై ఉక్కుపాదం మోపి అణచివేయడం – ఒకవైపు విప్లవోద్యమాలు తీవ్రతరం కావడానికి దారితీయగా మరోవైపు ప్రజాస్వామిక ఆకాంక్షగా తెలంగాణ ఉద్యమం వివిధ రూపాల్లో సాక్షాత్కరించింది. 1988లో ఏర్పడ్డ తెలంగాణ ఇన్ఫర్మేషన్ సెంటర్ ఆధ్వర్యంలో తెలంగాణ జనవనరుల సంరక్షణ కోసం, పులిచింతల ప్రాజెక్టును ఎన్‌టి రామారావు శంకుస్థాపన చేయకుండా అడ్డుకోవడం జరిగింది. యూనివర్సిటీల్లో అధ్యాపక పోస్టులు ప్రాంతేతరులకు ఇవ్వకూడదని తెలంగాణ స్టూడెంట్స్ ఫోరమ్ ఉద్యమం నిర్వహించింది. తెలంగాణ ప్రజలు అనేక రూపాల్లో తమ కోర్కెలను వెల్లడించుతూ వీలైన పద్ధతుల్లో కోస్తాంధ్ర భూస్వామ్య పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా నినదిస్తూనే ఉన్నారు. 1996లో కేంద్రంలో దేవేగౌడ ప్రభుత్వం అధికారంలో కొచ్చిన ప్రారంభంలోనే చిన్న రాష్ట్రాలకు అనుగుణంగా ప్రకటన చేస్తూ ఉత్తరాఖండ్ ఏర్పాటు చేస్తానని వాగ్దానం చేశాడు. అప్పటి నుండి మళ్లీ ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఊపందుకుంది. సభలు సమావేశాలు తెలంగాణ వ్యాప్తంగా విరివిగా జరిగినాయి. విద్యార్థి యువకుల్లో ఉత్సాహం ఉరకలెత్తింది. ఆంధ్ర వలస దోపిడీ పీడనలకు గురై, ఆత్మహత్యలకు పాల్పడుతున్న రైతాంగం, చేనేత కార్మికులు కూడ ప్రత్యేక తెలంగాణ నినాదం అందుకున్నారు. ఆంధ్ర అధికారుల దురహంకారానికి అవమానాల పాలైన ఉద్యోగులు, సింగరేణి లాంటి సంస్థల కార్మికులు కూడ ఈసారి ఉద్యమంలో చురుకుగా ముందుకు వచ్చారు. ఈ పదమూడు సంవత్సరాల కాలంలో తెలంగాణ ఉద్యమం అనేక మలుపులు తిరిగింది. 2001 దాకా ప్రజా ఉద్యమాలు – వివిధ పార్టీలు నిర్వహించిన కార్యక్రమాలు చోటుచేసుకున్నాయి. తెలుగుదేశం ప్రభుత్వం తెలంగాణ పేరెత్తవద్దని రూలింగ్ ఇచ్చే స్థాయిదాకా అణచివేతను తీసుకెళ్లింది. తెలంగాణ కోసం గళమెత్తిన గద్దర్ పై

---

విదేశీయులుగా చూస్తారనీ ఆయన విద్వేషం రెచ్చగొట్టే ప్రయత్నం చేశారు. ఇట్లా చెప్పే క్రమంలో తాను, తనవంటి దళారీ పాలకవర్గాలు సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాల్ని వాటికి పరాకాష్టలైన ప్రత్యేక ఆర్థిక మండలాలను, సింగరేణి ఓపెన్ కాస్ట్ బొగ్గుగనులు, పోలవరం, పులిచింతల పోతిరెడ్డి పాడు వంటి ప్రాజెక్టులను కేవలం బహుళజాతి కంపెనీల ప్రయోజనాల కోసం చేపట్టి విదేశీ సామ్రాజ్యవాద ప్రయోజనాల కోసమే పనిచేస్తున్నాడనే విషయాన్ని ఆయన బయట పెట్టుకున్నారు. కృష్ణా, గోదావరి జలాల న్యాయమైన పంపిణీ కోసం విద్య, వైద్య రంగాలు ప్రభుత్వపరంగా నడపడం కోసం తెలంగాణను మార్కెట్ వ్యాపార సరుకుగా కాకుండా మానవసంబంధాల అంశంగా ఆవిష్కరించుకోవడం కోసం మనం తెలంగాణ రాష్ట్రాన్ని సాధించు కోవాలని కోరుతున్నామని, ఈ ఎన్నికల ఫలితాలు ఎట్లా ఉన్నా మనం రుజువు చేయాల్సిందే. స్పష్టంగానే ఏ స్వావలంబన, ఆత్మగౌరవ అంశాలుగా మనం తెలంగాణ కోరుతున్నామనీ, ఆ తెలంగాణ పోరాటాల ద్వారా మాత్రమే సాధ్యమనీ ఈ నలభై ఏళ్ల చరిత్ర మనకు మరోసారి గుర్తు చేస్తుంది. వీ

కాల్పులతో ప్రారంభించి ప్రజాస్వామిక తెలంగాణ కై పాటపాడిన బెల్లి లలితను ముక్కలుగా నరికించి చంపివేసింది. కళాకారుడు అయిలన్నను బూటకపు ఎన్‌కౌంటర్‌తో హత్యచేసింది.

కరీంనగర్ జిల్లా కల్వల ప్రాజెక్టు కోసం ఉద్యమించిన అలువెల్లి రవీందర్ రెడ్డిని తెలుగుదేశం మంత్రి దామోదర్‌రెడ్డి తన గూండాలచే హత్య చేయించాడు. హుస్నాబాద్‌కు చెందిన కార్యకర్త చంద్రమౌళి పోలీసు దెబ్బలకు తాళలేక ఆసుపత్రిలో కన్నుమూసి, తెలంగాణ ఉద్యమానికి నెత్తురు బాటవేశాడు. ఆ విధంగా ఉద్యమాన్ని రక్తసిక్తం చేసిన తెలుగుదేశం పార్టీ నేడు తన రాజకీయ స్వప్రయోజనాల కోసం తెలంగాణ నినాదాన్ని చేపట్టింది.

2001లో ఏర్పడిన తెలంగాణ రాష్ట్ర సమితి ఎన్నికల చుట్టూ ఉద్యమాన్ని తిప్పుతూ వచ్చింది. మొదట స్థానిక సంస్థల్లో మెజారిటీతో గెలిచిన తర్వాత ఉద్యమ నిర్మాణానికి ప్రయత్నించుతుందనుకున్నారు. కాని తెలంగాణ ఆకాంక్షలను ఎన్నికల్లో ఓట్లు సంపాదించే అస్త్రంగానే వాడుకోవాలనే తెలంగాణ రాష్ట్ర సమితి 2004 లో కాంగ్రెస్‌తో కలిసి పొత్తుపెట్టుకొని గెలిచింది. మంత్రివర్గంలో చేరి అధికారం పంచుకుని తెలంగాణ అంశాన్ని పక్కనపెట్టింది. కాంగ్రెస్ కూడా తెలంగాణ ఇస్తానని వాగ్దానం చేసి రాష్ట్రపతి ప్రసంగంలో చేర్పించి, కామన్ మినిమమ్ ప్రోగ్రాంలో చేర్పించి కొద్ది రోజులు నాటకమాడి చివరికి తన నిజస్వరూపాన్ని బయటపెట్టింది. మరోవైపు తెలంగాణ కోసం ఉద్యమిస్తున్న నల్లవసంత్, సుదర్శన్, కనకాచారి లాంటి నాయకులను బూటకపు ఎన్‌కౌంటర్‌లలో చంపివేసింది. తెలంగాణ రాష్ట్ర సమితి నాయకులు మంత్రివర్గం నుండి బయటకొచ్చి ఉద్యమం నిర్వహించాలనే ప్రజల డిమాండ్ మేరకు రాజీనామాలు సమర్పించారు. కాని ఉద్యమాలు నిర్వహించే బదులు తమ పదవులకు రాజీనామాలు ఇచ్చి ఉపఎన్నికలు తేవడం ద్వారా నిరంతరం తెలంగాణ ఉద్యమాన్ని ఎన్నికల చుట్టూ తిప్పుతున్నారు. ఆ క్రమంలో 2009 ఎన్నికలు రావడం – రాష్ట్రంలో మూడు కూటములు ఏర్పడడం జరిగిపోయినాయి. ఈ విధంగా 1969లో ప్రారంభమైన ప్రత్యేక తెలంగాణ ఉద్యమం నలభై సంవత్సరాలు గడిచినప్పటికీ ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా తయారయింది. తెలంగాణ ప్రజల ఆకాంక్షలను సొమ్ము చేసుకొని అందరూ పదవులు సంపాదించిన వారే. అన్ని పార్టీలు ఈ నినాదాన్ని ఉపయోగంచుకొని అందలం ఎక్కాలనే కోరుకుంటున్నాయి. అందుకే తెలంగాణ ప్రాంతంలో ఎన్నికలయ్యేదాకా కాంగ్రెస్‌తో సహా అన్ని పార్టీలు తెలంగాణకు అనుకూలంగానే మాట్లాడినాయి. 16 ఏప్రిల్ 2009న తెలంగాణ ప్రాంతంలో ఎన్నికలు ముగిసిన వెంటనే రాజశేఖరరెడ్డి తన నిజస్వరూపం బయటపెట్టి తెలంగాణ ఏర్పాటు పట్ల తన వ్యతిరేకతను బాహాటంగా బయట పెట్టడంతో పాటు హింసను ప్రేరేపించి – తెలంగాణకు వ్యతిరేకంగా రాయలసీమ ఆంధ్ర ప్రజలను రెచ్చగొట్టే ప్రయత్నం చేయడం చూస్తూనే ఉన్నాం. రెండవవిడత ఎన్నికలు 23 ఏప్రిల్ 2009న ముగిసాయి. ఆ తర్వాత ఏ పార్టీ ఏం మాట్లాడుతుందో వేచి చూడవల్సిందే. అన్ని పార్టీలు తెలంగాణకు అనుకూలంగా మాట్లాడు తున్నాయంటేనే ఏదో కుట్ర ఉందని అనుమానించే పరిస్థితులు కనబడుతున్నాయి. తెలంగాణ రాష్ట్ర సమితి ఇప్పటి నుండి తమ శాసనసభ్యులు జారిపోకుండా ప్రయత్నిస్తున్నదంటే ఎవరికి వారు కాకుండా ఏకమొత్తంగా బేరాలు సాగించడానికే ననేది స్పష్టమవుతోంది.

ఈ నలభై సంవత్సరాలలో జరిగిన తెలంగాణ ఉద్యమ క్రమాన్ని పరిశీలించితే ఉధృతంగా సాగిన ఉద్యమం – అణచివేత – స్తబ్దత – మళ్లీ ఉద్యమ కార్యక్రమాలు – అలా నడుస్తున్నది. 18 జనవరి 1969న ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థుల ప్రదర్శనపై కాసు బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వం లాఠీ ప్రయోగించింది లగాయతు ఆరు సూత్రాల పథకం పెట్టి ఉద్యమాన్ని విరమించేదాకా అంటే మూడు సంవత్సరాలు ఉద్యమం బలంగా సాగింది. 1969 సంవత్సరమంతా ఉప్పెనలాగా పెల్లుబికిన విద్యార్థుల నిరసన, కాల్పులు, 370 మంది విద్యార్థి యువకుల అమరత్వం, తెలంగాణ వ్యాప్తంగా సాగిన క్రూర మారణకాండ, కోస్తాంధ్ర పాలకుడు బ్రహ్మానందరెడ్డి నిరంకుశ పాలనకు నిలువెత్తు సాక్ష్యం. మేడే (1969) నాడు ప్రారంభమయిన ఊరేగింపు పై భాష్పవాయువు ప్రయోగంతో మొదలుపెట్టి – లాఠీచార్జీలు, కాల్పులు జరిగి హైదరాబాద్ సిటీ అంతా శవాల పెంటగా మారిన దృశ్యం, అంతర్జాతీయంగా – బిబిసి లాంటి వార్తా సంస్థలు ప్రసారం చేశాయి. నాడు పాఠశాలలు, కళాశాలలు, హాస్టళ్లు అన్నీ జైళ్లుగా మార్చారు. సినిమా హాళ్లను కూడా జైళ్లుగా మార్చిన బ్రహ్మానందరెడ్డి చివరికి కుట్రలు, కుతంత్రాలతో ప్రత్యేక ఆంధ్ర ఉద్యమాన్ని పోటీగా నడిపించడానికి చర్యలు చేపట్టాడు. 1969 జూన్‌లో జరిగిన కాల్పుల్లో తెలంగాణ వ్యాప్తంగా వందలమంది తమ ప్రాణాలు కోల్పోయారు. చివరికి స్కాటిష్ డివల్యూషన్ లాంటి పరిష్కారం ఇస్తామని కేంద్ర ప్రభుత్వం ఉద్యమ నాయకులను చర్చలకు పిలిచింది. అంటే (అటనమి) స్వయం ప్రతిపత్తి కల్పిస్తామని వాళ్ల ఉద్దేశం. కాని ప్రత్యేక రాష్ట్రం తప్ప దేనికి ఒప్పుకోం అంటూ చర్చల నుండి బయటకు వెళ్లివచ్చిన చెన్నారెడ్డి ప్రభృతులకు ఢిల్లీ నుండి సికిందరాబాద్‌కు వచ్చే దాకా దేశమంతా నీరాజనాలు పట్టింది. ఉద్యమ నాయకత్వాన్ని ఊరేగించిన దృశ్యం చూస్తే ప్రజల ఆకాంక్షలను ఎత్తి పట్టే నాయకుల పట్ల ప్రజలెంత అభిమానం చూపుతారో అంచనా వేసుకోవచ్చును. 1969 జూన్ నుండి అక్టోబర్ వరకు నిరవధికంగా తాలుకాఫీసుల ముందు ధర్నా శిబిరాలు నడిచాయి. సదస్సులు తెలంగాణ అంతటా నిర్వహించబడినాయి. అంతటి తీవ్రస్థాయిలో జరిగిన ఉద్యమం

ప్రపంచంలోనే మరెక్కడా జరగలేదని అంటారు. 1967లో ప్రపంచ వ్యాప్తంగా చోటుచేసుకొన్న మాంద్యం – 1968 ఫ్రాన్స్ విద్యార్థుల ఉద్యమాలు – అప్పటికి ఉధృతంగా సాగుతున్న చైనా మహత్తర సాంస్కృతిక విప్లవం – వీర వియత్నాం విప్లవ పోరాటాలు – ఇలా ప్రపంచ వ్యాప్తంగా తీవ్రమయిన సామ్రాజ్యవాద వ్యతిరేక, జాతి విముక్తి ఉద్యమాల, ప్రజాస్వామిక ఉద్యమాల ప్రభావం కూడ ఎంతో కొంత తెలంగాణ ఉద్యమం మీద లేకపోలేదు.

రెండవ విద్యా సంవత్సరం కూడ నష్టపోతారనే సాకుపై ఉద్యమాన్ని విరమిస్తున్నట్లు చెన్నారెడ్డి ప్రకటించడం, తర్వాత జరిగిన ఎన్నికలలో తెలంగాణ ప్రజా సమితి పేర మెజారిటీతో పదకొండు సీట్లు గెలవడం – ఇక తప్పక తెలంగాణ వస్తుందని ప్రజలు నమ్మారు. కాని ఎన్నికయిన ఎం.పి.లు అమ్ముడుబోవడం, పదవుల ఆశతో కాంగ్రెస్‌తో కలిసి ఉద్యమానికి ద్రోహం చేయడం జరిగిపోయాయి. చివరికి గతంలో ఉన్న రాయితీలు కూడా తొలగించడం జరిగింది. ప్రకటించిన ఆరు సూత్రాల పథకం అమలు చేయడానికి ప్రభుత్వాలు ఎన్నడూ ప్రయత్నం చేయలేదు. నాటి ఉద్యమం ప్రారంభంలో తెలంగాణ సేఫ్‌గార్డ్స్ – తెలంగాణ హక్కుల పరిరక్షణ అమలుకోసం జరిగే ఉద్యమం – ప్రత్యేక తెలంగాణ ఉద్యమం – ఇలా రెండు పాయలుగా సాగింది. తెలంగాణకు ఇవ్వబడిన హామీలు నిలబెట్టుకుంటే తెలంగాణ రాష్ట్రం అవసరం లేదనే మితవాద వర్గం కూడ ఆనాటికీ ఉంది. కాని అప్పటి నుండి ఇప్పటి దాకా ఒప్పందాల ఉల్లంఘనే తమ ధ్యేయంగా, దోపిడీయే తమ లక్ష్యంగా ప్రవర్తిస్తున్న ఆంధ్ర పాలకుల తీరు చూసిన తర్వాత ఇప్పుడు అలాంటి భ్రమలు ఎవరికీ లేవు. నలభై సంవత్సరాలలో ఉద్యమ సమైక్యతకు ఇదొక మంచి పరిణామం. ఆ తర్వాత జరిగిన కొన్ని ఉద్యమాలను పరిశీలించితే – పులిచింతల నిలుపుదల లాంటి వనరుల సంరక్షణ ప్రధాన ధ్యేయంగా సాగినవి. కాని 1996 నుండి మళ్లీ పుంజుకున్న ఉద్యమంలో ప్రత్యేక తెలంగాణ నినాదం తప్ప ఇతర మినహాయింపులు లేకపోవడమే కాక అన్ని రకాల ఉద్యమ శక్తులు ఉమ్మడి నినాదాన్ని చేపట్టడం మంచి పరిణామం.

1996 తర్వాత ఉద్యమాలు ఒక ప్రత్యేక స్వభావాన్ని సంతరించు కొన్నాయి. తెలంగాణ మహాసభ – దళిత బహుజన తెలంగాణ అనే నినాదం ఇచ్చింది. తెలంగాణ జనసంఘటన ముందుగా స్వయం ప్రతిపత్తి కోరినా తరువాత కాలంలో ప్రత్యేక తెలంగాణ – ప్రజా తెలంగాణ నినాదం ఇవ్వడం జరిగింది. తెలంగాణ జనసభ ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ నినాదం ఇచ్చింది. కొన్ని పార్టీలు భౌగోళిక తెలంగాణ నినాదాన్నిచ్చాయి. అయినప్పటికీ ఈ పార్టీల సంస్థల ఆశయ సాధనకు ఉద్యమ నిర్మాణం, పోరాటాలే ప్రాతిపదిక. కాని 2001లో ఏర్పడిన తెలంగాణ రాష్ట్ర సమితి లాబీయింగ్ ద్వారా తెలంగాణ సాధిస్తామని చెప్పింది. ఒక్క రక్తపు బొట్టు కార్చవద్దని, త్యాగాలు అవసరమేలేదని, విద్యార్థి, యువకులు, రైతులు, కార్మికులు ఎవరూ రోడ్డు మీదికి రావద్దని విచిత్రమైన పిలుపునిచ్చి తనది ఉద్యమ పార్టీ అని చెప్పుకొంది. అయితే ఎన్నికలు మాత్రమే తమ పోరాట మార్గమని చెప్పింది. సత్యాగ్రహాలు లాంటి గాంధేయ మార్గం చేపట్టడానికి కూడ ముందుకు రాని ఈ పార్టీని కొంతమంది మేధావులమని చెప్పుకొనేవారు తమ భుజాన మోస్తున్నారు. పైరవీలు, పాదులు అధికారంలో భాగం పంచుకోవడం తమ సిద్ధాంతంగా ఆ పార్టీ చెప్పుకుంది. ఇది ఈనాటి ఉద్యమ దౌర్భాగ్యం. ఇలాంటి పార్టీలకు కొమ్ముకాస్తున్న మేధావులను, విద్యావంతుల పేర చలామణీ అవుతున్న అవిద్యావంతులను దూరం చేయకుండా ఉద్యమం ఎంతమాత్రం ముందుకు పోదని ప్రజలంతా గ్రహిస్తున్నారు. ఎన్నికలు, ఉప ఎన్నికలు చుట్టూ తిరిగి తిరిగి తెలంగాణ ప్రజలు విసిగివేసారి ఉన్నారు.

1969-72 నాటి తెలంగాణ ఉద్యమంలో విద్యార్థులు యువకులు, ఉద్యోగ ఉపాధ్యాయులు, వ్యాపారులు మాత్రమే ఉన్నారు. కాని ఈనాడు ప్రపంచీకరణ కారణంగా బాగా దెబ్బతిన్న రైతులు, కార్మికులు అధికంగా ఇప్పటి ఉద్యమంలో చేరుతున్నారు. గతంలో కన్నా వనరుల దోపిడీ పెరిగింది. తెలంగాణ ఇచ్చేవరకు వీలైనన్ని వనరులు, వీలైనంత త్వరగా కాజేయాలనే మనస్తత్వం ఆంధ్రపాలకులకొచ్చింది. ఎలాంటి అర్హత లేకున్నా ఫ్లడ్‌లైట్ల వెలుగులో సాయుధ బలగాల పహారాలో పోతిరెడ్డిపాడును నిర్మించారంటే – ఇది కత్తిమొన మీద నీటిని మళ్లించినట్లు కాదా? సింగరేణి ఓపెన్‌కాస్ట్ మైనింగ్ అనుమతించడం– వేలాది, లక్షలాది ఎకరాలు సెజ్‌ల పేర పెట్టుబడిదార్లకు కేటాయించడం జరిగిపోయింది. వనరులు కాపాడుకోకుండా తెలంగాణ ఉద్యమం అర్థంలేనిదై పోతోంది. తెలంగాణ వనరుల పరిరక్షణ ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు డిమాండ్లతో ఉద్యమం ఉధృతంగా సాగాల్సి ఉంది.

నేడు అన్ని పార్టీలు ఎన్నికల సందర్భంగా తెలంగాణకనుకూలంగా మాట్లాడినాయి. ఎన్నికలయిన తర్వాత ఇదే పరిస్థితుంటుందనుకోవడం సరియైంది కాదు. నలభై సంవత్సరాలుగా సాగుతున్న ఉద్యమానికి అర్థవంతమైన ముగింపు పలకాల్సి ఉంది. రాజకీయ పార్టీలు, నాయకులు, వారి జిమ్మిక్కులెలా ఉన్నా ఎన్నికల వరకే వారి నిజాయితీని చూడగలం. ఎన్నికల తర్వాత వారి ఆలోచనలు, పదవులు, సంపాదన, కాంట్రాక్టుల పైననే ఉంటుంది. రాజకీయ నాయకుల పై ఆధారపడని ప్రజా ఉద్యమాన్ని నిర్మించాల్సి ఉంటుంది. ఉద్యమశక్తులు, సంస్థలు, వ్యక్తులు, సంఘాలు – కలసి వచ్చే పార్టీలతో సహా ఒక బలమైన ఉద్యమాన్ని నిర్మించాలి.

విద్యార్థులు, యువత, కార్మిక, కర్షక, మేధావులు, ఉద్యోగ ఉపాధ్యాయులు, ఆయా పార్టీల్లోని తెలంగాణ పట్ల నిజాయితీ గల కింది శ్రేణులను – కలుపుకొని తెలంగాణ వనరుల పరిరక్షణ, ప్రత్యేక రాష్ట్ర సాధన అనే డిమాండ్లపై గ్రామ, మండల, పట్టణ, నగర స్థాయిల్లో ప్రజా ప్రదర్శనలు, రైలు రోకో, రాస్తారోకోలు, నాయకుల ఘెరావ్‌లు – ఉద్యోగులు, ఉపాధ్యాయుల సమ్మెలు, బంద్‌లు లాంటి ఉద్యమ కార్యకలాపాలు చేపట్టి నిరంతరం – ప్రభుత్వ కార్యక్రమాల్ని స్తంభింపచేసే ఉద్యమం నిర్మించడం అవసరం. ఈ ఎన్నికల ఫలితాలు ఎలా ఉన్నా తెలంగాణ బహుదూరం అనేదే వాస్తవం. ఈ అన్ని పార్టీలను ప్రభావితం చేయగల ప్రజా ఉద్యమ నిర్మాణం, పోరాటాలే తెలంగాణను సాధించుతాయి. నలభై సంవత్సరాల ఉద్యమాన్ని, త్వరలోనే ఉధృతం చేసి తెలంగాణ ప్రజల చిరకాల వాంఛ అయిన ప్రత్యేక తెలంగాణ సాధించుకోవాలి. వీ

## 40 ఏళ్ల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం

తెలంగాణను ఆంధ్రలో విలీనం చేసినపుడు తెలంగాణ ప్రాంతానికి కల్పించిన అనేక రక్షణలలో 'ముల్కీ నిబంధనల అమలు' ఒకటి. 1956 నుండి 1968 వరకు అనేకసార్లు ముల్కీ నిబంధనలు ఉల్లంఘించి, సడలించి, వక్రీకరించి తెలంగాణ ప్రాంతానికి దక్కవలసిన ఉద్యోగాలను స్థానికేతరులకు ఇచ్చారు. ఈ అక్రమ నియామకాలకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమమే ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి దారితీసిన ప్రధాన కారణాలలో ఒకటి. ఈ ఉద్యమ ఉధృతికి 350 మంది యువకులు ప్రాణత్యాగం చేసారు. ఈ దశలోనే విప్లవోద్యమం ఆరంభమై ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి ఊతమిచ్చింది.

ఆర్థిక అసమానతల నుండి, అసమ అభివృద్ధి నుండి, ఆత్మగౌరవ స్పృహ నుండి, సాంస్కృతిక అవమానకర ధోరణుల నుండి ఉద్యమం ప్రారంభమై నాలుగు దశాబ్దాలుగా కొనసాగుతోంది. ఈ ఉద్యమం ఎన్నికల ఫలితాలను కూడ ప్రభావితం చేసింది. ఆనాటి 'తెలంగాణ ప్రజా సమితి' ఈ ఉద్యమాన్ని వాడుకొని ఎన్నికలలో అత్యధిక స్థానాలు గెలుపొంది రాజకీయ లబ్ధిపొంది ఉద్యమానికి ద్రోహం చేసింది. తరువాత కొంతకాలం పడుతూ, లేస్తూ, ప్రస్తుతం పడిలేచిన కెరటం లాగ ఉద్యమ తీవ్రత కొనసాగుతోంది. గత కొంత కాలం నుంచి కొన్ని రాజకీయ పార్టీలు ఉద్యమ ప్రభావాన్ని గమనించి 'తెలంగాణ రాష్ట్ర సాధనే' ఎజెండాగా ఏర్పడ్డ పార్టీతో పొత్తు పెట్టుకొని గెల్చి అధికారాన్ని అనుభవించి తెలంగాణ ప్రజల ఆశలను, ఆశయాలను, ఆకాంక్షలను విస్మరించి తెలంగాణకు మోసం చేసాయి.

ప్రస్తుతం తెలంగాణ ప్రాంతంలో జరుగుతున్న ఎన్నికలలో తెలంగాణ వాదాన్ని బలపరచకుండా ఏ పార్టీ కూడ ప్రజల వద్దకు పోలేని పరిస్థితి ఉంది. అన్ని రాజకీయ పార్టీలు తెలంగాణను ఎన్నికలలో ఎరగా చూపి రాజకీయ ప్రయోజనాలు పొందే ప్రయత్నం చేస్తున్నాయి. తెలంగాణ వాదాన్ని పార్టీలు వాటి జయాపజయాలతో ముడి పెడుతున్నాయి. ఎన్నికలలో గెలిస్తే పార్టీల విజయమని, ఒకవేళ ఓడితే తెలంగాణ వాదం బలహీన పడిందని వక్రభాష్యం చెప్పే ప్రమాదం కూడా ఉంది. నిజానికి ఎన్నికలలో ఏ కారణం చేతనైనా పార్టీలు దెబ్బతింటే అది పార్టీల రాజకీయ వైఫల్యంగా, గెలిస్తే ప్రజల విజయంగా భావించవలసి ఉంటుంది. కాని పార్టీలు ఇలా భావించే అవకాశం లేదు. ఇలాంటి ధోరణుల నుండి తెలంగాణ ఉద్యమాన్ని కాపాడుకోవడానికి సమాంతరంగా ప్రజా ఉద్యమాన్ని కొనసాగించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**– బోరెడ్డి మధుసూదన్**
సిద్దిపేట్, మెదక్

## విడిపోవడం పరిష్కారమేనా?

విశాలాంధ్రలో ప్రజారాజ్యం రావాలని ఆనాడు, ప్రజాస్వామిక వాదుల నుండి బలమైన శక్తులు ముందుకు వచ్చి, సాధించుకొన్నాయి. దీని అర్థం ప్రజారాజ్యం వచ్చిందని కాదు. ప్రత్యేక రాష్ట్రం మాత్రమే వచ్చిందిగాని, ప్రజారాజ్యం రాలేదు. దోపిడీ వర్గాలే పాలకులయ్యారు. వామపక్ష శక్తుల చేతికి అధికారం వస్తుందని ఆశించాం, కాని రాలేదు. ఇప్పుడు మళ్లీ విడిపోవాలంటున్నారు. విప్లవకారులు కూడా ఈ ఉద్యమానికి మద్దతునిస్తున్నారు. అభివృద్ధి నిరోధకులు ఇంకా తొందర పడుతున్నారు. ఇప్పుడు విడిపోతే అధికారం ఎవరికి వస్తుందనేది చాలా ముఖ్యమైన ప్రశ్నగా తీసుకోవాలి. దోపిడీ వర్గాల చేతుల్లో కట్టబెట్టే దానికి ఉద్యమించాల్సిన అవసరమేమిటి. ప్రత్యేక రాష్ట్రంగా చీలిస్తే, శత్రువు బలహీనుడవుతాడా? లేక ఇంతకన్నా మంచి సుపరిపాలన వస్తుందని ఆశిద్దామా? ఇప్పుడు పరిపాలించేది ఆ దోపిడీ వర్గాలే. చీలిన తర్వాత ఏర్పడబోయే రాష్ట్రానికి ఆ దోపిడీ వర్గాలే అయినప్పుడు ప్రజలకు మనం ఏం సాధించిపెట్టినట్లు? భాషగాని, భౌగోళికంగా గాని, సాంస్కృతికంగా గాని, రాయలసీమ, సర్కార్ జిల్లాలు, తెలంగాణ జిల్లాలు కొద్ది తేడాలతో ఒకటే సంస్కృతి. ఆంధ్రప్రదేశ్ యావత్తూ ఒకే ప్రజగా జీవిస్తున్నాం. దోపిడీ వర్గాలున్నంతవరకు ప్రజలకు సుఖం లేదు అనేది వాస్తవం. అలాంటప్పుడు సమైక్యంగా ఉంటే ఏమి? విడిపోతే వచ్చే లాభం ఏమిటి? ఈ దోపిడీ వర్గాలు నిజాయితీగా పరిపాలిస్తాయనే ఆశలు జనంలో లేవు. విడిపోయినా ప్రజలకు కలిగే లాభమేమిటి? ప్రాంతీయ భేదాల్ని విప్లవకారులు బలపర్చవచ్చునా? సమైక్యత కోరుకోవాలి. ఒక ఉద్యమాన్ని బలపరుస్తున్నామంటే దాని తాత్కాలిక ప్రయోజనాలు గాకుండా, దీర్ఘకాలిక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకోవాలి. జాతుల సమస్యకు, దీనికి సంబంధం లేదని నా అభిప్రాయం. జాతులకు విడిపోయే హక్కును ఇవ్వాల్సిందే. తెలంగాణ విషయంలో జాతుల సమస్యతో ముడిపెట్టరాదు. విడిపోయినంత మాత్రాన ప్రజలకు ఒరిగేదేమీ లేదు. అగ్రవర్ణ దోపిడీవర్గాలకు, పాలకులకు వనరుల్ని దోచుకోవడం ఇంకా సులవవుతుంది.

**– కడియాల సుబ్బనాచారి**
దుత్తలూరు, నెల్లూరు

*చైతన్యమెప్పుడూ ఒకదారి మూసుకుపోతే మరోదారిన వ్యక్తమౌతుందన్న సత్యం తెలంగాణ ఆకాంక్ష నిరూపించిందనీ, గతాన్ని సమీక్షించుకుని బలమైన ప్రజాస్వామిక ఉద్యమాన్ని నిర్మించాలనీ అంటున్నారు* **ఎం. కోదండరామ్**

# తెలంగాణ ఉద్యమాన్ని ఎట్లా చూడాలి ?

**1968**లో ప్రారంభమైన 1971 దాకా ఉధృతంగా సాగిన తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంపైన ఇప్పటికీ మంచి అధ్యయనాలు రాలేదు. ఉద్యమంలో క్రియాశీలకంగా పాల్గొన్నవారు తమ అనుభవాలను రికార్డు చేయలేదు. ఉన్న రచనలను కూడా ఎవ్వరూ వాటిని సేకరించి అచ్చువేయలేదు. ఆ ఉద్యమంపై కథలు, పాటలు కూడా రాలేదు.

మరొకవైపు రాజకీయ పార్టీలు, సామాజిక కార్యకర్తలు, సామాజిక శాస్త్రవేత్తలు కూడా ప్రత్యేక తెలంగాణ ఉద్యమంగాను, జై తెలంగాణ ఉద్యమంగాను పేరు పొందిన ఆ ఉద్యమాన్ని గాని, రాష్ట్ర రాజకీయాలపై అది చూపిన ప్రభావాన్ని గాని తెలుసుకునే ప్రయత్నం చేయలేదు. అందుకు కారణాలున్నాయి. ఉద్యమం వెలుపల ఉన్న సమాజం దృష్టిలో తెలంగాణ ఉద్యమం విచ్ఛిన్నకర ఉద్యమం. స్వార్థపర రాజకీయ నాయకులు, అధికార దాహంతో తెలంగాణ ఉద్యమాన్ని లేవదీసినారని భావించారు. విచిత్రమైన విషయం ఏమిటంటే ప్రతి ఉద్యమాన్ని భౌతిక పరిస్థితులు ఆధారంగా, చారిత్రక దృక్పథంతో చూసే మార్క్సిస్టులు కూడా ఈ అవగాహనను పూర్తిగా అంగీకరించారు. ఈ అవగాహనే బాగా వ్యాప్తి చెందింది. అన్ని సంస్థల సాయంతో ఆధిపత్యాన్ని చెలాయించింది. అందువలన ఉద్యమకారులు కూడా తమ గొంతు విప్పలేకపోయారు.

తెలంగాణ ఉద్యమాన్ని స్వార్థపర రాజకీయాల ఫలితంగా చూసిన వారు తీసుకొచ్చిన వాదనలన్నీ అసత్యాలు, అర్ధసత్యాల మీద ఆధారపడి కొనసాగినాయి. తెలంగాణ ఉద్యమాన్ని రాజకీయ నాయకులు నిర్మించారన్నది పూర్తిగా అవాస్తవం. చాలామంది భావిస్తున్నట్టు తెలంగాణ ఉద్యమాన్ని నిర్మించింది రాజకీయ నాయకులు కాదు. విద్యార్థులు, ఉద్యోగులు, అధ్యాపకులు ఈ ఉద్యమానికి ఊపిరి పోసినారు.

మనిషి ఎప్పుడూ తన స్వానుభవం నుండి సమాజాన్ని చూస్తాడు. స్పందిస్తాడు. అట్లా అనుభవాలను కలబోసుకున్నప్పుడే సమిష్టి చర్యలు, కార్యకలాపాలు రూపుదిద్దుకుంటాయి. తెలంగాణ ఉద్యమం కూడా ఇదే విధంగా ఎదిగింది. ఈ ఉద్యమం మొదట పాల్వంచలో ప్రారంభమైంది. కొత్తగూడెంలో 1960లలో నిర్మాణమైన పవర్‌స్టేషన్‌లో తెలంగాణ వారికి ఉద్యోగం ఇవ్వలేదు. 1400 ఉద్యోగాలలో తెలంగాణకు దక్కిన ఉద్యోగాలు 200 మాత్రమే. వారిలోనూ 175 మందిని 1968లో తొలిగించారు. ఈ పరిస్థితిలో ముల్కీ నియమాలను అమలు చేసి స్థానికులకు ఉద్యోగాలనివ్వాలని హైదరాబాద్‌లోని తెలంగాణ నాన్ గెజిటెడ్ అధికారుల సంఘం నాయకుల సాయంతో తెలంగాణ ఉద్యోగులు ఆందోళన చేసినారు. దీనికి స్థానికుల నుండి గట్టి మద్దతు లభించింది. ఈ ఉద్యమం వల్లనే ప్రాంతేతరులను వెనకకు పంపించి స్థానికులకు ఉద్యోగాలు ఇచ్చినారు. ఆ ఉద్యమ అనుభవం ఆధారంగా ఖమ్మం జిల్లాకు చెందిన కొందరు ఉద్యోగులు తెలంగాణ ప్రజలు సంఘటితం కాకుండా పెద్దమనుషుల ఒప్పందం ద్వారా వచ్చిన హక్కులు అమలు కావన్న నిర్ధారణకు వచ్చినారు. హక్కుల పరిరక్షణకై ఉద్యమం చేయాలని నిర్ణయించుకొని దానికి మద్దతును కూడగట్టడానికి అన్ని జిల్లాలు పర్యటించినారు. ఆనాడు అన్ని జిల్లాలు తిరిగిన ఐదుగురు సభ్యుల బృందంలో ఒకరైన కె. రామసుధాకర్ రాజు ఈ మధ్యనే తమ అనుభవాలను పుస్తక రూపంలో తెచ్చినారు. ఆనాడు 'తెలంగాణ రక్షణలన్నా, వాటి ఉపయోగాలన్న చాలామందికి అంతుపట్టడం లేదు. అమాయకంగా అవి ఎందుకని, ఉపయోగం ఏమిటని, ఇప్పుడే ఎందుకని ప్రశ్నలు వేస్తూ వచ్చారు'. ఈ ప్రశ్నలకు జవాబులను విన్న తరువాత అన్ని జిల్లాల్లోను విద్యార్థులు, ఉద్యోగస్తులు తెలంగాణ హక్కుల రక్షణకై ఉద్యమించాలన్న ఆలోచనకు వచ్చినారు. ఈ చర్చల ఫలితంగానే తెలంగాణ ఉద్యమ ఎజెండా రూపుదిద్దుకుంది. అందులోని ప్రధానాంశాలు ఇలా ఉన్నాయి. 1969లో అంతం కానున్న ముల్కీ నియమాలను కొనసాగించాలి. ముల్కీ నియమాలను 1969 వరకే అమలు చేయాలని 1957లో వచ్చిన చట్టంలో పేర్కొన్నారు. ఆ గడువును పొడిగించాలన్నది ప్రధాన డిమాండ్. తెలంగాణ మిగులు నిధులు తెలంగాణకే ఖర్చు చేయాలన్నది నాటి డిమాండ్లలో రెండవ అంశం. దొంగ ముల్కీ సర్టిఫికెట్లతోను, ముల్కీ నియామకాలకు విరుద్ధంగా స్థానిక ఉద్యోగాలలో చేరిన ప్రాంతేతరులను తొలగించాలన్నది మూడవ డిమాండ్. తెలంగాణ ప్రాజెక్టులు ముఖ్యంగా పోచంపాడు నిర్మాణాన్ని వెంటనే చేపట్టాలని తెలంగాణ ఉద్యమం డిమాండ్ చేసింది. అదే విధంగా చట్టానికి విరుద్ధంగా ప్రాంతేతరులు కొన్న భూములను వెనకకు తీసుకోవాలని కూడా ఉద్యమం డిమాండ్ చేసింది.

ఈ డిమాండ్ల సాధనకు ఎక్కడికక్కడ కమిటీలు ఏర్పడినాయి. మొదట ఖమ్మంలోనే ఉద్యమం మొదలైంది. అది క్రమంగా తెలంగాణ హక్కుల పరిరక్షణ ఉద్యమంగా మారింది. పాల్వంచ అనుభవం నుండి, ఆ ఆందోళన కారణంగా హక్కుల పరిరక్షణ ఉద్యమం రెక్కవిప్పింది. ఇక్కడ ఒక విషయాన్ని ప్రస్తావించాలి. తెలంగాణకు పెద్దమనుషుల ఒప్పందం ద్వారా వచ్చిన హక్కుల గురించి, ఆ హక్కుల ఉల్లంఘన గురించి ఉద్యమకారులకు సమాచారం అందించింది తెలంగాణ ప్రాంతీయ కమిటీ సభ్యులే. ప్రాంతీయ తెలంగాణ హక్కుల అమలుకై

ప్రయత్నం చేసి, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల నుండి స్పందన రాకపోవడంతో సమాచారాన్ని ప్రజలకు అందించినారు. విషయాలు తెలిస్తే ప్రజలే హక్కులను అమలులోకి తెచ్చుకోవడానికి పూనుకుంటారని వారు భావించారు. ఈ రకంగా చట్టబద్ధంగా ఏర్పడిన కమిటీ ఏమీ చేయలేక పోవడంతో ప్రజలకు ఆందోళన తప్ప మరొక మార్గం కనిపించలేదు.

అప్పటికే అన్ని వ్యవస్థలపైన ఆంధ్ర పాలకుల పెత్తనం ఏర్పడింది. కనుక ఏ అధికారికి చెప్పినా పట్టించుకోలేదు. పైగా అవమానకరంగా మాట్లాడినారు. ఉదాహరణకు 8 జనవరి 1969 నాడు కొంతమంది పెద్దలు ముఖ్యమంత్రిని కలుసుకొని పోచంపాడును త్వరితగతిన పూర్తి చేయాలని కోరినారు. 'నిర్మాణం ఆలస్యమైతేనేంది పునాదులు గట్టిగానే ఉన్నాయి మీరు వెళ్లండి' అని సమాధానమిచ్చారు. ఇటువంటి అనుభవాల కారణంగా హక్కుల పరిరక్షణ ఉద్యమం తలెత్తింది. ఈ ఉద్యమం కూడా పైన చెప్పినట్లు ఖమ్మంలోనే మొదలైంది. 1969 జనవరి నెలలో హక్కుల రక్షణకు రవీంద్రనాథ్ అనే విద్యార్థి ఆమరణ దీక్ష ప్రారంభించిందు. దానికి మద్దతుగా ప్రతి ఊళ్లోను రిలే నిరాహారదీక్షలు జరిగాయి. అట్లా ఉద్యమం తెలంగాణ అంతటా వ్యాప్తి చెందింది. అన్ని జిల్లాలకు పాకింది.

ఈ దశలోనే హక్కుల రక్షణకొరకే ఉద్యమాన్ని పరిమితం చేయాలా లేక ప్రత్యేక రాష్ట్రం కొరకు కొనసాగించాలా అన్న చర్చ మొదలైంది. ప్రభుత్వం, ఆంధ్ర పెత్తందార్ల అనుచరులు కొందరు హక్కుల పరిరక్షణకే ఉద్యమం పరిమితం కావాలన్నారు. కానీ జనవరి 1969లో ఉస్మానియా విద్యార్థి సంఘం నాయకుల ఆధ్వర్యంలో జరిగిన సమావేశం రాష్ట్ర సాధన లక్ష్యంగా ఉద్యమం సాగాలని తీర్మానించారు. ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే తప్ప రక్షణలు అమలుకావని ఆందోళనకారులు గ్రహించారు. ఉద్యమాన్ని వ్యవస్థితం చేయడానికి మొదలైన ప్రయత్నాలకు కొనసాగింపు గా మార్చ్ మూడవ వారంలో తెలంగాణ పీపుల్స్ కన్వెన్షన్ జరిగింది. ఆ సభలోనే తెలంగాణ ప్రజాసమితి ఆవిర్భవించింది. అప్పటి నుండి మే నెల చివరిదాకా ప్రజాసమితి విద్యార్థుల నాయకత్వంలోనే పనిచేసింది.

ఉద్యమం బలపడిన తరువాతనే రాజకీయ వ్యవస్థ స్పందించింది. ఉద్యమకారులతో మాట్లాడటానికి ప్రభుత్వాధికారులు, నాయకులు సిద్ధపడ్డారు. ఈ సన్నివేశంలో రాజకీయ ప్రక్రియను నడిపించడానికి, ముఖ్యంగా రాజకీయ నాయకత్వంతో వ్యవహారం నడిపించడానికి అనుభవజ్ఞుడైన రాజకీయ నాయకుడు అవసరమని భావించి చెన్నారెడ్డికి ప్రజాసమితి పగ్గాలను అప్పజెప్పారు. చెన్నారెడ్డి నాయకత్వం స్వీకరించిన తరువాత కూడా తెలంగాణ ప్రజాసమితి ప్రజాసంఘం గానే పనిచేసింది. 1971 మధ్యంతర ఎన్నికల్లో నిలబడడానికి ప్రజాసమితిని పార్టీగా మార్చారు.

పై వివరణను చూస్తే తేలే విషయమేమిటంటే తెలంగాణ ఉద్యమం బలపడిన తరువాతనే రాజకీయ నాయకులు రంగప్రవేశం చేసినారు. అందుకనే తెలంగాణ రాజకీయ నాయకుల కుట్రల, దుశ్చర్యల ఫలితంగా చూడటం వాస్తవాలకే విరుద్ధం. ప్రజలు, ప్రజాసంఘాలు తమంతట తాముగా ఉద్యమాన్ని నిర్మించారు. తెలంగాణ ప్రజలు ఈ ఉద్యమాన్ని తెలంగాణపై ఆంధ్ర పెత్తనాన్ని, తెలంగాణ వనరుల దోపిడీని అంతం చేయడానికి వచ్చిన ఉద్యమంగానే చూసినారు. చెన్నారెడ్డి నాయకత్వంలోకి వచ్చేనాటికే ఆంధ్ర పెత్తందార్లు తెలంగాణ ప్రజల భూములను, వనరులను, ఉద్యోగాలను కొల్లగొట్టడం వల్లనే ఉద్యమం తలెత్తిందన్న అభిప్రాయం ప్రజాసంఘాలలో ఏర్పడింది. ఈ విషయాన్ని 1969 మే నెలలో జరిగిన సదస్సులో మేధావులు కూడా విపులీకరించారు.

అయితే సామాజిక శాస్త్రవేత్తలు, రాజకీయ విశ్లేషకులు తెలంగాణ ప్రజాసంఘాలు అందించిన ఈ అవగాహనను పరిగణనలోనికి తీసుకోలేదు. వారి దృష్టిలో ఉద్యమం కేవలం స్వార్థపర రాజకీయ నాయకుల కుట్రల ఫలితమే. ఉద్యోగస్తులకు, విద్యార్థులకు అన్యాయం జరిగింది వాస్తవమేనని కొందరు అంగీకరించారు. అయితే ఆ సమస్యను ఆధారం చేసుకొని రాజకీయ నాయకులు, ప్రజలను రెచ్చగొట్టి తమ అవసరాలకు ఉపయోగించుకున్నారని చాలామంది సామాజిక శాస్త్రవేత్తల అభిప్రాయం. ఈ అధ్యయనాలు తెలంగాణకు రక్షణలు కల్పించడానికి దారితీసిన పరిస్థితులను పట్టించుకోలేదు. ఏ సామాజిక పరిస్థితుల వలన, ఎటువంటి వివక్ష పూరిత రాజకీయ విధానాల వలన రక్షణలు ఉల్లంఘించబడినాయో తెలియజేయలేదు. సామాజిక సంబంధాలను పూర్తిగా విస్మరించి, వివరించే ప్రయత్నం చేయడం అశాస్త్రీయమైన వ్యక్తుల ఇష్టారాజ్యాల ప్రకారం చరిత్ర సాగిపోతోందని అనుకోవడం భావవాదమే. వ్యక్తులకు చరిత్ర నిర్మాణంలో పాత్ర ఉంటది. మనుషులే చరిత్రను నిర్మిస్తారు. అయితే ఆ కార్యక్రమం అప్పటి చారిత్రక, సామాజిక పరిస్థితులకు లోబడి కొనసాగుతుంటది.

1969 ఉద్యమాన్ని విశ్లేషించినప్పుడు మార్క్సిస్టులు కూడా ఈ విషయాన్ని విస్మరించినారు. ఆనాడు ఆంధ్ర పెత్తందార్లు సృష్టించిన భావజాలానికి లోనుకావడం వల్లనే మార్క్సిస్టులు ఈ హ్రస్వదృష్టికి లోనయ్యారు. ఇటలీలో ఉత్తర, దక్షిణ ఇటలీల మధ్య ఆంధ్ర, తెలంగాణ మధ్య ఉన్నటువంటి వ్యత్యాసాలే ఉన్నాయి. ఉత్తర ఇటలీ అభివృద్ధి చెందిన ప్రాంతం. దక్షిణ ఇటలీ ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడిన ప్రాంతం. ఉత్తర ఇటలీ సంపన్నవర్గాలు దక్షిణ ఇటలీ పట్ల వివక్షపూరితంగా వ్యవహరించేవారు. ఆ సంపన్న వర్గాల భావజాల ప్రభావంలో ఉత్తర ఇటలీ వామపక్ష మేధావులు, కార్యకర్తలు కూడా దక్షిణ ఇటలీ ప్రజలను ఈసడించుకునే వారు. 1930లలో ఇటలీ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు గ్రామ్సి ఈ దృక్పథాన్ని విమర్శించాడు. దక్షిణ ఇటలీ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షను చారిత్రక దృష్టితో చూడాలని ఉద్బోధించాడు. ప్రజాస్వామిక దృష్టితో తెలంగాణ ఉద్యమాన్ని చూసి ఉంటే వామపక్ష పార్టీలు, ప్రజాస్వామిక వాదులు ఆ ఉద్యమంలో ఒక పాత్ర నిర్వహించగలిగే వారు. అందువలన ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థను ప్రజాస్వామికీకరించగలిగేవారు. భారతదేశంలో అంబేద్కర్ ఒక్కడే రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సమస్యను, ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమాలను ప్రజాస్వామిక దృక్పథంతో చూడగలిగాడు.

తెలంగాణ ఉద్యమం పట్ల తలెత్తిన ఈ అవగాహన లోపం వల్లనే ఆంధ్రప్రదేశ్‌లో బలమైన సంపన్న వర్గం ఎదిగింది. ఈ వర్గం అందరి వనరులను దోచుకొని బలపడింది. అందువలన తెలంగాణ అభివృద్ధికి, బలహీనవర్గాల ఎదుగుదలకు దారులు మూసుకొనిపోయాయి. ప్రజల కొనుగోలు శక్తి పెరగకపోవడం వలన పరిమితమైపోయిన మార్కెట్ల వలన పారిశ్రామిక రంగం పెరుగలేదు. పెట్టుబడులు సేవారంగానికే పరిమితమైపోయాయి.

ఈ పరిస్థితిలో ఎదిగిన సంపన్న వర్గాలు ప్రభుత్వంపైన ఆధారపడి

*తెలంగాణ ఉద్యమాన్ని అర్థం చేసుకోవడానికి, ఇవ్వాళ్టి సందర్భంలో అన్వయించుకోవడానికి సరైన చారిత్రక విశ్లేషణ, పరిశోధన ఇప్పటికీ జరగలేదంటున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# 'ప్రత్యేక తెలంగాణ'కు నలభై ఏళ్లు

ప్రత్యేక తెలంగాణ ఉద్యమంగా ప్రఖ్యాతి పొంది 1969 జనవరి నుంచి నవంబర్ దాకా ఉవ్వెత్తున సాగిన తెలంగాణ జిల్లాల ప్రజాందోళనను మళ్లీ ఒకసారి స్మరించుకొని అంచనా కట్టవలసిన సందర్భం ఇది. నలభై సంవత్సరాలు గడిచినా ఆ సమస్యలు సమసిపోలేదు సరిగదా ఇంకా పెరిగాయి. ఆ సమస్యల పరిష్కారం ప్రత్యేక రాష్ట్ర సాధనలో మాత్రమే ఉన్నదనే ఆకాంక్ష తగ్గిపోలేదు సరిగదా, ఇంకా ఎక్కువ రంగాలకు, ఇంకా ఎక్కువ ప్రాంతాలకు, ఇంకా ఎక్కువ ప్రజా సమూహాలకు విస్తరించింది. ఈ విస్తరణను గమనిస్తే ఆ ఉద్యమపు మౌలిక స్వభావంలోనే అణగిపోవడానికి అవకాశం లేని నిత్యనూతన తత్వమేదో ఉన్నదని అర్థమవుతుంది. అదే సమయంలో, నాలుగు దశాబ్దాలు గడిచినా, విస్తృత ప్రజామోదం ఉన్నా, అనేక వ్యక్తీకరణలు పొందినా, ఆ ఉద్యమం ఇంకా సఫలం కావడం లేదంటే, ఆ ఉద్యమ ప్రవాహంలో చెప్పుకోదగిన లోపాలేవో ఉన్నాయని కూడా అర్థం చేసుకోవలసి ఉంటుంది. అది ఆరని మంటగా కొనసాగడానికి అవకాశం కల్పిస్తున్న అనుకూల లక్షణాలను, అది పరిష్కారం కాకుండా ఆపుతున్న పరిమితుల ప్రతికూల లక్షణాలను నిష్పక్షపాతంగా బేరీజు వేసుకోగలిగిన నాడే, ఆ అవగాహనను ఉద్యమ నిర్వహణలో భాగం చేసిననాడే తెలంగాణ ఉద్యమం ఒక గుణాత్మకమైన గెంతు వేయగలుగుతుంది.

ముఖ్యంగా 1969 నాటి ప్రత్యేక తెలంగాణ ఉద్యమపు విశిష్టతను అర్థం చేసుకోవడానికి అనేక దృక్కోణాలు, అవగాహనా చట్రాలు, భిన్న స్థాయిల, రంగాల పరిణామాలు, ఘటనలు, వ్యాఖ్యానాలు ఉన్నాయి. 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఒక ఉజ్వలస్ఫూర్తిగా ఉన్నప్పటికీ, ఎందరో మేధావులు ఆ ఉద్యమం మీద తమ అంచనాలను, విశ్లేషణలను ప్రకటించినప్పటికీ, ఆ ఉద్యమం మీద చారిత్రక, రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాలన్నిటినీ కలగలపుకున్న సమగ్రమైన, సాధికారికమైన అధ్యయనం ఇంకా వెలువడలేదనే చెప్పాలి. అసలు ఆ ఉద్యమం గురించిన, మొత్తం ఉద్యమ చారిత్రక క్రమాన్నీ, అన్ని సంఘటనలనూ ఒక్కచోట వివరించే పూర్తి సమాచారమైనా రూపొందలేదు. (ఒక్క ఉదాహరణ చెప్పాలంటే, ఆ ఉద్యమంలో పోలీసు కాల్పులలోగాని, ఇతరత్రా గాని, మొత్తం ప్రాణాలు కోల్పోయిన వారి సంఖ్య 370 అని ఒక మాట తరచుగా వినబడుతుంది. ప్రభుత్వ గణాంకాల ప్రకారం ఆ ఉద్యమంలో మరణించినవారి సంఖ్య 60కి

---

పరాన్న జీవులవలె బతకాలి. లేదా విదేశీ మార్కెట్లలో అవకాశాలను వెతుక్కోవాలి. ఇటువంటి ఆర్థిక పరిస్థితి రాజకీయాలలో ప్రతిబింబిస్తుంది. సంస్కరణల పేరుతో ఒకవైపు ప్రజలను ప్రభుత్వ వనరుల నుండి దూరం చేసి వాటిని పూర్తిగా మౌలిక సదుపాయాల నిర్మాణం పేరుతో సంపన్న వర్గాలకు హస్తగతం చేస్తున్నారు. మరోవైపు విదేశీ మార్కెట్లతో ఆర్థిక వ్యవస్థను అనుసంధానం చేస్తున్నారు. ఈ పరిణామాల ఫలితంగా బతుకుదెరువు అవకాశాలు సన్నగిల్లిన ప్రజలు లేవనెత్తిన ఉద్యమమే నేటి తెలంగాణ ఉద్యమం. 1969 తెలంగాణ ఉద్యమానికి నలభై ఏళ్లు పూర్తయిన సందర్భంగానైనా గతంలో జరిగిన అవగాహన లోపాలను సరిదిద్దుకునే ప్రయత్నం చేయాలి. ఇప్పటికైనా సరళీకరణకు, సంస్కరణలకు వ్యతిరేకంగా బలమైన ఉద్యమాన్ని నిర్మించగలం.

చివరగా ఒక విషయం. నాటి తెలంగాణ ఉద్యమం అందరూ అనుకుంటున్నట్టు 1971లో కాంగ్రెస్‌తో తెలంగాణ ప్రజా సమితి విలీనం కాగానే అంతం కాలేదు. ప్రజాచైతన్యం ఒక దారి మూసుకొని పోతే అది ఇంకొక దారిలో వ్యక్తీకరణ పొందడానికి ప్రయత్నిస్తుంది. 1971 ఉద్యమం విఫలమైన తరువాత విద్యార్థులు ప్రత్యామ్నాయాలను వెతుక్కోవటం మొదలుపెట్టినారు. అప్పుడు వారిని నక్సల్బరీ ఉద్యమం ఆకట్టుకున్నది. వ్యవస్థలు భ్రష్టుపట్టిపోయాయని భావించిన విద్యార్థులు నూతన సమాజ నిర్మాణానికి నక్సల్బరీ మార్గాన్ని ఎంచుకున్నారు. విద్యార్థులు ప్రవేశించే దాకా నక్సల్బరీ ఉద్యమానికి అంతగా బలం లేదు. సిపిఎం పార్టీ నుండి బయటకు వచ్చిన కొద్దిమంది నాయకులే అక్కడక్కడా కార్యక్రమాలు చేస్తుండేవారు. విద్యార్థులు ప్రవేశించి గ్రామగ్రామాన తిరిగి ప్రచారం చేసిన తరువాత నక్సల్బరీ ఉద్యమం బాగా బలపడింది. అయితే నక్సల్బరీ ఉద్యమం కూడా తెలంగాణ స్థితిగతులను పరిగణనలోనికి తీసుకోలేదు. అందువలన విశాల ప్రాతిపదికన ఉద్యమాన్ని నిర్మించలేకపోయింది. ఈ లోపాలను ఇప్పటికైనా అధిగమించగలిగితే రాష్ట్రంలో బలమైన ప్రజాస్వామిక ఉద్యమాన్ని నిర్మించవచ్చు.

1969 తెలంగాణ ఉద్యమం బలమైన ప్రజాస్వామిక ఆకాంక్ష ఫలితంగా తలెత్తింది. ఆంధ్ర సంపన్న వర్గాల అవసరాల కొరకు ప్రభుత్వం విపరీతమైన హింసను ప్రయోగించి అణచివేయాలని చూసింది. కానీ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ స్వరూప, స్వభావాలు మారకుండా ఆ ఉద్యమం ఆగిపోదని చరిత్ర రుజువు చేసింది. ఈ చారిత్రక వాస్తవాన్ని గ్రహిస్తే వామపక్ష పార్టీలు, ప్రజాస్వామికవాదులు ఒక పాత్ర నిర్వహించగల ఇప్పటికీ పునరాలోచనకు అవకాశం ఉన్నది.

మించదు. ప్రత్యేక తెలంగాణ గురించి నలభై సంవత్సరాలుగా ఉద్వేగభరితంగా సాగుతున్న మేధోకృషి కూడ ఉద్యమ చరిత్రకారులు చెపుతున్న 370 మంది పేర్లను అన్వేషించి ప్రకటించి, ప్రభుత్వ గణాంకాలను ఖండించే పరిశోధన చేయలేదు.)

అయితే అటువంటి సవివరమైన పరిశోధన జరగనంత మాత్రాన, ఒక్కచోట సమగ్రంగా సంఘటితం కానంత మాత్రాన 1969 తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆందోళన విశిష్టతలు తక్కువ స్థాయివేమీ కాదు. నిజంగా ఆ ఉద్యమానికి అసాధారణమైన విశిష్టతలున్నాయి. అది 1947 తర్వాత భారత రాజకీయాలలో, 1956 తర్వాత తెలుగుసీమ రాజకీయాలలో అత్యంత ఎక్కువ ప్రజాభాగస్వామ్యం ఉండిన ఉద్యమం. అతి ఎక్కువకాలం సాగిన ఉద్యమం అది. ఒక విద్యాసంవత్సరం నష్టపోయినా సరే అని విద్యార్థులు, ఉపాధ్యాయులు పాల్గొన్న చరిత్రాత్మక ఉద్యమం అది. కొన్ని నెలలపాటు అయినా ప్రభుత్వ యంత్రాంగాన్ని మొత్తం స్తంభింపజేసిన ఉద్యమం అది. తెలంగాణ జిల్లాలన్నిటా పోలీసు యంత్రాంగం, కేంద్ర రిజర్వ్ పోలీస్ బలగాలు, సైన్యం తప్ప మరే అధికారిక వ్యవస్థ పనిచెయ్యలేకపోయిన స్థితి కల్పించిన ఉద్యమం అది. రాజ్యాంగ చట్రం లోపల సాగిన ఉద్యమాలలో దానిమీద జరిగినంత అణచివేత మరే ఉద్యమం మీదా అప్పటికి జరిగి ఉండలేదు. అన్నిటికన్న ముఖ్యంగా ఎంతటి నిర్బంధాన్నయినా తట్టుకుని నిలిచి కొనసాగిన ఉద్యమం అది. ఇక అధికారికంగా విరమణ జరిగినా, నాయకత్వం విద్రోహం చేసినా, రాజకీయపక్షాలు వంచించినా, మరణించని ఆకాంక్షకు స్ఫూర్తినిచ్చిన ఉద్యమం అది.

ఈ విశిష్టితకు అవకాశాలు కల్పించిన కారణాలు చరిత్రలోనూ, ఆర్థిక అసమానతలలోనూ, సామాజిక అంశాలలనూ, సాంస్కృతిక అంశాలలోనూ ఉన్నాయి. ఆ కారణాలను పరిశీలించే ముందు స్థూలంగానైనా ఆ ఉద్యమ చరిత్రను గుర్తు తెచ్చుకోవడం అవసరం.

హైదరాబాద్ రాష్ట్రంలో 1952లో ముల్కీ ఆందోళన జరిగినప్పటికీ, 1954-55లో రాష్ట్రాల పునర్విభజన కమిషన్ ముందర తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగా ఉంచాలనే ప్రతిపాదనలు వచ్చినప్పటికీ, పెద్దమనుషుల ఒప్పందం (1956) జరిగి, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత కనీసం పన్నెండు సంవత్సరాలపాటు ప్రత్యేక తెలంగాణ ఆలోచనలు పెద్ద ఎత్తున బయటపడలేదు. పెద్దమనుషుల ఒప్పందంలోని హామీల ఉల్లంఘన, ప్రభుత్వోద్యోగ నియామకాలలో తెలంగాణ వాసులకు (ముల్కీలకు) అన్యాయం, బడ్జెట్ కేటాయింపులలో తెలంగాణకు అన్యాయం, తెలంగాణలో విద్యారంగం అభివృద్ధి పట్ల అలసత్వం, పెద్దమనుషుల ఒప్పందం ప్రకారం ఏర్పడిన తెలంగాణ ప్రాంతీయ మండలి సిఫారసుల పట్ల నిర్లక్ష్యం వంటి కారణాల వల్ల తెలంగాణ ప్రజలలో, ముఖ్యంగా మధ్యతరగతి విద్యావంతులలో 1960ల ప్రారంభం నుంచీ అసంతృప్తి ఉంది. అయినప్పటికీ అది 1969 దాకా ఒక ఉద్యమ రూపం ధరించలేదు.

పెద్దమనుషుల ఒప్పందంలో ఇచ్చిన హామీలను రక్షణలు – సేఫ్‌గార్డ్స్ – అనేవారు. వాటిని నెరవేర్చాలనే ఆకాంక్షతో 1968 జూలై 10న తెలంగాణ రక్షణల దినం జరపాలని ఉద్యోగ సంఘాలు ఇచ్చిన పిలుపు ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి తొలి అడుగు. ఆ సందర్భంగా హైదరాబాద్‌లో జరిగిన ఒక సభలో అప్పటి సోషలిస్టు పార్టీకి చెందిన కార్మిక నాయకుడు బి.ఎస్. మహదేవ్ సింగ్ తొలిసారిగా రాష్ట్ర విభజన ఆవశ్యకత గురించి, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం గురించి ప్రస్తావించినట్టు ఆధారాలున్నాయి.

అప్పటి నుంచి క్రమక్రమంగా రగుల్కొన్న అసంతృప్తి నిప్పురవ్వ 1969 జనవరిలో ఖమ్మం జిల్లా పాల్వంచలో మొదలయిన నిరాహారదీక్షలతో తెలంగాణ అంతటా వ్యాపించింది. పాల్వంచలోని విద్యుత్ కేంద్రంలో ఉద్యోగ నియామకాలలో అన్యాయం జరుగుతున్నదని, దాన్ని సవరించి తెలంగాణ రక్షణలను అమలు చేయాలని జనవరి 5న ఆందోళన, నిరాహారదీక్షలు ప్రారంభమయ్యాయి. జనవరి 9 నాటికి ఆ ఆందోళన జిల్లా కేంద్రానికి విస్తరించి, అందులోకి విద్యార్థులు ప్రవేశించారు. ఖమ్మంలో బి.ఎ. విద్యార్థి రవీంద్రనాథ్ నిరాహారదీక్ష ప్రారంభించాడు. ఆంధ్ర నాయకులకు వ్యతిరేకంగా ప్రదర్శనలు జరపడం, ఆంధ్ర పేరు కనబడితే నిరసన ప్రకటించడం మొదలయ్యాయి. తెలంగాణ రక్షణ సమితి అనే మొట్టమొదటి సంస్థ స్థానికంగా ఏర్పడింది. ఆ ఆందోళన కొద్ది రోజుల్లోనే నిజామాబాద్‌కూ, కరీంనగర్‌కూ, వరంగల్‌కూ పాకింది. నాన్ ముల్కీ గోబ్యాక్ అనేది ప్రధాన నినాదమయింది. జనవరి 12న హైదరాబాద్‌లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అన్ని కళాశాలల విద్యార్థి సంఘాల సమావేశం జరిగి ఆందోళన ఉధృతమయింది. తెలంగాణ స్థాయి తొలి ఉద్యమ సంస్థగా జనవరి 13న తెలంగాణ విద్యార్థుల కార్యాచరణ సమితి ఏర్పడింది. ఉస్మానియా అప్పటికి తెలంగాణలో ఉన్న ఏకైక విశ్వవిద్యాలయం కావడంతో ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థుల ఆందోళన అంటే అది తెలంగాణ వ్యాపిత విద్యార్థి ఆందోళన అన్నమాటే. అదేరోజు హైదరాబాద్‌లో తెలంగాణ పరిరక్షణ కమిటీ పేరుతో పౌర సంఘం కూడా ఏర్పడింది. పాల్వంచ నిరాహారదీక్ష ప్రారంభమైన ఎనిమిదో రోజున, ఖమ్మం నిరాహార దీక్ష ప్రారంభమయిన నాలుగో రోజున హైదరాబాద్‌లో అఖిల తెలంగాణ ఉద్యమ సంస్థలు ఏర్పడడమంటే, అందులోనూ రవాణా, సమాచార సంబంధాలు అంతంతమాత్రంగా ఉండిన ఆ రోజుల్లో ఇంత త్వరితగతిన స్పందనలు వచ్చాయంటే ఒకవైపు ప్రజలలో ఉన్న అసంతృప్తి స్థాయి, మరొకవైపు అంతకుముందునుంచీ సాగుతూ వచ్చిన నిర్మాణ కృషి అర్థమవుతాయి.

ఈలోగా పాల్వంచ విద్యుత్ కేంద్రంలో తెలంగాణ రక్షణల అమలు గురించి సాగిన వ్యాజ్యంలో, ముల్కీ నిబంధనలు స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థలకు, కార్పొరేషన్లకు వర్తించవని హైకోర్టు తీర్పునిచ్చింది. ఆ తీర్పుతో, ఇక రక్షణల గురించి కోరడం అనవసరమనీ, ప్రత్యేక రాష్ట్ర సాధన తప్ప గత్యంతరం లేదనీ అభిప్రాయం బలపడింది. అయినా రక్షణలు అమలు జరిపించుకోవడమే ముఖ్యమని, రాష్ట్ర విభజన అవసరం లేదని అభిప్రాయపడే వర్గం ఒకటి, ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు తప్ప మరొక పరిష్కారం సాధ్యం కాదని భావించే వర్గం ఒకటి విద్యార్థుల లోనూ, ఉద్యోగులలోనూ, రాజకీయ నాయకులలోనూ తొలినుంచీ కొనసాగుతూ వచ్చాయి. ఈ రెండు వర్గాల విద్యార్థుల మధ్య హైదరాబాద్‌లో ఘర్షణలు కూడ జరిగి పోలీసు లాఠీచార్జికి దారితీశాయి.

మొత్తం మీద తెలంగాణ ఉద్యమ ఆకాంక్షలు ఎంత వేగంగా కార్చిచ్చులా వ్యాపించాయంటే, జనవరి 19న ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి అఖిలపక్ష సమావేశాన్ని ఏర్పాటు చేయకతప్పలేదు. ఆ

సమావేశం ఉద్యోగ నియామకాలలో తెలంగాణకు జరిగిన అన్యాయం గురించి, తెలంగాణలో ఖర్చుపెట్టకుండా మిగిలిపోయిన నిధుల గురించి చర్చించింది. నాలుగువేల ఐదువందల మంది నాన్ ముల్కీలు తెలంగాణలో ఉన్నారని, వారిని వెనక్కి పంపుతామని ప్రభుత్వం ప్రకటించింది. కాని న్యాయస్థానాల వివాదాలలో చిక్కి ఆ ఉత్తర్వు అమలు కాలేదు. తెలంగాణ మిగులు నిధులు లెక్క తేల్చడానికి నిపుణుల కమిటీని నియమిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. అలా నియామకమైన కె. లలిత్ కమిటీ మిగులు నిధులు రు. 34.10 కోట్లు అని తేల్చగా ఆ కమిటీ అవలంబించిన గణాంక విధానాలపై తెలంగాణ ప్రాంతీయ సంఘం అభ్యంతరం చెప్పింది. తర్వాత మిగులు నిధుల గురించి తేల్చడానికి భార్గవా కమిటీని నియమించడం జరిగింది. ఆ తర్వాత ఆ చర్చే పక్కకు పోయింది.

విద్యార్థులు ఆందోళన విరమించాలని జనవరి 19న అఖిలపక్ష సమావేశం విజ్ఞప్తి చేసినప్పటికీ ఆ సమావేశ నిర్ణయాల ఫలితం ఏమి కానుందో ముందే ఊహించినట్టుగా విద్యార్థులు ఆ విజ్ఞప్తిని పెడచెవిన పెట్టారు. విద్యార్థుల ఆందోళన యథావిధిగా జరుగుతూ పోయింది. ఆ మర్నాడే శంషాబాద్‌లో విద్యార్థుల మీద పోలీసులు కాల్పులు జరిపారు. తెలంగాణ ఉద్యమంలో ఇలా జనవరి 20న ప్రారంభమైన పోలీసు కాల్పులు ఆగస్ట్ 7 దాకా సాగుతూనే ఉన్నాయి. జనవరి 24న మెదక్ జిల్లా సదాశివపేటలో జరిగిన కాల్పులలో మొదటిసారి ఒక విద్యార్థి చనిపోయాడు. విజయపురి, గజ్వేల్, తాండూరు, సికింద్రాబాదు, గద్వాల, నిజామాబాద్, కరీంనగర్, మహబూబ్‌నగర్, హైదరాబాద్, కొత్తగూడెం, వరంగల్ లాంటి చిన్నాపెద్దా పట్టణాలన్నిటిలో కాల్పులు జరిగాయి. ఎన్నో చోట్ల లాఠీచార్జీలూ, 144 సెక్షన్ విధింపు, కర్ఫ్యూలు, వేలాది మంది అరెస్టులూ జరిగాయి. ప్రభుత్వ గణాంకాల ప్రకారమే ఆ ఆరు నెలలలో 96 సార్లు కాల్పులు జరిగాయంటే, ప్రతి రెండో రోజు పోలీసు కాల్పులు జరిగి తెలంగాణ అగ్నిగుండంలా ఉండిందన్నమాట. ఈ అగ్ని గుండంలో విద్యార్థులు అగ్రభాగాన నిలిచి ఎక్కడికక్కడ రోడ్లమీద అవరోధాలు ఏర్పరిచారు. ప్రభుత్వ ఆస్తులపై తమ కసి తీర్చుకున్నారు. ప్రభుత్వ ఆస్తులను ధ్వంసం చేశారు. తగులబెట్టారు. ఆసిడ్, పెట్రోలు, ఇతర మండే పదార్థాలతో మొలటోవ్ కాక్ టెయిల్స్ తయారుచేసి ప్రభుత్వ ఆస్తులమీదికి పోలీసులు, పారామిలిటరీ బలగాల మీద విసరడం అలవాటు చేసుకున్నారు. పోలీసులు బాష్పవాయు ప్రయోగం చేస్తారని ముందుగానే ఊహించి ఆ వాయువు ప్రభావం నుంచి తప్పించుకునేందుకు ఉల్లిగడ్డలు, నీళ్లు వెంట తీసుకుపోవడం, బాష్పవాయువు గోళాలను వెనక్కి పోలీసుల మీదికి విసిరివేయడం వంటి సృజనాత్మక పోరాట రూపాలను చేపట్టారు. ఆంధ్ర వ్యాపారుల ఆస్తులను ధ్వంసం చేశారు. లూటీ చేశారు. ఈ ఆందోళనా రూపాలతో పాటు ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర అవసరాన్ని ప్రచారం చేసేందుకు ప్రతిరోజూ సభలు, సమావేశాలు, ధర్నాలు, ఊరేగింపులు జరపడం, విస్తృతంగా గోడలమీద నినాదాలు రాయడం, కరపత్రాలు అచ్చువేసి పంచడం, కొత్త కొత్త నినాదాలను రూపొందించడం వంటి పనులెన్నో చేశారు. జనవరి నుంచే ప్రారంభమైన తరగతుల బహిష్కరణ, పాఠశాలలను, కళాశాలలను మూసివేయడం మార్చ్, ఏప్రిల్ ల నాటికి ఉధృతమై పరీక్షలు జరగడం కష్టమయింది. చాలమంది విద్యార్థులు ఆ విద్యాసంవత్సరాన్ని నష్టపోయారు. వేసవి సెలవుల తర్వాత కూడ నవంబర్ దాకా ఏదో ఒక స్థాయిలో ఉద్యమం నడుస్తూ ఉండింది గనుక తర్వాతి విద్యాసంవత్సరం కూడ సక్రమంగా నడవలేదు.

ఈ రకంగా విద్యార్థులు ప్రధానంగా పాల్గొన్న, రూపొందించిన ఈ ఆందోళనలలోకి ఉపాధ్యాయులు, బోధనేతర సిబ్బంది, ప్రభుత్వోద్యోగులు, ముఖ్యంగా ఎన్‌జిఒలు, కొన్ని చోట్ల కార్మికులు కూడా ప్రవేశించి వారి వారి రంగాలలోకి ఆందోళనను విస్తరించారు.

ఈలోగా విద్యార్థుల ఆందోళనకు సంఘీభావం తెలపడానికి ఒక విస్తృత వేదికగా పనిచేయడానికి ఫిబ్రవరి 28న తెలంగాణ ప్రజా సమితి ఏర్పాటయింది. రాజకీయాలతో అప్పటికి ప్రత్యక్ష సంబంధం లేని యువకులు, మేధావులు, ఉపాధ్యాయులు, న్యాయవాదులు వంటి వారే తెలంగాణ ప్రజా సమితిని నెలకొల్పడంతో సమాంతరంగా అన్ని రాజకీయ పక్షాలలోనూ కదలిక ప్రారంభమయింది. కొండా వెంకట రంగారెడ్డి, కొండా లక్ష్మణ్ బాపూజీ వంటి సీనియర్ తెలంగాణ నేతల దగ్గరినుంచి స్థానిక నేతలవరకూ తెలంగాణ ప్రత్యేక రాష్ట్రమే ఏకైక పరిష్కారమని ప్రకటించడం మొదలుపెట్టారు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఒక రాజకీయ డిమాండ్ రూపాన్ని సంతరించుకోవడం మొదలయింది. ఈ పరిస్థితిని గమనించిన కేంద్ర ప్రభుత్వం ఏప్రిల్‌లో తెలంగాణ సమస్యల పరిష్కారం కొరకు అష్టసూత్ర పథకాన్ని ప్రకటించింది. దానితో తెలంగాణ ఉద్యమకారులు సంతృప్తి చెందలేదు. ఏప్రిల్ 21న మర్రి చెన్నారెడ్డి తెలంగాణ ప్రజా సమితిలో చేరి దాని నాయకుడైపోయాడు. చెన్నారెడ్డి ప్రవేశం తర్వాత కొన్ని రోజుల పాటు తెలంగాణ ఉద్యమం విజృంభించినప్పటికీ, రాజకీయ చదరంగపుఎత్తులకు రంగస్థలంగా మారిపోయి, తెలంగాణ రాష్ట్ర సాధన లక్ష్యం మరుగునపడడం మొదలయింది. విద్యార్థులు, ఉద్యోగులు ఇంకా పోరాట చైతన్యాన్ని ప్రదర్శిస్తున్నప్పటికీ, తెలంగాణ జిల్లాలన్నిటిలోనూ ఆందోళనలు సాగుతూనే ఉన్నప్పటికీ, తాను నాయకుడైన తర్వాత కూడా పోలీసు కాల్పులు, అరెస్టులు వంటి నిర్బంధకాండ సాగుతున్నప్పటికీ, ఆ నిర్బంధాన్ని అధిగమించి పోరాటాన్ని ముందుకు తీసుకుపోవాలనే ఆకాంక్షను ఉద్యమకారులు చూపుతున్నప్పటికీ, తెలంగాణ ప్రజా సమితి నాయకుడిగా చెన్నారెడ్డి ప్రధానమంత్రి ఇందిరా గాంధీతో, కాంగ్రెస్ అధినాయకత్వంతో చర్చలకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు.

చివరికి ఒకసారి ఢిల్లీకి వెళ్లివచ్చిన తర్వాత నవంబర్ 27న పోరాటాన్ని వాయిదా వేస్తున్నామని చెన్నారెడ్డి ప్రకటించారు. ఈ ప్రకటన ప్రతిగా చెన్నారెడ్డిని తెలంగాణ ప్రజా సమితి అధ్యక్షస్థానం నుంచి తొలగిస్తున్నట్టు కార్యదర్శి టి.ఎన్. సదాలక్ష్మి డిసెంబర్ 6న ప్రకటించారు. తెలంగాణ ఉద్యమం ఆగదని, కేవలం ప్రధానికి ఒక సంవత్సరం గడువు మాత్రం ఇచ్చి వచ్చానని చెన్నారెడ్డి జవాబిచ్చారు. ఈ విధంగా రాజకీయ భిన్నాభిప్రాయాలు, ఎత్తుగడలు ఎట్లా ఉన్నా, డిసెంబర్ 26న చెన్నారెడ్డి తెలంగాణ ప్రజా సమితి అధ్యక్షునిగా మళ్లీ ఎన్నికయ్యారు.

ఆ తర్వాత విస్తృత ప్రజాభాగస్వామ్యంతో జరిగే ఆందోళనల స్థానాన్ని ఎన్నికల రాజకీయాలు ఆక్రమించడం మొదలయింది. 1970 జూన్‌లో జరిగిన ఖైరతాబాద్ ఉపఎన్నికలలో తెలంగాణ ప్రజా సమితి అభ్యర్థి గెలిచాడు. ఆ తర్వాత జరిగిన సిద్దిపేట ఉపఎన్నికలలోనూ

తెలంగాణ ప్రజా సమితి ఘనవిజయం సాధించింది. అప్పటివరకూ వీధి పోరాటాలలో తమ ఆకాంక్షను వ్యక్తం చేసి ప్రభుత్వాన్ని స్తంభింపజేసిన తెలంగాణ ప్రజలను బాలట్ 'పోరాటానికి' పరిమితం చేయడానికి తెలంగాణ ప్రజా సమితి ప్రయత్నాలు ప్రారంభించింది. ఆ తర్వాత 1971 మార్చ్‌లో లోక్‌సభకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో తెలంగాణ ప్రాంతంలోని 14 పార్లమెంటరీ స్థానాలలో 10 స్థానాలను తెలంగాణ ప్రజా సమితి కైవసం చేసుకున్నది. అలా ప్రజా మద్దతును చూపుకున్న తెలంగాణ ప్రజా సమితి 1971 సెప్టెంబర్‌లో తనను తాను రద్దు చేసుకుని కాంగ్రెస్‌లో విలీనం కావడంతో తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో ఒక శకం ముగిసింది.

ఇంత విశిష్టమైన, అసాధారణమైన ఉద్యమం, రాజ్యాంగ చట్రం లోపల సాధించగలిగిన అతి సాధారణమైన కోరికను కూడా ఎందుకు సాధించలేకపోయిందనే ప్రశ్నకు సమాధానాలు వెతకడం ఆసక్తికరంగా ఉంటుంది. భారత రాజకీయ రంగస్థలం ప్రజల కనీక కోర్కెలను కూడ, పాలకవర్గాల ప్రయోజనాలకు మౌలికంగా దెబ్బ తగలని కోర్కెలను కూడ తీర్చలేనంత మొద్దుబారి ఉన్నదనే స్థూల అవగాహనను అర్థం చేసుకుంటే తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర సాధన ఇంతగా ఎందుకు సమస్యాత్మకమవుతున్నదో అర్థమవుతుంది. తెలంగాణ ఏర్పడడం వల్ల తమ ప్రయోజనాలు దెబ్బ తింటాయేమోననే నిజమైన అనుమానంతో గాని, ఊహాత్మక అనుమానంతో గాని ఆ కోరికను అడ్డుకునే ఇతర ప్రాంతాల పాలకవర్గాలు, పాలకవర్గ ముఠాలు ఉండడం కూడ ఒక వాస్తవం. ఆ స్థూల అవగాహన లోపలనే గుర్తించవలసిన సూక్ష్మ అవగాహనలు మరికొన్ని ఉన్నాయి.

మొత్తంగా ప్రజా సమస్యల పట్ల, ప్రజా సమస్యల పరిష్కారం పట్ల పాలకవర్గాల నిర్లక్ష్యం అనే స్థూల అవగాహనా చట్రంలో, ప్రత్యేకంగా మన పాలకవర్గ ముఠాల అల్పత్వాన్ని కూడ కలిపి చూస్తే తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం వంటి అతి మామూలు, న్యాయమైన కోరికను సాధించుకోవడం కూడ ఎందుకు ఇంత సమస్య అవుతున్నదో అర్థమవుతుంది.

ఆ స్థూలమైన అననుకూలతలు విధించే పరిమితులు మాత్రమే కాక, తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి, ముఖ్యంగా 1969 నాటి ఉద్యమానికి ఉన్న నిర్దిష్ట అననుకూలతలను కూడ ప్రస్తావించుకోవలసి ఉంది.

వాటిలో మొట్టమొదట గుర్తించవలసినవి ప్రాంతీయ ఉద్యమంలో సహజంగా ఉండే అననుకూలతలు. ప్రాంతీయ ఉద్యమం అనేది ప్రాంతీయత అనే ఏకైక అస్తిత్వం మీద నిర్మాణమవుతుంది. ఇది ఒక తాత్విక సమస్య. ప్రతి మనిషి ఏకకాలంలో భిన్న అస్తిత్వాల సమాహారంగా ఉన్నప్పుడు మనుషులను వారి అస్తిత్వాలలో మిగిలినవాటిని వదులుకొని ఒకే అస్తిత్వాన్ని ఉంచుకొమ్మని, అది మాత్రమే ప్రాతిపదికగా సంఘటితం కమ్మని కోరడం సాధ్యమేనా? భిన్న అస్తిత్వాలు ఉంటాయని గుర్తించి, వాటి మధ్య తులనాత్మక భేదాలు ఉంటాయని, ఒక్కొక్కసారి ఒక్కొక్కటి ప్రధానమవుతుందని అంగీకరించడం, దాని ఆధారంగా సమీకరించడం కొంత ఆచరణ సాధ్యమైన కార్యక్రమం కావచ్చు. కాని మిగిలిన అస్తిత్వాలన్నిటినీ తొక్కిపెట్టి ఒకే అస్తిత్వమున్నట్టు ప్రవర్తించడం, అలానే ఉద్యమాలు నడపడం మన సమాజంలో ఆనవాయితీ అయింది.

ప్రాంతీయ అస్తిత్వాన్ని ఏకైకంగా చూసినప్పుడు మరొక ముఖ్యమైన సమస్య కూడ తలెత్తే అవకాశం ఉంది. మామూలుగానే మన ఆలోచనా విధానంలో మంచి-చెడు విభజన ఉన్నప్పుడు, ఒక ప్రాంతంలో అంతా మంచే ఉంటుందని, మరొక ప్రాంతంలో ఏమీ మంచి లేదని అనుకునే అతివాదానికి ప్రాంతీయ అస్తిత్వవాదం సులభంగా చేరుతుంది. 'అన్ని గడపలలోన మా గడపమేలు' వాదం ఇది. కాని ఇది ఎప్పుడూ వాస్తవం కాదు. 'ఇక్కడ పుట్టినదేదయినా అంగీకరించి తలకెత్తుకోవలసినదే. అక్కడ పుట్టినదేదయినా ఖండించి తిరస్కరించవలసినదే' అనే అతివాదం వినడానికి ఉద్వేగపూరితంగానే ఉంటుంది గాని నిత్యజీవిత అనుభవంలో దాన్ని అనుసరించడం అసాధ్యం. మన అస్తిత్వంలో మనకు నచ్చనివీ, అవతలి అస్తిత్వంలో మనకు నచ్చేవీ ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. అంటే మన అభిప్రాయానికీ వాస్తవానికీ మధ్య అఖాతం స్పష్టంగా కనబడి మనలో మనకే ద్వైదీభావం పెరుగుతుంది. 1969 తెలంగాణ ఉద్యమ ఆలోచనలలో ఈ అతివాదం, దాని పక్కనే ద్వైదీభావం ఉన్నాయి గనకనే అది చాల విస్తృతి సాధించిందని అనుకున్నప్పుడు కూడ, చాల సులభంగా జారిపోవడం జరిగింది.

కులం, మతం, లింగం, ప్రాంతం, భాష వంటివన్నీ ముఖ్యమైన అస్తిత్వాలే కాని అవేవీ మనం కోరి తెచ్చుకునేవి కావు. అవి మనతో నిమిత్తం లేకుండా మనకు అందేవి. కాని ఉత్పత్తి సంబంధాలలో మన స్థానాన్ని మనం ఎంతో కొంత ఉద్దేశ్యపూర్వకంగా నిర్ణయించుకోవచ్చు గనుక, తద్వారా వచ్చే వర్గ అస్తిత్వం మరికొంత విశాలమైనది, చైతన్య యుతమైనది. విలువల ద్వారా, ఆచరణ ద్వారా మనం రూపొందించుకునే అస్తిత్వం మరింత పై స్థాయి చైతన్యానికి సంబంధించినది. కనకు యాదృచ్ఛికంగా వచ్చే పునాది అస్తిత్వాలను విస్మరించకుండానే, ఆ పునాది అస్తిత్వాల మీద సమీకరిస్తున్నప్పుడు కూడా, ఇంకా పైస్థాయి అస్తిత్వాలయిన వర్గ, భావజాల, ఆచరణ అస్తిత్వాలను దృష్టిలో పెట్టుకోవలసి ఉంటుంది. ప్రాంతీయ ఉద్యమాలు అంత విశాలంగా ఉండడం సాధ్యమో కాదో ఆలోచించవలసి ఉంది.

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం ఎదుర్కొన్న మరొక ముఖ్యమైన సమస్య రాజ్యాంగ బద్ధతకు ఉండే అననుకూలత. ఉద్యమమేమో భూమి, భుక్తి, ఉపాధి, అభివృద్ధి, ఆత్మగౌరవం వంటి మౌలిక సమస్యల పరిష్కారాన్ని సుదూరంగానైనా ఉద్దేశించినది. కాని వాటి పరిష్కారాలను రాష్ట్రం ఏర్పాటు అనే రాజ్యాంగ బద్ధమైన కోరికకు కుదించింది. అంటే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు లక్ష్యమా మార్గమా అనే అంశంలో ఉద్యమానికి స్పష్టత లోపించింది. అది నీళ్లు, నిధులు,, నియామకాల వంటి సమస్యల పరిష్కారానికైనా లక్ష్యం అనుకున్నప్పుడు రాష్ట్రం ఏర్పాటు ఒక సాధనం మాత్రమే అవుతుంది. కాని ఉద్యమ క్రమంలో ఆ సమస్యలు, వాటి దీర్ఘకాలిక పరిష్కారాలు మరుగున పడి, రాష్ట్రం ఏర్పాటయితే చాలు అని దాన్ని లక్ష్యంగా చూసే ధోరణి ప్రబలుతుంది.

మరొక ముఖ్యమైన సమస్య నాయకత్వపు వర్గస్వభావానికీ, ప్రజల వర్గస్వభావానికీ మధ్య తేడావల్ల వచ్చే అననుకూలత. ఏ ప్రజా ఉద్యమంలోనైనా నాయకులూ, శ్రేణులూ ఒకేలాగ ఆలోచిస్తారనీ, ఒకటే వర్గ స్వభావం కలిగి ఉంటారనీ చెప్పలేం. ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమాలలో ఆ ప్రాంతంలో పుట్టినవారందరికీ భాగస్వామ్యం ఉంటుంది గనుక తప్పనిసరిగా విభిన్న వర్గస్వభావాలు ఆ ఉద్యమంలో భాగమవుతాయి. కనుక విభిన్న వర్గప్రయోజనాలను నెరవేర్చుకోవడానికి

వ్యూహాలు, ప్రతివ్యూహాలు తయారవుతుంటాయి. ఒక ఉమ్మడి ఉద్యమం అనుకున్నదల్లా ఎవరికి వాళ్లకే తాము హైజాక్ చేయదగిన ఉద్యమంగా కనబడుతుంది. అందువల్ల ఉద్యమం ఎప్పుడైనా ఎంత బలంగా ఉన్నట్టు కనబడుతుందో అంత బలహీనంగానూ ఉంటుంది.

అలాగే ప్రజల భాగస్వామ్యానికీ, సృజనాత్మకతకూ అవకాశం ఇవ్వని నాయకత్వం వల్ల వచ్చే అననుకూలతలు కూడా ప్రాంతీయ ఉద్యమంలో ఎక్కువగానే ఉంటాయి. ప్రాంతీయ ఉద్యమమనేదే భిన్న వర్గాల కలయిక వల్ల జరుగుతుంది గనుక ప్రతి వర్గమూ తనకే నాయకత్వం రావాలనీ, తన కోర్కెలే ఉద్యమపు కోర్కెలుగా ఉండాలనీ, మిగిలినవారు తన అనుచరులుగానే తప్ప సృజనాత్మక భాగస్వాములుగా, నిర్ణయాధికార శక్తులుగా ఉండగూడదనీ అనుకుంటుంది. అందువల్ల అధికార వికేంద్రీకరణ గాని, పైనుంచి కిందివరకు నిర్మాణాలు గాని, నిర్ణయాలలో పైనుంచి కిందివరకు భాగస్వామ్యం గాని, చర్చా సంప్రదాయం గాని లేకుండా జాగ్రత్త పడుతుంది.

1969 ఉద్యమంలో అప్పటి పరిస్థితుల ప్రాబల్యం వల్ల వచ్చిన మరికొన్ని అననుకూలతలు కూడ ఉన్నాయి. అప్పటి ఉద్యమం ప్రధానంగా మధ్యతరగతి విద్యార్థుల, ఉద్యోగుల, విద్యావంతుల ఉద్యమంగా సాగింది గాని, వ్యవసాయ సమాజమైన తెలంగాణలో, అప్పటికి ఎనభై శాతం గ్రామీణ వ్యవసాయ రంగంపై ఆధారపడి ఉన్న చోట ప్రత్యేక తెలంగాణ వారికి ఎలా అవసరమో ఉద్యమం వివరించ లేకపోయింది. రైతుకూలీలు ఉద్యమంలోకి రాకపోవడంతో సువిశాల ప్రాంతానికి ఉద్యమం వ్యాపించడానికి అవరోధాలు ఏర్పడ్డాయి.

అలాగే 1969 నాటి ఉద్యమ క్రమంలో కొన్ని అవాంఛనీయ ధోరణులు కూడా తలెత్తాయి. తెలంగాణ సమస్యలకు కారణం ఆంధ్ర ప్రాంత పాలకవర్గాలు, వారితో మిలాఖతయిన తెలంగాణ పాలకవర్గాలు కాగా, ఆంధ్ర నుంచి వచ్చినవారందరూ శత్రువులే అనే ధోరణి ప్రబలింది. ఆంధ్ర ప్రాంతం నుంచి పొట్టచేతపట్టుకుని వచ్చినవారిని కూడా అవమానించడం జరిగింది. స్త్రీలను అవమానించడం జరిగింది. దానితో ఉద్యమం విశాలం కావడానికి అవరోధాలు వచ్చాయి. ఉద్యమానికి మిత్రులు కాదగిన వారు కూడ, తటస్థంగా ఉండగలిగిన వారు కూడా శత్రువులయిపోయారు.

నలభై సంవత్సరాలు గడిచిన తర్వాత ఆనాడు జరిగిన తప్పొప్పులను సమగ్రంగా, సంయమనంతో, నిర్మమకారంతో పరిశీలించి ఆనాటి ఒప్పులను అభివృద్ధి చేయడం, ఆనాటి తప్పులను పునరుక్తం కాకుండా చూసుకోవడం ఇవాళ్టి ఉద్యమ ప్రగతికి అవసరం.

**సంప్రదించిన పుస్తకాలు :**


ఆదిరాజు వెంకటేశ్వర రావు, బి.ఎస్.ఎస్. రామచంద్రరావు – తెలంగాణ పోరాటం, అపూ పబ్లికేషన్స్, హైదరాబాద్, 1970

దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే – ఆంధ్రప్రదేశ్ రాజకీయ వ్యవస్థ – తెలంగాణా రాజకీయాలు, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్, 2005

శోభా గాంధి – ప్రత్యేక తెలంగాణ ఉద్యమాల చరిత్ర, గాంధి పబ్లికేషన్స్, హైదరాబాద్, 2006

The Telangana University & College Teachers' Convention - The Telangana Movement - An Investigative Focus, Hyderabad, 1969

Myron Weiner - Sons of the Soil - Migration and Ethnic Conflict in India, OUP, Delhi, 1988

BPR Vithal - The Telangana Surpluses - A Case Study, CESS, Hyderabad, 2002


వీ

*తొలి విడత తెలంగాణలో ఎన్నికలు ముగియగానే ముఖ్యమంత్రి చేసిన అవకాశవాద వ్యాఖ్యలను ఖండిస్తూ, ప్రాంతేతర దోపిడీ పాలకులందరూ తెలంగాణకు విదేశీయులే అంటున్నారు* **పిట్టల రవీందర్**

# అవును, తెలంగాణలో మీరు విదేశీయులే!

ఎండాకాలంలో సేల్స్ పెంచుకోవడానికి ఒక శీతలపానీయాల కంపెనీ ఇటీవల మీడియాలో ప్రముఖంగా చూపిస్తున్న వ్యాపార ప్రకటన ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి తెలంగాణ విషయంలో అనుసరిస్తున్న వైఖరికి అద్దం పట్టే విధంగా కనిపిస్తున్నది. 'కూల్‌డ్రింక్ సేవించు... సూటిగా మాట్లాడు... సుత్తి లేకుండా' అన్నది ఆ శీతలపానీయం ప్రకటన సారాంశం. ఏప్రిల్ 16న తెలంగాణతో సహా ఉత్తరాంధ్ర జిల్లాలలో తొలిదశ పోలింగ్ ముగిసిన వెంటనే వేగుల ద్వారా ముఖ్యమంత్రి అందుకున్న సమాచారం ఆయనకు సదరు కూల్‌డ్రింక్‌ను సేవించినంత పనిచేసింది. అందుకే ఆయన చాలా క్లియర్‌గా మాట్లాడడం మొదలుపెట్టాడు. అనివార్యంగా ఆయన తన లోగుట్టును బహిర్గతం చేసాడు. ఫ్యాక్షనిస్టు పాలకునిగా ముదిరిన రాజశేఖరరెడ్డి, తన ఫాసిస్టు రూపాన్ని ప్రదర్శనకు పెట్టారు. తెలంగాణ విషయంలో తాను ఇప్పటిదాకా మాట్లాడినదంతా 'సుత్తి' మాత్రమేనని, తొలిదశ పోలింగ్ తర్వాత మాత్రమే 'సూటిగా' మాట్లాడగలుగుతున్నానని ప్రాంతేతరులను నమ్మించేందుకు పూనుకున్నారు.

ఈ ఎన్నికల్లో మహాకూటమి విజయం సాధించి, అధికారంలోకి వస్తే, ఎన్నికల సమయంలో ఇచ్చిన హామీని నిలబెట్టుకుని ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చేస్తే, ప్రాంతేతరులు హైదరాబాద్‌లో విదేశీయుల్లాగా బతకాల్సి వస్తుందన్నారు. కోస్తాంధ్ర, రాయలసీమ వాసులను హైదరాబాద్‌లో వ్యాపారాలు చేసుకోనివ్వరన్నారు. పోతిరెడ్డిపాడు మూసివేస్తారని, పోలవరం, పులిచింతల, గాలేరు – నగరి తదితర నీటిపారుదల ప్రాజెక్టులు నిలిచిపోతాయన్నారు. మొత్తంగా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ నాటినుంచి వలసపాలకులు నిరాటంకంగా కొనసాగిస్తూ వస్తున్న రాజకీయ ఆధిపత్యం ఆగిపోతుందని, తెలంగాణ వనరులను దోపిడీ చేసేందుకు అవకాశం కోల్పోతామని, ముఖ్యంగా హైదరాబాద్ మహానగరాన్ని శాశ్వత అంతర్గత వలస దోపిడీ కేంద్రంగా మార్చివేసేందుకు గడచిన ఐదు సంవత్సరాలుగా తాను చేస్తున్న ప్రయత్నాలకు ఆటంకం ఏర్పడుతుందని రాజశేఖరరెడ్డి తన ఆందోళనను వ్యక్తం చేసారు. కోస్తాంధ్ర, రాయలసీమ సంపన్న వర్గాల స్వర్గధామంగా మారిన హైదరాబాద్‌లో రక్షణలేకుండా పోతుందని, ఆ రక్షణలో నుండి ప్రాంతేతరులకు పరోక్షంగా సమకూరే ఫలాలు అందకుండా పోతాయన్నది ఆయన మాటల్లో అంతర్లీనంగా ఆవిష్కృతమవుతున్న ప్రధానాంశాలు. ఈ వర్గాల ప్రయోజనాలకు 'రక్షకునిగా' కొనసాగే అవకాశం తననుండి చేజారిపోకుండా కాపాడుకోవడం ప్రాంతేతరులైన ఓటర్లకు ఎంత అవసరమో ఆయన తన మాటల్లో సూటిగానే చెప్పదలచుకున్నారు. రెచ్చగొట్టదలచుకున్నారు. బెదిరించదలచుకున్నారు. బ్లాక్‌మెయిల్ కూడా చేయదలచుకున్నారు.

ముఖ్యమంత్రి మాటలను (అవి ఎంతటి ప్రమాదకరమైనవి అయినా, ఎంతటి అప్రజాస్వామికమైనవి అయినా, ఆయన అనుసరించ దలుచుకున్న నియంతృత్వ ధోరణికి నిదర్శనమైనా సరే) మరో దృష్టికోణం నుండి పరిశీలించుకున్నప్పుడు హైదరాబాద్‌ను తెలంగాణ ప్రజలకు దక్కకుండా చూసేందుకు ఆయన చేస్తున్న ప్రయత్నాలను ఆ వ్యాఖ్యానాలు బయటపెట్టాయి. తెలంగాణ వనరుల దోపిడీకి ఆయన కట్టుబడి ఉన్నట్లు చెప్పకనే చెప్పారు. కోస్తా, రాయలసీమ ప్రాంతాలకు చెందిన సంపన్న వర్గాలకు హైదరాబాద్‌ను ఒక లాభసాటి వ్యాపార కేంద్రంగా మార్చడమే తన లక్ష్యంగా చాటుకున్నారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షను శాశ్వతంగా అణచివేయడమే తన ప్రధాన లక్ష్యంగా, అంతిమ ధ్యేయంగా ప్రకటించుకున్నారు.

తన ఎన్నికల అవసరాల కోసం ప్రాంతీయ విద్వేషాలను రెచ్చగొట్టే ఉద్దేశంలో భాగంగా రాజశేఖరరెడ్డి చేసిన ప్రయత్నాలలో అత్యంత అభ్యంతరకరమైనదీ, ప్రమాదకరమైనదీ, వాస్తవ విరుద్ధమైనదీ – తెలంగాణ విడిపోతే ప్రాంతేతరులు హైదరాబాద్‌లో విదేశీయులుగా బతకాల్సి వస్తుందనేది. వాస్తవానికి హైదరాబాద్‌లోనే కాదు అసలు తెలంగాణలోనే కాందిశీకులుగా, నిర్వాసితులుగా బతుకులీడుస్తున్నది తెలంగాణ ప్రజలే. విలీనం రోజు నుండీ రాజకీయంగా, ఆర్థికంగా, భాషాపరంగా, సాంస్కృతికంగా తెలంగాణపై అన్ని రకాలైన ఆధిపత్యాలను కొనసాగిస్తున్నది ప్రాంతేతరులే. మరీ ముఖ్యంగా రెండున్నర కులాలు, రెండున్నర జిల్లాల్లో కేంద్రీకృతమైనా అధికారంలోనూ, ఆధిపత్యంలోనూ తెలంగాణ ప్రజలు బానిసలుగా, బందీలుగా బతుకులీడుస్తున్నారు. వనరుల వినియోగంలోనూ, పంపిణీ లోనూ, నిర్ణయాధికారంలోనూ, పాలనాధికారంలోనూ, రాజ్యాధికారం లోనూ, వసతుల కల్పనలోనూ, హక్కులను అనుభవించడంలోనూ రెండవ శ్రేణి పౌరులకు దక్కినంత వాటాను కూడ తెలంగాణ ప్రజలు అనుభవించడం లేదు. ఈ అన్ని విషయాల్లోనూ తెలంగాణ ప్రజలు అనుభవిస్తున్నది అణచివేత మాత్రమే. ఈ అంశాలను చర్చకు తీసుకురాకుండా ముఖ్యమంత్రి బుద్ధిపూర్వకంగానూ, రాజకీయ లబ్ధికోసం చేసిన వ్యాఖ్యానాలపై సర్దుబాటు ధోరణిలోనూ, చర్చను అణచివేసే పద్ధతిలోనూ, అనునయింపుగానూ మీడియాలోనూ, రాజకీయంగానూ చర్చను పక్కదారి పట్టించడం అత్యంత ఆక్షేపణీయమైనది. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు లక్ష్యంగా పుట్టుకువచ్చిన

తెలంగాణ రాష్ట్ర సమితి గానీ, తెలంగాణ అంశాన్ని ఆత్మగౌరవ సమస్యగా చిత్రీకరించిన ప్రజారాజ్యం గానీ, వామపక్షాలుగానీ, రాజకీయ అనివార్యతవల్ల తెలంగాణపై సానుకూలంగా స్పందించిన తెలుగుదేశం పార్టీగానీ, వందరోజుల్లో తెలంగాణ ఇస్తామంటూ మరోమారు మభ్యపెడుతున్న భారతీయ జనతా పార్టీ గానీ – ముఖ్యమంత్రి వ్యాఖ్యానాలను మళ్లీ 'ఆయన' దృష్టికోణం నుండి మాత్రమే వ్యతిరేకించడం, రాజశేఖరరెడ్డి అనుసరిస్తున్న వైఖరికి భిన్నమైనవేమీ కాదు. రూపంలో తేడాలున్నట్లు భ్రమింపజేస్తున్నప్పటికీ, తెలంగాణ విషయంలో పాలకపార్టీలు అనుసరిస్తున్న వైఖరుల్లోని సారం మాత్రం ఒక్కటే.

భారతదేశంలో వ్యాపారం చేసుకోవడానికి వచ్చిన ఈస్ట్ ఇండియా కంపెనీకి, తెలంగాణలో అన్ని రకాలైన ఆధిపత్యాలను చెలాయిస్తున్న ఆంధ్ర వలస పాలకులకు రూపంలోనూ, సారంలోనూ పోలికలున్నాయి. అయితే భారతదేశం మీద పూర్తిస్థాయి ఆధిపత్యాన్ని సాధించుకోవడానికి గానూ ఈస్ట్ ఇండియా కంపెనీకి సుమారు 170 సంవత్సరాల కాలం ఖర్చయితే, తెలంగాణపై పూర్తిస్థాయి ఆధిపత్యాన్ని అందిపుచ్చుకోవడానికి ఆంధ్రా పాలకులకు పట్టుమని పదేళ్లు కూడా పట్టలేదు. ముఖ్యంగా నాలుగు వందల సంవత్సరాల సుదీర్ఘమైన చరిత్ర కలిగిన హైదరాబాద్ నగరాన్ని ఆక్రమించుకోవడంలో వలసపాలకులందరిదీ ఒకే దారిగా కనిపిస్తుంది. ఎన్.టి.రామారావు అధికారంలో కొనసాగిన కాలంలో కోస్తాంధ్ర సంపన్న వర్గాలకు హైదరాబాద్‌ను నజరానాగా సమర్పించారు. రాజధాని నగరం చుట్టూ ఆంధ్రా కాలనీల ఏర్పాటుకు అవకాశం కల్పించి, చారిత్రక చిహ్నంగా నిలిచిన పాతబస్తీలను పట్టించుకోలేదు. ఆ తర్వాత అధికారాన్ని చేపట్టిన చంద్రబాబు నాయుడు అతి తక్కువ సమయంలోనే కోస్తాంధ్ర సంపన్న వర్గాలకు తోడుగా అభివృద్ధి పేరిట నగరం చుట్టూతా బహుళజాతి సంస్థలకు విలువైన భూములను ధారాదత్తం చేసారు. ఎన్.టి.ఆర్. జమానాలో వ్యాపార, వాణిజ్య, సినిమా పరిశ్రమ ద్వారా లక్షలాదిమంది ప్రాంతేతరులు హైదరాబాద్‌కు వచ్చి చేరితే, చంద్రబాబు హయాంలో లక్షలాదిమంది ప్రాంతేతరులు ఉద్యోగులుగా సాఫ్ట్‌వేర్ కంపెనీలలో వచ్చి వాలారు. హైదరాబాద్‌కు చారిత్రక చిహ్నంగా ప్రపంచవ్యాపితంగా ప్రసిద్ధికెక్కిన 'చార్మినార్' స్థానంలో వలస పాలకులు అనుసరించిన కుటిల నీతివల్ల 'హైటెక్' సిటీని నిలిపే ప్రయత్నం జరిగింది. వందలాది సంవత్సరాలుగా తెలంగాణ ప్రజల నుండి అనేక రకాలైన శిస్తులను చెల్లిస్తూ, నిజాం పాలకులు ముక్కుపిండి వసూలు చేసిన పన్నుల ఆధారంగా అభివృద్ధి చెందిన హైదరాబాద్ మహానగరంలో తెలంగాణ ప్రజలకు చోటు దక్కలేదు. నిలువ నీడ మిగలలేదు. కనీసం వారి త్యాగాలకు గుర్తింపు దొరకలేదు. తరతరాలుగా తమ రక్తాన్ని చెమటగా మార్చి చెల్లించిన పన్నులతో ఎదిగిన హైదరాబాద్‌లో ఇవ్వాళ తెలంగాణ ప్రజలు రెండవ శ్రేణి పౌరులుగా బిక్కుబిక్కుమంటూ కాలం వెళ్లదీయవలసిన దుస్థితి దాపురించింది. మరోవైపున లాభాపేక్షతో పెట్టుబడులు పెట్టిన ఆంధ్రా సంపన్నవర్గాలు హైదరాబాద్‌పై ఆధిపత్యాన్ని చెలాయించడం కోసం జిత్తులమారి ఎత్తుగడలను అమలు జరుపుతున్నాయి. ఆంధ్రా సంపన్నుల పెట్టుబడి సృష్టిస్తున్న సాంస్కృతిక విధ్వంసం నుండి హైదరాబాదీలు, తెలంగాణ ప్రజలు అభద్రతకు లోనై రక్షణ కోరుకుంటుంటే, తెలంగాణ ఏర్పడితే తమ పెట్టుబడులకు రక్షణ కరువైపోతుందంటూ గగ్గోలు పెడుతున్నారు. పాలకపార్టీలకు చెందిన ప్రముఖులందరూ సర్వకాల సర్వావస్థలయందు వీరి అడుగులకు మడుగులొత్తుతున్నారు.

హైదరాబాద్ నగరాన్ని దురాక్రమించేందుకు గడచిన యాభై ఏండ్లుగా జరుగుతున్న ఈ మొత్తం పరిణామక్రమంలో అందరికంటే క్రూరమైన పాత్రను పోషించిన, పోషిస్తున్న, భవిష్యత్తులో పోషించడానికి సిద్ధపడుతున్నది రాజశేఖరరెడ్డి. తెలంగాణ ప్రజలు ఎంతో విశ్వాసంతో అప్పగించిన అధికారాన్ని, తిరిగి ఆ తెలంగాణ ప్రజల ఆకాంక్షలను అణచివేయడానికి, వంచించడానికి గడచిన ఐదేళ్ల పదవీకాలంలో పూర్తిస్థాయిలో వై.ఎస్. వినియోగించుకున్నారు. హైదరాబాద్ నగరం చుట్టూ ఉన్న వేలాది ఎకరాల భూములను అతి తక్కువ ధరలకు, ప్రాంతేతర వ్యాపార సంస్థలకు అప్పగించారు. ఇట్లా వచ్చిన వేలకోట్ల రూపాయలను తెలంగాణేతర ప్రాంతాలలో ప్రాజెక్టుల నిర్మాణానికి, ఇతర అభివృద్ధి పనులకు వెచ్చించారు. తెలంగాణేతర ప్రాంతాల అభివృద్ధికి, తెలంగాణ ప్రాంతాన్ని ఒక ఇంధన వనరుగా వినియోగిస్తున్నారు. మరోవైపున తెలంగాణ ప్రజల కష్టార్జితాన్ని ఆంధ్రా సంపన్నవర్గాలకు చెందిన కార్పొరేట్ విద్యా, వైద్య సంస్థలు కబళించి వేస్తున్నాయి. సామ్రాజ్యవాద విషసంస్కృతి వలయంలోకి తెలంగాణ ప్రజలను దారిమళ్లించి, ఈ ప్రాంత ప్రజల చైతన్యాన్ని, పోరాటపటిమను బలహీనం చేసారు.

గడచిన ఐదు సంవత్సరాల కాలంలోనే సింగరేణిలో దాదాపు 26 వేల మంది గని కార్మికులను ఉద్యోగాల నుండి తొలగించేసారు. అండర్‌గ్రౌండ్ గనులను మూసివేస్తూ, ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్టులతో కోస్తాంధ్ర, రాయలసీమ కాంట్రాక్టు కంపెనీల దోపిడీ కేంద్రంగా సింగరేణిని మార్చేసారు. సింగరేణిలో పనిచేస్తున్న 71 వేల మంది గని కార్మికుల వేతనాలకంటే, ఆరు ఆంధ్రా కంపెనీల వార్షిక బిల్లుమొత్తం మించిపోయిందంటే, నూట ఇరవై సంవత్సరాల చరిత్ర కలిగి ఉన్న సింగరేణి సంస్థ ఏ స్థాయిలో వలసదోపిడీ కేంద్రంగా మారిపోయిందో అర్థం చేసుకోవచ్చు. సింగరేణిలో ఉత్పత్తి చేస్తున్న బొగ్గులో కేవలం 23 శాతం మాత్రమే తెలంగాణ ప్రాంతంలో వినియోగిస్తూ, మిగిలిన బొగ్గు ఇతర ప్రాంతాలకు తరలిస్తున్నారు.

ఈ పరిణామాల పర్యవసానంగా లక్షలాదిమంది ప్రాంతేతరులు వచ్చి తెలంగాణలో స్థిరపడిపోయారు. మరోవైపున లక్షలాదిమంది తెలంగాణ ప్రజలు నిరాశ్రయులయ్యారు. దిక్కుతోచని స్థితికి నెట్టివేయబడ్డారు. తెలంగాణ ప్రాంతంలో నిజాం కాలంలో నిర్మించిన సాగునీటి ప్రాజెక్టుల కింది భూములను ప్రాంతేతరులు ఆక్రమించుకున్నారు. తమ భూముల్లో తామే కూలీలుగా మారిన వైనం తెలంగాణ రైతాంగానిది. రాజధానిలో కొత్తగా వెలసిన కాలనీలలోనూ, ఇతర ప్రాంతాలలోనూ ఆంధ్ర హోటళ్లు, ఆంధ్రా కర్రీ పాయింట్లు, చిన్న వ్యాపారాలు మొత్తంగా ప్రాంతేతరుల ఆధిపత్యంలోకి చేరిపోయాయి. తెలంగాణ ప్రాంతానికి చెందిన చిరువ్యాపారులు, తోపుడుబండ్లు, ముస్లిం పేదలు నిర్వహించే ప్రత్యేక వ్యాపారాలు సైతం ప్రాంతేతరుల స్వాధీనంలోకి వెళ్లిపోయాయి. తెలంగాణలోని ప్రతి జిల్లాలోనూ గుంటూరు పల్లెలు వందలాదిగా వెలిసాయి. తెలంగాణలోని ప్రతి చిన్న పట్టణంలోనూ 'ఆంధ్రామెస్'లు విస్తరించాయి. ఈ పద్ధతుల్లో లక్షలాది మంది ప్రాంతేతరులు తెలంగాణ ప్రాంతంలోకి చొరబడి స్థిరపడిపోయారు. ప్రాంతేతరుల వలసల కారణంగా తెలంగాణ ప్రజలు ఉపాధి కరువై తల్లడిల్లిపోతున్నారు. పసిపిల్లలను అమ్ముకుంటున్నారు. ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఆకలిచావులకు బలైపోతున్నారు.

మహిళల అభ్యున్నతి, ఎదుగుదల, భౌతిక రక్షణలకు ప్రభుత్వాలూ, సమాజంలోని ప్రతి ఒక్కరూ బాధ్యత వహించాలంటున్నారు **సంకినేని వెంకటయ్య, సంకినేని మంజుల**

# స్త్రీలపై జరుగుతున్న హత్యలు - అత్యాచారాలు

**భా**రత సమాజంలో స్త్రీని తల్లిగా, చెల్లిగా ప్రేమించి వారికి ఎనలేని గౌరవాన్ని కల్పించడం మన దేశ సంప్రదాయం. గతంలో మాతృస్వామిక కుటుంబాలలో స్త్రీలే ఆధిపత్యం వహించిన సమాజం నుండి క్రమేపి పితృస్వామిక కుటుంబాలుగా మారినా స్త్రీల గౌరవం తగ్గలేదనే మనం చెప్పుకుంటాం. కాని ఇటీవల విద్యార్థినుల నుండి మొదలుకొని వృద్ధ మహిళల వరకు పురుషుల వలన అనునిత్యం ఎక్కడో ఒకచోట ఏదో ఒక రూపంలో దాడులు జరుగుతున్నాయి. రోజూ దినపత్రిక చూస్తుంటే ఏదో ఒక పేజీలో కిడ్నాప్‌లు, అత్యాచారాలు, హత్యలు, యాసిడ్ దాడులు మొదలైన ఘోరమైన సంఘటనలు, ఊహించని వార్తలు కనిపిస్తున్నాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే సభ్యసమాజం తలదించుకునేలా యువతుల ప్రాణాలకు రక్షణ లేని క్రూరత్వం, ప్రేమ పేరిట వేధింపులు, పరీక్ష హాలులో కత్తిపోట్లు, అర్ధరాత్రి హాస్టల్‌లో హత్య, పాఠశాల ఆవరణలో హత్య ఇలా ఎక్కడపడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు ఎలా వీలైతే అలా మహిళలపై నేరాలు చేస్తూ వారికి ప్రాణహాని కలుగజేస్తూ కొంత మంది పురుషులు ఉన్మాదులుగా మారుతున్నారు. క్షణికావేశంలో తీసుకునే నిర్ణయాలు నిండు ప్రాణాలను బలి తీసుకుంటున్నాయి.

నేటి పౌరుడికి ఉండవలసిన విద్యావిలువలు, విశ్వాసాలు జీవిత ఆదర్శాలు, సత్ప్రవర్తన, సర్వతోముఖాభివృద్ధి, శారీరక, మానసిక అభివృద్ధితో జ్ఞానులై దేశానికి సేవ చేయాల్సిన యువతరం అజ్ఞానులై కౌమార దశలో శీలం, విలువలు మొదలైన సద్గుణాలను వీడి, స్వార్థం, అవినీతి, హింసా ప్రవృత్తులకు నిలయమై, నేటి సమాజంలో శాంతి, సహకారం రెండింటిని లేకుండా చేస్తున్నారు. దేశం మొత్తం మీద మహిళలను వేధించిన, బాధించిన నేరాలు 2007లో 1,85,312 నమోదైతే అందులో 24,738 కేసులు లేదా 13.3 శాతం కేసులు రాష్ట్రం నుంచే నమోదయ్యాయి. మహిళలపై అత్యాచారాలు, నేరాల విషయాలలో అమెరికా, దక్షిణాఫ్రికా తర్వాత ప్రపంచంలోనే భారత్ మూడోస్థానంలో ఉంది. దేశంలో మహిళల పట్ల జరుగుతున్న నేరాల్లో ఆంధ్రప్రదేశ్ అగ్రస్థానంలో ఉన్నట్లు జాతీయ నేరాల నమోదు సంస్థ (ఎన్.సి.ఆర్.బి.) పేర్కొంది. మహిళల నేరాల విషయంలో అగ్రస్థానంలో త్రిపుర (30.7 శాతం)తో దాదాపు సమానంగా ఉంది. ఆంధ్రప్రదేశ్ మొత్తం మీద మహిళలపై నేరాల రేటు 2006లో ఉన్న 14.7శాతం నుండి 2007 నాటికి 16.3 శాతానికి పెరిగింది. ఇది చాలా ఆలోచించాల్సిన విషయం.

మన రాష్ట్రంలో మహిళలపై దాడులు 1999 నుండి ఎక్కువగా జరుగుతున్నాయి. మచ్చుకు కొన్ని సంఘటనలను పరిశీలిస్తే,

- 1999 అక్టోబర్ 29న గుంటూరులోని జెకెసి కళాశాలలో ఇంటర్ విద్యార్థిని నూకవరపు ప్రసన్నలక్ష్మిని తరగతి గదిలోనే సుభానీ అనే మెకానిక్ కత్తితో నరికి హత్య చేశాడు.
- 2004 జూన్ 21న విజయవాడలోని శారదా పోస్ట్ గ్రాడ్యుయేట్ కళాశాలలో ఎం.సి.ఎ. చదువుతున్న శ్రీలక్ష్మిని తన తోటి విద్యార్థులు వెంటపడి వేధించి చివరకు పాశవికంగా హత్యచేసిన రౌడీ విద్యార్థి మనోహర్ ఉదంతం సభ్య సమాజానికి సిగ్గుచేటుగా మిగిలిపోయింది.

---

నిరుద్యోగంతో అల్లాడిపోతున్నారు. కరువు, కాటకాలతో విలవిల్లాడుతున్నారు. అయినా తెలంగాణ ప్రజలెప్పుడూ పొట్టకూటికోసం వలస వచ్చిన ప్రాంతేతరులనెవ్వరినీ ఎలాంటి ఇబ్బందులకూ గురిచేయలేదు. తెలంగాణ ప్రాంతానికి వలసవచ్చిన ప్రాంతేతరులెవ్వరూ ఇక్కడి సంస్కృతిలో భాగం కాకపోయినా, ఇక్కడి భాషను, యాసను వెక్కిరించినా సహనంతో భరించారు. సినిమాల్లో విలన్లుగా చూపినా మన్నించారు. ఇదంతా కేవలం తెలంగాణ ప్రజల ఔదార్యం, సహనం, సౌమ్యత, సహజీవన సౌభ్రాతృత్వం వల్ల మాత్రమే సాధ్యపడింది. ఇట్లాంటి పరిస్థితులు ఆంధ్రలోగానీ, రాయలసీమలో గానీ ఎందుకు కనిపించడంలేదు?

వలసాధిపత్య విషవలయంలో తెలంగాణ ప్రజలు తమ అస్తిత్వాన్ని కోల్పోతూ కాందిశీకులుగా, రెండవశ్రేణి పౌరులుగా... చివరకు విదేశీయులుగానే బతకవలసిన దుర్భర పరిస్థితులు ప్రస్తుతం తెలంగాణలో నెలకొని ఉన్నాయి. అందుకనే తెలంగాణ ప్రజలు స్వయంపాలనాధికారాన్ని, నిర్ణయాధికారాన్ని కోరుకుంటున్నారు. తెలంగాణ ప్రజల మనోభావాలు తెలుసునని, ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటుకు అడ్డుకాదంటూ అడ్డదిడ్డంగా మాట్లాడి, నమ్మించి మోసగించిన వంచకులను క్షమించే ఓపిక ఇప్పుడు తెలంగాణ ప్రజలకు లేదనే వాస్తవాన్ని అన్ని ప్రాంతాల ప్రజలు బేషరతుగా గ్రహించవలసిందే. ప్రాంతాలను, ప్రజా సమూహాలను విభజించి పాలించి.. ఆధిపత్యాన్ని చెలాయించిన బ్రిటిష్ పాలకులకు, అదే పద్ధతిలో ఆధిపత్య కొనసాగింపును కోరుకుంటున్న వలసపాలకులకు మధ్యన తేడా లేకపోతే... వాళ్లలాగానే మీరు కూడా మాకు విదేశీయులే! ఇక ఇప్పుడు చరిత్ర పునరావృతం కాకుండా చూసుకోవాల్సిన బాధ్యత మీదే. వీ

- 2006 జూన్ 21న హైదరాబాద్‌లో కార్వాన్‌కు చెందిన రాణిని కన్నయ్యసింగ్ అనే వ్యక్తి తల్వార్‌తో నరికి హత్య చేశాడు. తాను ప్రేమించిన యువతికి పెద్దలు వేరే పెళ్ళి కుదిర్చారన్న అక్కసుతోనే కన్నయ్యసింగ్ ఆ అఘాయిత్యానికి పాల్పడ్డాడు.
- 2006లో వరంగల్ ఎస్వీఎస్ కళాశాలలో ఎమ్మెస్సీ చదువుతున్న విద్యార్థిని విజయలక్ష్మిని తోటి విద్యార్థులు హత్యచేసిన సంఘటన రాష్ట్ర వ్యాప్తంగా సంచలనం సృష్టించింది. వివాహిత అయి ఇద్దరు పిల్లలు కలిగిన ఈమెను తోటి విద్యార్థులు గదికి పిలిపించుకొని నగ్నంగా ఫోటోలు తీసి వేధించారు. తిరగబడటంతో హతమార్చి ఈ విషయం బయటికి పొక్కకుండా ఉండేందుకు గోనెసంచిలో కట్టి గుండ్లసింగారం శివారులో గలబావిలో పడేశారు.
- 2007 ఫిబ్రవరి 11న విజయవాడలోని ఓ లాడ్జిలో న్యూస్ రీడర్ లక్ష్మీసుజాత దారుణ హత్యకు గురయింది. వివాహ ప్రతిపాదన తిరస్కరించిందన్న కారణంగా ఓ ప్రైవేట్ సంస్థలో పనిచేస్తున్న చంద్రశేఖర్ అనే యువకుడు ఈ ఘాతుకానికి పాల్పడ్డాడు.
- 2007 ఫిబ్రవరి 19న నల్గొండ జిల్లా రామన్నపేట శివారు కొమ్మాయిగూడెంలో ఆకిటి పార్వతమ్మ అనే యువతిని అదే గ్రామానికి చెందిన తండు రమేశ్ కత్తితో దాడిచేసి హత్యచేశాడు. తాను ప్రేమించిన యువతి వేరే వ్యక్తిని పెళ్ళి చేసుకుంటుందన్న అక్కసే దీనికి కారణం.
- 2007 డిసెంబర్ 21న కృష్ణా జిల్లా ఇబ్రహింపట్నంలో ఫార్మసీ విద్యార్థిని ఆయేషా మీరా హాస్టల్‌లో దారుణ హత్యకు గురయింది.
- 2008 ఏప్రిల్ 9న విజయవాడ కృష్ణలంకలో ఇంజనీరింగ్ విద్యార్థిని మీనాకుమారిని ఆమె సీనియర్ అయిన సందీప్ కత్తితో పొడిచాడు.
- 2008 జూలై 18న ఖమ్మం పట్టణానికి చెందిన విద్యార్థిని సయ్యద్ సుమేరా పై ముక్తార్‌పాషా అనే ఫోటోగ్రాఫర్ కత్తితో దాడిచేసి ఆమె గొంతు కోశాడు.
- 2008 డిసెంబర్‌లో 11న వరంగల్ కిట్స్ కళాశాలలో ఇంజనీరింగ్ చదువుతున్న స్వప్నిక, ప్రణీత అనే ఇద్దరు విద్యార్థినులపై ప్రేమ తిరస్కరించిందనే నెపంతో శాఖమూరి శ్రీనివాసరావు, ఇద్దరు అనుచరులతోకలిసి యాసిడ్ దాడి చేయగా ఆ మరుసటిరోజునే పోలీసులకు చిక్కి, శ్రీనివాసరావు అతని అనుచరులు ఇద్దరూ ఎన్‌కౌంటర్‌లో చనిపోయారు. స్వప్నిక కొన్ని రోజులు మృత్యువుతో పోరాడి చివరికి చనిపోయిన సంఘటన మనకళ్లముందే కన్పిస్తోంది. రాష్ట్ర వ్యాప్తంగా సంచలనం కలిగించిన ఈ సంఘటన కారణంగా ఐదు కుటుంబాల్లో విషాదం నిండింది.

ఈ విధంగా విద్యార్థినులపై పెరుగుతున్న ఉన్మాదుల ఆగడాలను అరికట్టాల్సిన అవసరం ఉంది. సినిమాల్లోలాగా నిజజీవితంలో కూడా దాడులకు పాల్పడటం అత్యంత హేయమైన చర్య. అశ్లీలత, హింసా ప్రవృత్తి ఉన్న సినిమాలను సెన్సార్ చేయకపోవడం వల్ల విద్యార్థినులపై ఈ విధమైన దాడులు జరుగుతున్నాయి. తమకు కలిగిన ఆకర్షణనే ప్రేమగా భావించడం, ప్రేమించకపోయిన ప్రేమను తిరస్కరించిందని వేధింపులు, వికృత పరిణామాలకు పూనుకోవడం ఈ క్షణికావేశపు నిర్ణయాలు ప్రేమించిన ఆ ప్రేమికుడిని ఉన్మాదిగా మార్చేస్తున్నాయి. ఇలా తయారు కావడానికి అనేక కారణాలు ఉన్నాయి. తల్లిదండ్రుల పెంపకం, పరిసరాల ప్రభావం, చెడు వ్యక్తుల సహవాసం, పెద్దల అజమాయిషీ కొరవడటం ఒక కారణమైతే ప్రైవేట్ కాలేజీల్లో యాజమాన్యాల ధోరణి, అశ్లీల సినిమాలు, టి.వి.లలో ప్రసారమయ్యే అశ్లీల అనైతిక సీరియల్స్‌ను కట్టడి చేయడంలో ప్రభుత్వాలు విఫలం కావడం మరో కారణం. వీటివల్ల కొంతమంది విద్యార్థులు రౌడీలుగా, ఉన్మాదులుగా మారి నైతిక విలువలను కోల్పోతున్నారు. ఆధునిక మహిళ తన ప్రతిభా సామర్థ్యాలతో పురుషాధిక్యతను అధిరోహిస్తూ పురోగమిస్తోంది. ఇదివరకు గడప దాటని మహిళకు ఎల్లలు దాటుతున్న నేటి మహిళకు ఎంతో తేడా ఉంది. ఆంక్షలు, అవరోధాలను అధిగమించి దూసుకుపోతున్న మహిళలను ప్రేమ అనే పేరుతో ఉన్మాదిలా మారి ప్రాణాలను తీయడం ఎంతవరకు సమంజసం? ఆత్మవిశ్వాసంతో అన్ని రంగాలలో అంచెలంచెలుగా ఎదుగుతున్న తరుణంలో మహిళలపై ఇలాంటి సంఘటనలు జరగడం దురదృష్టకరం.

మారుతున్న కాలానికి అనుగుణంగా అమ్మాయి తల్లిదండ్రుల దృక్పథంలో మార్పులు వచ్చి అమ్మాయి ప్రతిభను గుర్తిస్తూ ప్రోత్సహిస్తున్న ప్రస్తుత తరుణంలో పాశవికంగా యువతులపై దాడులు, వరకట్న మరణాలు, మహిళల కిడ్నాప్‌లు, అసభ్యకరమైన ప్రవర్తనలు, భర్తల వేధింపులు, లైంగిక వేధింపులు ఇలా చెప్పుకుంటూపోతే తెలియని కేసులు ఇంకెన్నో... తెలియని మహిళల వేధింపులు ఎన్నో... నైతిక, ఆధ్యాత్మిక సామాజిక విద్యా విలువలు మరిచి అమ్మాయిలను వేశ్యా గృహాలకు విక్రయించడం, బాలికలను, అమ్మాయిలను కిడ్నాప్ చేయడం, హత్య చేయడం వంటి అఘాయిత్యాలు చూస్తుంటే రాజ్యాంగం మనకు కల్పించిన జీవించే హక్కు లేనట్లుగా తోస్తున్నది.

నిద్రాణంగా ఉన్న ప్రభుత్వరంగం మేల్కొని మహిళలను ఆర్థికంగా, రాజకీయంగా, సామాజికంగా, భౌతికంగా కాపాడవలసిన బాధ్యతను తీసుకోవాలి. రిజర్వేషన్లు, ప్రత్యేక కోటాలు ప్రత్యేక సెల్ ఏర్పాటు చేస్తే సరిపోదు వారికి ఆత్మరక్షణ, మనో నిబ్బరం కావాలి. తమను తాము పునరావిష్కరించుకునే సత్తా శక్తి సామర్థ్యాలు నేటి మహిళలకు ఉన్నాయి. అలాంటి శక్తి సామర్థ్యాలకు తగిన గుర్తింపు, రక్షణ కావాలి. అది ఎవరు అందించగలరు? మారుతున్న కాలానికనుగుణంగా తల్లిదండ్రుల ప్రవర్తనలో మార్పు వచ్చి అమ్మాయిని అబ్బాయితో సమానంగా అన్ని రంగాలలో ప్రోత్సహిస్తున్నారు. తల్లిదండ్రుల ప్రోత్సాహాన్ని నిరుత్సాహపరిచేలా ఇలాంటి సంఘటనలు చోటు చేసుకుంటున్నాయి. అబ్బాయిల, అమ్మాయిల ప్రవర్తనను తల్లిదండ్రులు గమనిస్తూ తగిన క్రమశిక్షణతో వారిని తీర్చిదిద్దాలి. యువతరం ముందుగా ప్రేమ, ఆకర్షణ అనే వాటికి తేడా తెలుసుకొని భారతదేశ సాంస్కృతిక వారసత్వాన్ని ప్రపంచానికి అందించాలి.

ప్రేమను తిరస్కరించారనే నెపంతో, ప్రేమించి వేరే పెళ్లి చేసుకుంటున్నారన్న అక్కసుతో అమ్మాయిల స్వేచ్ఛకు భంగం కలిగించే హక్కు ఎవరికీ లేదు. మనకు రాజ్యాంగం కల్పించిన జీవించే హక్కుకు అర్థం లేకుండా పోతోంది. ఇప్పటికైనా ప్రభుత్వాలు తగిన విధంగా స్పందించాల్సిన అవసరం ఉంది. అమ్మాయిలు ఎక్కడ ఏ విధమైన ఇబ్బందులకు గురైనా ప్రభుత్వం తక్షణమే స్పందించి తగిన చర్యలు తీసుకోవాలి. కాలేజీల్లో విద్యార్థిని విద్యార్థులకు భవిష్యత్ జీవితంపై కౌన్సిలింగ్ క్లాసులు నిర్వహించి వారి ఆలోచన దేశ అభివృద్ధివైపు తీసుకెళ్ళాలి. సమాజంలో స్త్రీలందరికి ప్రభుత్వం మేమున్నాం అనే భరోసా కలిగించినపుడే, మహిళలు అర్ధరాత్రి ఒంటరిగా భయంలేకుండా తిరిగిన నాడే నిజమైన స్వేచ్ఛ దేశానికి వచ్చిందని భావించాలి. దీని కోసం ప్రతి ఒక్కరూ బాధ్యతాయుతంగా తమ పాత్ర నిర్వహించాలి. వీ

డబ్ల్యు.టి.ఒ. ఒప్పందాలకు వ్యతిరేకంగా ప్రజలూ, ప్రజాస్వామికవాదులూ వేసిన ప్రశ్నలన్నీ సరైనవే అని ఐక్యరాజ్య సమితి పరిశీలకులు ఇచ్చిన నివేదిక గుట్టును వివరిస్తున్నారు **కె. అనురాధ**

# ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందాలు - ఆహార భద్రత

ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందాలు ఎన్నో పేద దేశాలను, ఎందరో పేద ప్రజల జీవితాలను అతలాకుతలం చేసాయి. పేద దేశాలకీ ధనిక దేశాలకీ మధ్య అన్యాయమైన, అసమానమైన పోటీని నెలకొల్పి, దాన్ని సరికొత్త వాణిజ్యనీతిగా చెలామణీ చేస్తోంది. పైగా ప్రపంచ దేశాలన్నిటికీ అదే మంచిదని, ఆరోగ్యకరమైన అభివృద్ధిని సాధించి పెడుతుందని చెపుతున్నారు. ఈ నేపథ్యంలో ఐక్య రాజ్య సమితి ఆహార భద్రతపై ఈ ఒప్పందాల ప్రభావం ఎలా ఉందో అధ్యయనం చేయడానికి ఒక ప్రత్యేక పరిశీలకుడిని నియమించింది. ఆ ప్రత్యేక పరిశీలకుడు, ఆలివర్ డి. షూటర్, జూన్ 2008 నుంచి వివిధ దేశాల ప్రభుత్వాలను, వాణిజ్య సంస్థ రాయబారులను కలిసి తన నివేదికను రూపొందించారు. దాన్ని ఈ సంవత్సరం మార్చ్‌లో విడుదల చేశారు.

ఐక్యరాజ్య సమితి మొట్టమొదటిసారి ఇలాంటి అధ్యయనాన్ని ఒక స్వతంత్ర నిపుణుడి ద్వారా చేపట్టడం విశేషం. ప్రపంచ వాణిజ్య సంస్థ ఆ మేరకు అధ్యయనానికి ఒప్పుకుని సహకరించడం ఇంకా పెద్ద విశేషం. ఇన్ని విశేషాలతో కూడిన ఈ అధ్యయనం ఎన్నో ఆసక్తికరమైన అంశాలను వెలుగులోకి తెచ్చింది. చాలాకాలంగా ప్రపంచీకరణ చెడు ప్రభావాలను, అందులో భాగమైన ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యూటిఒ) ఒప్పందాలను ప్రశ్నిస్తున్న సామాజిక శాస్త్రవేత్తలు, ఉద్యమకారులు, రైతులు అంటున్న మాటలనే ఇప్పుడు ఐరాస నిపుణుడు కూడా చెప్పాడు.

ఒకరకంగా ఇది సరైన సమయంలో సరైన ప్రశ్నలను లేవదీస్తున్న మంచి నివేదిక. ప్రపంచీకరణే శరణ్యంగా భావించే పాలకులకు కనువిప్పు కాగలదు. అభివృద్ధి చెందుతున్న దేశాలు డబ్ల్యుటిఒ తో తమ ఒప్పందాలను గురించి పునరాలోచించవచ్చు.

ఇక నివేదికలో లేవనెత్తిన అంశాలను ఒక్కోదాన్ని పరిశీలిస్తే, అసలు వాణిజ్య ప్రయోజనం ఏమిటనే దానితో చర్చ మొదలవుతుంది. వాణిజ్యం అనేది అభివృద్ధి కోసం జరగాలి. అదే సమయంలో అది అందరికీ ఆహార భద్రతను కలిగించగలగాలి. అప్పుడే దాని ప్రయోజనం నెరవేరినట్లు అవుతుందని అంటూ ఆహార భద్రత అనే ప్రాథమిక మానవ హక్కు పట్ల డబ్ల్యూటిఒ కి బాధ్యత ఉందని నివేదిక చాలా కచ్చితంగా చెప్తుంది. ఈ విషయాన్ని బలపరచడానికి ఎన్నో అంతర్జాతీయ చట్టాలను, ఒప్పందాలను ఉటంకించారు. కాబట్టి డబ్ల్యుటిఒ వాణిజ్యపరమైన ఒప్పందాలు చేసుకునేటప్పుడు ఆహార భద్రత బాధ్యతను విస్మరించ కూడదని నొక్కి చెప్పారు.

వాణిజ్య ప్రయోజనాల చర్చ మొత్తం చాలా తలక్రిందులుగా జరుగుతోందని చెప్తూ వాణిజ్యం వల్ల ఒక దేశానికి మొత్తం మీద కలిగే ప్రయోజనాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకోరాదని, దాని ప్రభావం అట్టడుగు ప్రజలపైన, వారి ఆహార భద్రతపైన ఎలా ఉందనేది ప్రామాణికం కావాలని చెప్పారు. ఆహార పంటల ఉత్పత్తి మరింత పెంచితేనో లేదా ఆహార పంటల వాణిజ్యం పెంచుకుంటూ పోతేనో దేశంలో ఆకలి సమస్య తీరుతుందనేది భ్రమ. ప్రజల కొనుగోలు శక్తిని పెంచే మార్గాలను అన్వేషించాలి. కాబట్టి ఈ రోజు మన ముందున్న ప్రథమ కర్తవ్యం ఉత్పత్తి పెంచడం కాదు, ఉత్పత్తి అయిన ఆహారాన్ని అందరికీ అందుబాటులోకి తేవడం. అదే మన ముందున్న పెద్ద సవాలని నివేదిక రాసిన షూటర్ అంటారు.

వ్యవసాయ ఉత్పత్తులను మిగతా వస్తువుల వాణిజ్యం కంటే భిన్నంగా చూడాలి. అభివృద్ధి చెందిన దేశాలకీ, అభివృద్ధి చెందుతున్న దేశాలకీ ఒకే రకమైన నియమాలు విధించడం అన్యాయమని నివేదిక అంటుంది. ఎందుకంటే అభివృద్ధి చెందుతున్న దేశాల సగటు ఉత్పాదకత, శ్రమించే శక్తి అభివృద్ధి చెందిన దేశాలతో పోలిస్తే చాలా తక్కువ. అతి తక్కువ అభివృద్ధి చెందిన దేశాల పరిస్థితి ఇంకా దారుణం. ఇన్ని వ్యత్యాసాల మధ్య సమానపోటీ సాధ్యంకాదు. కాని ప్రస్తుతం జరుగు తున్నది అదే. పోటీని తట్టుకుని నిలబడే క్రమంలో అభివృద్ధి చెందుతున్న దేశాలు తమ దేశాల్లో వేతనాలను, వ్యవసాయ ఉత్పత్తుల కొనుగోలు ధరలను విపరీతంగా తగ్గించాల్సిన పరిస్థితి వచ్చింది. ఇదే అంతిమంగా ప్రజల ఆహార హక్కును హరిస్తుంది. ఆకలి చావులకు గురిచేస్తోంది.

వ్యవసాయ వాణిజ్య సరళీకరణను ఈ నివేదిక మానవ హక్కుల కోణం నుండి అర్థం చేసుకోవాలని చెప్తూ నాలుగు సూచనలు చేసింది. రాజ్యాలు ఆహార హక్కును కాపాడుకోవడం కోసం తమ జాతీయ విధానాలను రూపొందించుకున్నప్పుడు తప్పనిసరిగా వాణిజ్య ఒప్పందాల ప్రభావాన్ని దృష్టిలో పెట్టుకోవాలని అంటుంది. రాజ్యాలకు విధానాల రూపకల్పనలో తగినంత అవకాశం లభించాలంటే బహుళపక్ష వాణిజ్య విధానాల అవసరాన్ని గుర్తించాలి. పాలకులు తమ ప్రామాణికాలను గుర్తించేటప్పుడు రూపంలేని సూచికలైన స్థూల దేశీయ ఉత్పత్తి లాంటి వాటిని పక్కన పెట్టి అట్టడుగున ఉన్నవారి అవసరాలనే సూచికగా తీసుకోవాలి. ప్రపంచంలో ఇప్పటికే 963 మిలియన్ల మంది ఆకలితో అలమటిస్తున్నారని, వారికి తిండి పెట్టలేని ఏ వాణిజ్య విధానమైనా పూర్తిగా నిరుపయోగమని చెప్తుంది.

ఐరాస నివేదికలోని మరొక కొత్త అంశం పర్యావరణ పరిరక్షణ. ఆహార హక్కుని నిర్వచించేటప్పుడు ఆహారమంటే ఏదో ఒకటి కాదు. అది సురక్షితంగా, ఆరోగ్యకరంగా, పోషకాలతో కూడినదిగా, ప్రజల ఆహార అలవాట్లకు సరిపోయేదిగా, అన్నిటికంటే ముఖ్యంగా సుస్థిరమైనదిగా ఉండాలని నివేదిక చెప్తుంది. ఇక మీదట వాణిజ్యానికి సంబంధించిన అన్ని చర్చల్లో పర్యావరణాన్ని కూడా భాగం చేయాలని సూచించింది.

కొద్దిగా చరిత్రలోకి వెళ్లి డబ్ల్యుటిఒ పుట్టుపూర్వోత్తరాలు చూద్దాం. ఇన్ని సమస్యలకు మూలమైన డబ్ల్యుటిఒ 1995 నుండి అమలులోకి వచ్చింది. గాట్ (జిఎటిటి) అనే మాతృ సంస్థ నుండి ఉరుగ్వే సమావేశ చర్చల్లో ఆవిర్భవించిన డబ్ల్యుటిఒ ఇప్పటికీ పూర్తి రూపం తీసుకోలేదు. అయినప్పటికీ వ్యవసాయ వాణిజ్యానికి సంబంధించి చేసుకున్న ఒప్పందం ఎఒఎ (అగ్రిమెంట్ ఆన్ అగ్రికల్చర్) ప్రస్తుతం అమలవుతోంది. ఎఒఎ ఒప్పందానికి మూల స్తంభాల్లాంటి మూడు అంశాలు ఉన్నాయి. దానిలో మొదటిది మార్కెట్‌ని అందరికీ అందుబాటులో ఉంచడం. అంటే ఎవరైనా, ఏ దేశం వారైనా తమ సరుకులు తెచ్చి అమ్ముకోవడానికి సదుపాయం కల్పించడం, సదుపాయాలంటే దిగుమతి సుంకాలను సడలించడం, మనకంటే అభివృద్ధి చెందిన దేశాల్లో ఉత్పత్తి వ్యయం తక్కువగా ఉండడం వల్ల (మెరుగైన యాంత్రిక, సాంకేతిక విధానాలవల్ల, భారీ రాయితీల వల్ల) అతి చవకైన ధరలతో సరుకులు దింపుతారు. అంతిమంగా మన రైతులు కూడా ఆ ధరలకే అమ్ముకోక తప్పదు. గిట్టుబాటుకాని వ్యవసాయాన్ని క్రమంగా వదులుకోక తప్పదు. గత కొద్ది సంవత్సరాలుగా మనం చూస్తున్న దృశ్యమే ఇది.

రెండవ ఒప్పందం ఎగుమతి రాయితీలు తగ్గించాలని. అంటే మన దేశం నుండి ఎగుమతి అయ్యే ఉత్పత్తులకు రాయితీలు తగ్గిస్తే వాణిజ్యం న్యాయంగా జరుగుతుందని వాదన. అటు దిగుమతి సుంకాలు ఎత్తివేయడం వల్ల దేశానికి రెవిన్యూ తగ్గుతోంది, ఇటు ఎగుమతులను కట్టడి చేయడంతో విదేశీ మారక ద్రవ్యం తగ్గిపోతోంది.

ఇక మూడవ ప్రమాదకరమైన ఒప్పందం ప్రభుత్వాలు స్థానికంగా రాయితీలు, రైతులకిచ్చే సహాయాన్ని తగ్గించాలని. అంటే మన దేశంలో ఎరువులు, విత్తనాలు, పురుగు మందులపై రైతులకు ఇచ్చే రాయితీలు, బ్యాంకు రుణ సౌకర్యాలు లాంటివి. వీటిని వాణిజ్యాన్ని వక్రీకరించే రాయితీలుగా పేర్కొంటున్నారు. అభివృద్ధి చెందిన దేశాలు ఇప్పటికే చాలా విధాలుగా రాయితీలు పొంది ఒక స్థాయికి వచ్చాయి. అయినప్పటికీ ఇంకా కొన్ని కనపడని రాయితీలు పొందుతూనే ఉన్నాయి. అదెలాగంటే 1986-88ని ప్రామాణికంగా తీసుకుని అప్పటివరకు ఉనికిలో ఉన్న రాయితీల్లో ధనిక దేశాలు 20 శాతం తగ్గించుకుంటే, పేద దేశాలు 13.3 శాతం తగ్గించుకోవాలని నియమం పెట్టారు. నిరుపేద దేశాలకు మినహాయింపు ఇచ్చాయి. అంటే బాగా తిన్నవాడు, అప్పుడే తినడానికి కూర్చున్నవాడు ఇద్దరూ కలిసి ఇక తిన్నది చాలు ఆపేద్దాం అన్న చందంగా ఉంది. 2001లో 'దోహా'లో జరిగిన డబ్ల్యుటిఒ సమావేశంలో ధనిక దేశాల రాయితీలు తగ్గించాలని భారత్, బ్రెజిల్ దేశాలు చాలా గొడవ చేసాయి. ఆ అంశం ఇంతవరకు తెగలేదు. దోహా చర్చలు ఇప్పటికీ అర్ధాంతరంగా నిలిచిపోయే ఉన్నాయి.

ప్రతిసారి ఓడిపోతున్న పేద దేశాల చిన్న, సన్నకారు రైతులు దిక్కుతోచక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. అభివృద్ధి చెందిన దేశాల స్థూల దేశీయ ఉత్పత్తిలో వ్యవసాయం వాటా 9 శాతం, వ్యవసాయం మీద ఆధారపడుతున్నవారు 50 శాతం కాగా అభివృద్ధి చెందుతున్న దేశాల్లో స్థూల దేశీయ ఉత్పత్తిలో వ్యవసాయం వాటా 30 శాతం. దాని మీద ఆధారపడుతున్న వారు 70 శాతం మంది. ఇలాంటి పరిస్థితి ఉన్న దేశాల్లో ఆహార భద్రతను సాధించాలంటే వ్యవసాయ రంగాన్ని (ముఖ్యంగా సన్న, చిన్నకారు రైతులను) పటిష్ట పరచాలని నివేదిక చాలా స్పష్టంగానే చెప్పింది.

నివేదికలోని చిట్టచివరి భాగం ఈ అనర్థాలనుండి బయటపడే మార్గాలను గురించి అన్వేషిస్తుంది. ముఖ్యంగా వాణిజ్యాన్ని ఆహార హక్కుతో ఎలా సమన్వయపరచాలో చెప్తుంది. వాతావరణ మార్పుకి ఆహార సంక్షోభానికీ ఉన్న దగ్గర సంబంధాన్ని డబ్ల్యుటిఒ ఒప్పందాలు పట్టించుకోవడం లేదు. ప్రపంచవ్యాప్తంగా 2080 నాటికి ఆహార ఉత్పత్తి 16.25 శాతం తగ్గుతుందని నిపుణులు అంచనా వేసారు. (మరీ ముఖ్యంగా దక్షిణ అమెరికా, ఆఫ్రికా ఖండాల్లో). ఈ సందర్భంలో కేవలం ఉత్పాదకత పెంచుకోవడం గురించి మాట్లాడితే సరిపోదు. వాతావరణాన్ని పరిరక్షించుకుంటూ ఆహార ఉత్పత్తి ఎలా చేయాలనేది ప్రధానం కావాలి.

వాణిజ్యాన్ని ఆ దిశగా కొనసాగించడానికి షూటర్ ప్రభుత్వాలకు కొన్ని సూచనలు చేసారు.

1. ఏ ప్రభుత్వమైన తమ దేశ ఆహార భద్రతకు ముప్పు కలిగించే ఒప్పందాలను ఎట్టి పరిస్థితిలో ఒప్పుకోకూడదు.
2. అభివృద్ధి చెందుతున్న దేశాలపట్ల ప్రత్యేకమైన వైఖరిని అవలంబించాలి. వాళ్ల స్థానిక మార్కెట్టుని, కాపాడుకుంటూ అంతర్జాతీయంగా ధరల పెరుగుదల ప్రభావం వాటి మీద పడకుండా నియంత్రణ పద్ధతులను ఏర్పాటు చేసుకోవాలి.
3. అంతర్జాతీయ వాణిజ్యంపై అతిగా ఆధారపడటం మానేయాలి. అది జరగాలంటే ఎవరి వినియోగ అవసరానికి సరిపడా వారు ఆహారం పండించుకునే పరిస్థితిని నెలకొల్పాలి. ముఖ్యంగా చిన్న సన్నకారు రైతులను ఆదుకోవాలి.

ఒప్పందాల బరువు కింద నలిగిపోతున్న పేద దేశాలు ఈ పనులు ఎంతవరకు చేయగలవనేది మనముందున్న ప్రశ్న. అయితే డబ్ల్యుటిఒ ఒప్పందాలలో ఉన్న వెసులుబాట్లను ప్రభుత్వాలు సరిగ్గా ఉపయోగించుకోలేక పోతున్నాయని షూటర్ అభిప్రాయం. ముఖ్యంగా కొన్ని ఉత్పత్తుల మీద సుంకాలు విధించే అవకాశాలను వదులుకుంటున్నారు. అలాగే కొన్ని ఒప్పందాల పరిధిలో ఉన్న రక్షణ కవచాలను కూడా ఉపయోగించలేక పోతున్నారని అంటారు. దీనికి కారణం కూడా మళ్లీ ఆయనే చెప్పారు. ఆ దేశాలకు అప్పులిచ్చే సంస్థల (ప్రపంచబ్యాంక్, ఐఎంఎఫ్) మితిమీరిన ఆంక్షలే దీనికి కారణమని ఆయన చాలా స్పష్టంగానే చెప్పారు.

మొట్టమొదటిసారి ఒక స్వతంత్ర నిపుణుడి అధ్యయనాన్ని ఆమోదించిన ప్రపంచ వాణిజ్య సంస్థ ఈ నివేదికను ఎంతవరకు పట్టించుకుంటుందో వేచి చూడాలి. వీ

*దండోరా ఉద్యమ స్ఫూర్తితో ప్రారంభమైన మాదిగ సాహిత్యం మొత్తంగా తెలుగు సాహిత్యానికే కొత్త నడకలు నేర్పిందంటున్నారు* **సాంబయ్య గుండిమెడ**

# మాదిగ సాహిత్యం : తెలుగు సాహితీ ఫలకంపై కొత్త దరువు

*(...గత సంచిక తరువాయి)*

### అరుంధతి - వసిష్ఠుల కల్యాణం - ఐక్యతా సందేశం

1959లో బోయి భీమన్న రాసిన 'రాగ వాసిష్ఠం' నాటకం విశిష్టతను అంచనా వేసే ప్రయత్నాన్ని దార్ల 'రాగవాసిష్ఠం - నాటక వైశిష్ట్యం' అన్న వ్యాసంలో చేశాడు. దండోరా ఉద్యమ నేపథ్యం నుండి పుట్టుకొచ్చిన మాదిగ సాహిత్యంతో ఈ నాటకానికి ప్రత్యక్ష సంబంధం లేకపోవడం వలన ఈ వ్యాసాన్ని ఈ పుస్తకంలోని మిగిలిన వ్యాసాలతో జత చేయడంలో ఔచిత్యం ఉందనిపించదు. అయితే తమ ప్రాచీనులు తమకు అందించిన పౌరాణిక, జానపద, మౌఖిక సాహిత్య వారసత్వ సంపదను తిరిగి దొరక పుచ్చుకునే కార్యక్రమాన్ని మాదిగ సాహిత్య పరిణామ క్రమంలోని రెండవ దశలో మాదిగ సాహితీకారులు చేపట్టినట్లుగా మనం పైన చెప్పుకోవడం జరిగింది. ఆ ప్రయత్నంలో భాగంగానే మాతంగ కన్య అయిన అరుంధతీదేవి, బ్రాహ్మణ పురుషుడైన వసిష్ఠుడి మధ్య కులాతీతంగా నడచిన ప్రణయం, అది పరిపక్వమై వారిరువురిమధ్య జరిగిన కల్యాణగాథను మాదిగలు బయటకు తీయడం జరిగింది. మాదిగలకున్న పౌరాణిక చారిత్రక వారసత్వం కోసం జరుగుతున్న అన్వేషణలో నుండి దీన్ని అర్థం చేసుకోవాలి. ఆ దృష్టితో చూసినప్పుడు అరుంధతి-వసిష్ఠుల కల్యాణం ప్రధాన వస్తువుగాగల నాటక విశ్లేషణ వ్యాసాన్ని ఈ పుస్తకంలో పొందుపరచడం అసందర్భ మనిపించదు.

ఇక రాగ వాసిష్ఠం నాటకంపై దార్ల వ్యాసం గురించి చెప్పుకోవాలంటే, అతని వ్యాసాన్ని రెండు భాగాలుగా చేసి అందులోని విశ్లేషణను అవగతం చేసుకోవచ్చును. మొదటిభాగం నాటకం గురించయితే, రెండవ భాగం నాటకం ప్రతిపాదించిన జాతి సిద్ధాంతం గురించి బోయి భీమన్న ఆ నాటకాన్ని రాయడానికి పురిగొల్పిన చారిత్రక సంఘటన, నాటక కథా సారాంశం, నాటక రచనా విధానం, నాటకతత్వం మున్నగు విషయాల పైన మొదటిభాగంలో సాహితీపర చర్చ జరిగితే, శూద్రులు, అంటరానివారి పుట్టు పూర్వోత్తరాలపై అంబేద్కర్ చేసిన చర్చ వెలుగులో శూద్రులు, చండాలురు, మాల-మాదిగల వంటి పేర్లతో పిలిచే వారంతా భరత ఖండ మూలవాసులే కాకుండా, అసలైన ఆర్య జాతులవుతారని బోయి భీమన్న చేసిన జాతి సిద్ధాంత ప్రతిపాదనపై సవిస్తరమైన చర్చ రెండవ భాగంలో జరిగింది. అరుంధతీదేవి చండాల కన్య కాదు. ఆమె ఆర్య జాతికి చెందిన కన్య అని బోయి భీమన్న చేసిన ప్రతిపాదనను వివరణలతో సమర్థించేందుకు దార్ల పరిశోధించిన గ్రంథ (భగవద్గీత, మనుస్మృతి, సర్వేపల్లి రాధాకృష్ణన్, బి.ఆర్. అంబేద్కర్ రచనలు) వివరాలను బట్టి ఈ వ్యాస రచనకై అతను చేసిన మేధోగత శ్రమను మనం తప్పక గుర్తించవలసివుంది.

అరుంధతీ దేవి కథ భూమికగా చేసుకుని ఆర్య-అనార్య భేదాలను చర్చించి శూద్రులు, పంచములు ఈ దేశ మూలవాసులే కాకుండా కుల వ్యవస్థ పైఅంతస్తులలో ఉన్న మిగిలిన మూడు వర్ణాల మాదిరే ఆర్య జాతీయులని బోయి భీమన్న తన రాగ-వాసిష్ఠం నాటకంలో చెప్పడంలో భారతీయులంతా ఒకే జాతి సంతతి అనే సందేశమిచ్చి, భారతజాతి సమైక్యతను కాంక్షించారని తెలుస్తుంది. అయితే నాటకం ద్వారా రచయిత ఆశించిన ప్రయోజనాన్ని అటుంచి అసలు మూల కథలో నిబిడీకృతమైన మాదిగల తాత్వికతను కొంత సమగ్రంగా చర్చించడం అవసరం. ఈ తాత్వికత దార్ల వ్యాసంలో అంతర్లీనంగా వ్యక్తమైనపటికీ వ్యాస పరిధి రీత్యా ఆ విషయాలను లోతుగా చర్చించే అవకాశం అతనికి దొరకలేదనిపిస్తుంది. అరుంధతీ దేవి కథలో దాగున్న మాదిగల తాత్వికత ఏమిటి? అరుంధతీయ, ఆది జాంబవ సంఘం లాంటి పేర్లతో హైదరాబాద్-సికింద్రాబాద్ జంటనగరాలలో ఉన్న కొన్ని మధ్యతరగతి మాదిగ సంఘాలు తప్ప అరుంధతీదేవి కథను దాదాపుగా మర్చిపోయిన మాదిగలు దండోరా నేపథ్యంలో అకస్మాత్తుగా ఆ కథను స్వంతం చేసుకోవడంలో వారు ఆశిస్తున్న ప్రయోజనం ఏమిటి? ఈ ప్రశ్నలపై సుదీర్ఘమైన చర్చ, పరిశోధన జరగవలసిన అవసరం ఎంతైనా ఉంది.

### అంబేద్కర్ నుండి దార్ల వరకు

'దళిత సమస్యలపై ప్రజా సాహితీ దృక్పథం' వ్యాసంలో ఆగస్ట్ 1977 నుండి నేటి వరకు ప్రజాసాహితీ మాసపత్రిక వారు దళితుల సమస్యలను, సంఘర్షణలను వర్గ దృక్పథం వెలుగులో అర్థం చేసుకున్న తీరును, వ్యాఖ్యానించిన రీతులను సహేతుకంగా అంచనా వేసే ఒక బృహత్తర ప్రయత్నాన్ని దార్ల చేశారు. దళిత ఉద్యమాలకు, రాజకీయాలకు, సాహిత్యానికి జన-జీవాలొసిగిన సిద్ధాంత-త్రయం : జ్యోతిబా పూలే, బాబా సాహెబ్ అంబేద్కర్, గుర్రం జాషువా - సిద్ధాంతాలపైన; దళితుల

సమగ్రాభివృద్ధికి స్వతంత్ర భారతం చేపట్టిన వివిధ విధానాలు, పథకాలు–ముఖ్యంగా రిజర్వేషన్ వసతుల పైన; ఖైర్లాంజీలో దళిత స్త్రీలను వివస్త్రలను చేసి తన సిగ్గు తీసుకున్న యావత్తు భారతావని – ఆ దారుణ సంఘటన ముందుకు తెచ్చిన సామాజిక, ఆర్థిక ప్రశ్నలపైన; ఇంకా దళిత సాహిత్యంపైన ఆ పత్రిక భాష్యాలను, ముందుకు తెచ్చిన వాద–వివాదాలను, దృక్పథాలను సమగ్రంగా, విమర్శనాత్మకంగా పరిశీలించారు. గమనించాల్సిందేమిటంటే ప్రజాసాహితి వర్గ దృక్పథాన్ని విమర్శించడం ఒక పనిగా పెట్టుకుని ఆ పని చెయ్యలేదు. వర్గ దృక్పథాన్ని భారతీయ కుల సమాజానికి వర్తింపజేయడంలో గల పరిమితులను ఎత్తి చూపి ఆ పరిమితులను అంబేద్కర్ సిద్ధాంతాలతో ఏ విధంగా అధిగమించవచ్చోనని నిర్మాణాత్మకంగా సూచించడం అతనిలోని విషయ స్పష్టత, మేధో పరిణత, సదుద్దేశాన్ని తెలియజేస్తాయి. ఈ వ్యాసంలో దార్ల అడిగిన ప్రశ్నలు తన కాలంలోని సోషలిస్టులకు అంబేద్కర్ వేసిన ప్రశ్నలు, కారంచేడు–చుండూరు దురాగత సంఘటనల తరువాత వామపక్షాలకు, నక్సలైట్లకు కత్తి పద్మారావు, బొజ్జా తారకం, ఉ. సాంబశివరావు, మారోజు వీరన్నలు వేసిన ప్రశ్నలు. 1980వ దశకం నుండి అటు అంబేద్కర్ వర్గీయులలో ఇటు మార్క్స్ వర్గీయులలో నలుగుతున్న 'అంబేద్కర్ కుల దృక్పథాన్ని కార్ల్ మార్క్స్ వర్గ దృక్పథాన్ని జతచేసి నూతన ప్రజాస్వామ్య విప్లవాన్ని సాధించాలి' అనే వాదాన్ని మరింత ముందుకు తీసుకు వెళ్లాలనే ఆకాంక్షను, అవసరాన్ని ఈ వ్యాసం ద్వారా దార్ల స్పష్టం చేశారు. ఈ పరిశీలనను నాలుగు ముఖ్యాంశాలుగా విశ్లేషించవచ్చు.

ఒకటి, జ్యోతిబా ఫూలే, అంబేద్కర్, జాషువాలపై ప్రత్యేక సంచికలను ప్రజాసాహితి ప్రచురించడాన్ని ఆ పత్రిక ఆ దళిత సిద్ధాంతకర్తలను గుర్తించడంగా పేర్కొని అట్టి గుర్తింపును దార్ల ఆహ్వానిస్తారు. అయితే సిద్ధాంతకర్తలను గుర్తించినంత మాత్రాన వారి సిద్ధాంతాలను కూడా గుర్తించినట్లేనా? – అనే ఒక బలమైన ప్రశ్నను అతను ఈ వ్యాసంలో అడుగుతాడు. వామపక్ష ఉద్యమం ఉనికిలోకి వచ్చిన నాటి నుండి నేటి వరకు వర్గ దృక్పథానికి కట్టుబడిన దళితేతరులు అంబేద్కర్ విషయంలో వాదించే వాదాలలో 'అంబేద్కర్ సంస్కరణవాది. కాబట్టి అతని దృక్కోణంగాని, అతని సిద్ధాంతాలు గాని వర్గ పోరాటాలకు, సోషలిస్టు సమాజ స్థాపనకు ఏ మాత్రం పనికిరావు' – అనే ఒక గుడ్డి వాదం ప్రధానమైనది. అంబేద్కర్ సంస్కరణవాదే కావచ్చు. అయితే అతని సంస్కరణవాదాన్ని ముందుకు తెచ్చి, భారతదేశంలో నూతన సామాజిక విప్లవానికి మూల స్తంభాలవంటి అతని సిద్ధాంతాలను వెనుకకు తొయ్యడం ప్రజా సాహితి వాళ్లు కావాలని పక్కదారి పట్టించిన అంశమని దార్ల స్పష్టం చేస్తారు.

అదే విధంగా దళిత కులాలలో పుట్టిన మనుష్యులు ఏ రంగంలో నైనా అసమానమైన ప్రతిభ కనబరచినప్పటికీ, వారు తమ పురిటి (కుల) కంపునుండి విముక్తం కాలేరని దళిత కులాలలో పుట్టిన మనుష్యులను ఎసెన్షియలైజ్ చేసే ఒక మోసపూరితమైన వాదాన్ని బ్రాహ్మణత్వం మొదటినుండి ముందుకు నెడుతోంది. దళితులను అలా ఎసెన్షియలైజ్ చేయడంలోనే బ్రాహ్మణత్వ మనుగడ ఆధారపడి ఉంది. కాబట్టి బ్రాహ్మణత్వంపై ఆధారపడి బతుకుతున్న వారు అటువంటి అభిప్రాయాలను పదే పదే ముందుకు తేవడాన్ని మనం అర్థం చేసుకోగలం. కాని 'సంపూర్ణ మానవుని ఆవిష్కరణే తన చిరకాల వాంఛ, జీవిత ధ్యేయమని' సగర్వంగా చెప్పుకున్న నిత్య సత్యాన్వేషి మార్క్స్, అటువంటి వ్యక్తి శిష్యులమని చెప్పుకునే వర్గ వాదీయులు కూడా దళితులను, దళిత మేధావులను అదే బ్రాహ్మణికల్ ఎసెన్షియలైజ్డ్ దృష్టితో చూడటాన్ని దార్ల తీవ్రంగా ఆక్షేపిస్తారు. ఉదాహరణకు రాజ్యాంగ పరిషత్తులో రాజ్యాంగ శాస్త్రంలో దిగ్గజాలు వంటి ఎందరో మేధావులు ఉన్నప్పటికీ అంబేద్కర్నే రాజ్యాంగ రచనా కమిటీ అధ్యక్షునిగా ఎన్నుకోవడానికి గల రెండు ముఖ్య కారణాలు – ఆ పరిషత్తులోని మేధావులను మించిన రాజ్యాంగ నిపుణత, జాతీయ సమగ్రత. అయినప్పటికీ 'ఆయన (అంబేద్కర్) చేసిన పోరాటాలు, పడిన రాజీలు–కుల నిర్మూలనకు ఏదో రూపంలో తోడ్పడతాయన్న అవగాహనతోను, ఆవేదనతోను అమలు జరిపారు' అని ప్రజాసాహితి (1995, 162వ సంచిక) తన సంపాదకీయంలో పేర్కొని అంబేద్కర్ కృషిని, త్యాగాలను కేవలం కులనిర్మూలనకు మాత్రమే కుదించడాన్ని దార్ల అంగీకరించ కూడని విషయం అంటారు.

అంబేద్కర్ కృషిని కేవలం ఇలా కులనిర్మూలనకే కుదించడం వలన రెండు ప్రమాదాలు ఉన్నాయి. మొదటిది, దళితులు కులాతీతంగా ప్రజా శ్రేయస్సును, ప్రజాభివృద్ధిని, జాతి సమగ్రతను దృష్టిలో ఉంచుకుని చేసే జాతి సేవా కార్యకలాపాలు దళితేతర సమాజం గుర్తించేందుకు అవకాశం లేకుండా చేయడం. రెండు, దళితుల సేవా కార్యకలాపాల వలన కులాతీతంగా, మతాతీతంగా జాతి మొత్తం ప్రయోజనాలు పొందినప్పటికీ, అవి కేవలం దళిత దృక్పథం నుండి, వారి విముక్తి నిమిత్తం మాత్రమే చేశారు, చేస్తున్నారు అని దళితేతరులు భావించడానికి అవకాశం. అంబేద్కర్ మొదలుకొని నేడున్న ఎందరో దళిత మేధావులను, నాయకులను దళితేతర సమాజం గుర్తించకపోవడం అటుంచీ, ఏహ్యభావం కలిగి ఉండడానికి ఈ రకమైన ఆలోచనలు, వాదాలు పరివ్యాప్తిలో ఉండడమే కారణం.

మహాకవి గుర్రం జాషువా విషయంలో కూడా ప్రజా సాహితిది ఎసెన్షియలైజ్డ్ దృక్కోణమేనని దార్ల నిర్మోహమాటంగా చెబుతారు. చోద్యంగా జాషువా కవిత్వానికంటే అతని కవిత్వాన్ని ఆదరించే దళితులపైన తన ఎసెన్షియలైజ్డ్ బాణాలను ఈ పత్రిక సంధించింది. జాషువా శతజయంతి సందర్భంగా వెలువరించిన ప్రత్యేక సంచికలోని (అక్టోబర్, 1995, 168వ సంచిక) సంపాదకీయాన్ని చదివిన వారెవరికైనా 'ఎలక్ట్రానిక్ మీడియా, నాటకాలను ఆదరించే సామాన్య ప్రజలను వీరి (జాషువా) పద్యాలు బాగా ఆకర్షించాయనీ, కుల దృక్పథం వల్లనే దళితులు జాషువాని వెనుకేసుకొస్తున్నారనే' ఆలోచన కలుగుతుందని ప్రజాసాహితీ వ్యాఖ్యానించడాన్ని దార్ల కుండబద్దలు కొట్టినట్లు ఆ వ్యాఖ్య సరైనది కాదని చెబుతారు. నిర్మోహమాటంగా చెప్పాలంటే భారతీయ సమాజంలో, హిందూ భావజాల ప్రభావంలో పుట్టి పెరిగిన ఏ వ్యక్తైనా కులాతీతులు కారు. కవులు, కళాకారులు, రచయితలు తమ తమ కులానికి చెందిన వారు కాబట్టి ఆ కవుల కవిత్వానికి, ఆ రచయితల రచనలకు ఉప్పొంగిపోయి అభిమానులుగా మారడం కుల సమాజంలో కనిపించే కుసంస్కృతి. విశ్వనాథ

సత్యనారాయణ, శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ) బ్రాహ్మణులు కాకుంటే, బ్రాహ్మణ సమాజం తమ తమ సిద్ధాంతాలకు, దృక్పథాలకు అతీతంగా వారికి బ్రహ్మరథం పట్టేదా? కమ్మ కులానికి చెందినవారు కాకపోతే సంఘటనతో తమకు సంబంధం లేకున్నా కారంచేడు చుట్టుపక్కల గ్రామాలలోని కమ్మలంతా ఏకమై కారంచేడు గ్రామంలోని మాదిగలపై మారణహోమం సృష్టించేవారా? చిరంజీవి కాపు కాకుంటే తన బొందిలో ప్రాణం ఉన్నంత వరకు కాంగ్రెసే తమ బంధువని బీరాలు పలికిన హరిరామ జోగయ్య, తదితరులు తమ బొందిలో ప్రాణముండగానే కాంగ్రెస్ పార్టీకి, లేదా ఇతర పార్టీలకు తిలోదకాలిచ్చి ప్రజారాజ్యం పార్టీ తీర్థం పుచ్చుకునేవారా?

దళిత కులాలలో అరుదుగా లభించే ఆణిముత్యం జాషువా లాంటి కవుల కవిత్వాన్ని దళితులు కూడా తమ సామాజిక వర్గానికి చెందిన వాడు కాబట్టి ఆస్వాదిస్తున్నారు. అంతవరకు దళిత సమాజానిది కూడ కుల దృక్పథమే. అయితే జాషువా కవిత్వానికి వస్తువు, వస్తు విషయాలు ఎవరివి? – దళితులు, వారి ఈతి బాధలు. మరి తమను, తమ సమస్యలను కవిత్వీకరించిన జాషువాను చదవటం కూడ కుల దృక్పథమేనా? శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, అడవి బాపిరాజు, ప్రేంచంద్, రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి లాంటి ఎందరో రచయితలు తమ సమాజానికి చెందినవారు కాకపోయినప్పటికీ తమ గురించి రాసిన వీరి రచనలను దళితులు అధ్యయనం చేశారు, ఆ రచయితలను ఆరాధించారు. మరి ఇది ఏ కుల దృక్పథం కిందికి వస్తుందో ప్రజాసాహితి వారు సమాధానం చెప్పాలి. అసలు ఒక కవిని అతని అభిమానులు ఏ దృక్పథంతో అభిమానిస్తున్నారు? ఏ దృక్కోణంతో ఆదరిస్తున్నారు? ఇది ఆ కవుల చేతుల్లో కంటే వారి అభిమానుల రుచులపైనే ఆధారపడి ఉంటుంది. ప్రజాసాహితి వారు అసలు అడగవలసిన ప్రశ్నలు – జాషువా కవిత్వం కుల కంపుతో నిండి ఉందా? లేక అందులో కుల కంపుతో మూసుకుపోయిన హిందూ హృదయ కవాటాలను తెరచే ప్రయత్నం జరిగిందా? ఈ ప్రశ్నలకు వారు ధైర్యంగా, నిష్పక్షపాతంగా సమాధానం చెప్పగలిగితే ఏ రచయితది కులతత్వాభివృద్ధి దృక్పథమో, ఏ రచయితది కులనిర్మూలన దృక్పథమోననే సత్యం అప్పుడు వెలుగులోకి వస్తుంది. విశ్వనరుడు జాషువా గురించి రాచపాళెం చంద్రశేఖరరెడ్డి చెప్పిన మాటలను ఈ కింద పేర్కొనడం అసందర్భం కాదు.

'భావ కవులు ఊహలలో విహరిస్తున్న కాలంలో, సంప్రదాయ కవులు పురాణాలు తిరగరాస్తున్న కాలంలో, జాషువ జీవితంలోని కఠిన వాస్తవాలను కవితా బద్ధం చేసే ప్రయత్నం చేశారు. అందరూ మేనకోడలిమీద, పక్కింటి అమ్మాయిల మీద కవిత్వం రాస్తుంటే జాషువ 'అనాథ' మీద రాశాడు. అందరూ కృత్రిమ స్వప్నాలు కంటుంటే జాషువా 'స్వప్న కథ'లో మంచి మానవీయ విలువగల కలగన్నారు... 'విశ్వనరుడ నేను' అని చెప్పుకున్న జాషువ సమాజం వర్ణాలుగా, కులాలుగా విడిపోవడం చూడలేకపోయాడు. మన సంఘాల మధ్య సహజంగా ఉండవలసిన సోదరభావం కులం కారణంగా నశించిందని భావించారు. కులాలు కొందరిని అణచిపెట్టడానికి మాత్రమే కాదు అణచివేయబడ్డ వాళ్లలో సైతం అణచివేసే వాళ్లను సృష్టించడం చూశాడు. ఆ స్థితిని నిరసిస్తూ ప్రజలలో విశ్వ జనీన భావాలను రేకెత్తించాడు.'

రెండు, కారంచేడు, చుండూరు సంఘటనలకు వ్యతిరేకంగా ఆవిర్భవించిన దళిత ఉద్యమం, ఆ ఉద్యమ స్ఫూర్తితో దళిత సమాజం నుండి ఒక సాహితీకారుల పటాలం ఏర్పడటం ఒక వరుస క్రమంలో జరిగింది. పదునైన తమ కలాలతో చిక్కనైన దళిత సాహిత్యాన్ని వెల్లువలై పారించి, దళిత చైతన్య సస్యశ్యామలతకు బాటలు పరిచారు ఈ సాహితీకారులు. వీరికి బాసటగా దళితులు కాకున్నప్పటికీ దళితులపై జరుగుతున్న అమానుషాలకు, హత్యాకాండలకు ఖేదిల్లి, తమ కలాలను కత్తులుగా చేసుకుని కుల సమాజ రక్కసిపై విరుచుకుపడిన దళితేతర కులాల నుండి వచ్చిన మానవతామూర్తులు ఎంతోమంది ఉన్నారు. ఆరంభంలో ఈ దళితేతరుల దళిత విషయ రచనలను దళిత సాహితీకారులు కొంత కామ్రేడరీ దృక్పథంతో, కొంత మొహమాటానికి లోబడి స్వాగతించినప్పటికీ రాను రాను 'దళిత సమస్యలను దళితులే రాయాలనే' ఒక వింత–వితండ వాదనను ముందుకు తెచ్చారు. దళితులు తమ కుల సరిహద్దులు దాటి సాధారణ మనుష్యులుగా ఎదగలేరనే వాదనతో దళిత సమాజాన్ని ఎసెన్షియలైజ్ చెయ్యడం పైనుండి జరుగుతుంటే, దళిత జీవితానుభవం లేనివారు దళిత సమస్యలను చిత్రించలేరు అని వాదించడం కిందినుండి జరుగుతున్న ఎసెన్షియలైజేషన్. దళిత జీవన సంఘర్షణను చిత్రించడానికి అనుభవ జ్ఞానం ఉండటం మంచిదే. అయితే ఆ జ్ఞానం ఒక్కటే సరిపోదు. శాస్త్రీయంగా విషయాన్ని శోధించి, వివరంగా చెప్పగల జ్ఞానం అవసరం. ఈ రెండవ రకం జ్ఞానాన్ని వ్యక్తులు తాము పుట్టి పెరిగిన సమాజం నుండి కాకుండా (అంటే అనుభవం నుండిగాక) నిరంతర అధ్యయనం ద్వారా, అవగాహన ద్వారా పెంపొందించుకుంటారు. ఈ విషయాన్నే ప్రజాసాహితి తన పదవ మహాసభ పత్రంలో వ్యాఖ్యానించడాన్ని దార్ల స్వాగతిస్తారు. దళిత సమాజంలో పుట్టి పెరిగినప్పటికీ ఆ సమాజంలో పరివ్యాపితంలో ఉన్న కుత్సిత వాదనలను నిరసించి సత్యాన్ని సత్యంగా తెలుసుకోవాలి, స్వీకరించాలి అని ఘంటాపథంగా చెప్పగలిగే దళిత మేధావులు బహు అరుదు. ఆ అరుదైన మేధావులలో దార్ల ఒకడని ప్రజాసాహితి పత్రంలోని సత్యంతో అతను ఏకీభవించడం స్పష్టపరుస్తుంది.

మూడు, 'వ్యవస్థ పరిమితిని బహిర్గత పరచిన సుప్రీం తీర్పు' పేరుతో వెలువరించిన తమ సంపాదకీయంలో ప్రజాసాహితి (నవంబర్, 2006: 288వ సంచిక) వారు దళిత రిజర్వేషన్లపై ఒక మంచి విశ్లేషణ చేశారు. ఇందులో చట్టబద్ధ రిజర్వేషన్‌లు, వ్యవస్థీకృత రిజర్వేషన్‌లు అని రిజర్వేషన్‌లను రెండు రకాలుగా వర్గీకరించి, 'వంశ పారంపర్యంగా వస్తున్న ఆస్తులను, అధికార హోదాలను, ఆ వర్గం వాళ్లే మళ్లీ అధికారాన్ని చెలాయించడాన్ని గుర్తించకుండా, అణచివేతకు గురవుతున్న వర్గాలకు రిజర్వేషన్‌లు కల్పించినంత మాత్రాన (వారికి) ఉపశమనానికి మించిన ప్రయోజనం ఉండదని' ఒక ఆలోచనాత్మకమైన విశ్లేషణ గావించారు.

*(...ముగింపు వచ్చే సంచికలో)* వీ

ప్రపంచీకరణ నేపథ్యంలో విచ్ఛిన్నమైన దాసరుల జీవన స్థితిగతులను వివరిస్తున్నారు **తిరునగరి మనోహరస్వామి, తాళ్లపల్లి సదయ్య, ఎం. రాజేందర్ రెడ్డి**

# భూంపల్లి దాసరుల బతుకులు

**భా**రతదేశంలో 1991 అత్యంత ప్రాముఖ్యమైన సంవత్సరం. ఎందుకంటే దేశంలోని ప్రజల సాంఘిక, ఆర్థిక విలువలు సామాజిక, రాజకీయ సాంస్కృతిక విలువలు, ప్రజల జీవన సరళిలో పెనుమార్పులు అప్పటినుంచి ప్రారంభమయ్యాయి. దీనికి ముఖ్యకారణం ప్రపంచీకరణ.

1991లో మనదేశం ప్రభుత్వ పాత్ర తగ్గించి ప్రపంచీకరణ చట్రంలోని సరళీకరణ, ప్రైవేటీకరణ ద్వారాలు తెరవడం వలన ప్రపంచవ్యాప్తంగానూ దేశంలోనూ పెనుమార్పులు రావడం జరిగింది.

తరతరాలుగా తమ సంస్కృతిని కాపాడుకొంటూ వస్తున్న గిరిజనులు, షెడ్యూల్డ్ కులాలలోని కొన్ని జాతులు ప్రపంచీకరణ ఫలితంగా తమ సంస్కృతి, ఆచార వ్యవహారాలు విచ్ఛినం అయి, తమ కళలను భవిష్యత్ తరాలకు అందించకుండానే కనుమరుగవుతున్నాయి.

ప్రపంచవ్యాప్తంగా గిరిజన జాతులలో ఎన్నో కళలు, మానవీయ విలువలు దాగి ఉన్నాయి. అండమాన్ నికోబార్ దీవులలో ఉన్న తెగలలో వారి సంస్కృతి వలన కొన్ని ప్రకృతిసిద్ధమైన ఉపయోగాలున్నాయి. ప్రజల ప్రాణాలను కాపాడే మానవతా విలువలు కలిగి ఉన్నాయి. అలాంటివారిలో ఆంధ్రప్రదేశ్‌లోని 'దాసరి' తెగకు చెందినవారు ఒకరు.

దాసరులు దక్షిణ భారతదేశంలో మహారాష్ట్రలో చాంద్ జిల్లా పరిసర ప్రాంతాలలో నివసిస్తూ ఉంటారు. వారిని పిడిదరి దాసరి అంటారు. వీరి భాషను దాసరి భాష అని పిలుస్తారు. ఈ భాషకు లిపి లేదు. వీరు మరాఠీలో మాట్లాడతారు. దాసరి తెగకు చెందినవారు మెదక్ జిల్లాలో మిడిదొడ్డి మండలం భూంపల్లి గ్రామంలో ఒకప్పుడు మూడు వందల కుటుంబాలు ఉండేవి. కానీ ఈ రోజు 70 కుటుంబాలు మాత్రమే ఉన్నాయి. దాసరులు షెడ్యూల్డ్ కులానికి సంబంధించిన చిందు తెగకు చెందిన ఉపతెగకు చెందినవారు. వీరు కుటుంబాలుగా ఒకే చోట గుంపుగా నివసిస్తారు. తరతరాలుగా తమ కళను నమ్ముకుని కళాకారులుగా జీవిస్తున్నారు. వీరు పౌరాణికాల ఆధారంగా నాటకాలను, కథలను ప్రదర్శిస్తుంటారు. అంతేకాకుండా జానపద కథలను ఇతివృత్తంగా చేసుకొని ప్రదర్శిస్తుంటారు.

దాసరి కుటుంబ పెద్దను పెద్దమనిషి అంటారు. కుటుంబ బాధ్యతను అతడే చూసుకుంటాడు. పిల్లల పోషణలో ముఖ్యంగా తల్లి కీలకమైన పాత్ర వహిస్తుంది. కుటుంబంతో పాటు పెంపుడు జంతువులు కూడా ఉంటాయి. ముఖ్యంగా మేకలు, కోళ్లు, కుక్కలు, బాతులను పెంచుతారు. దాసరి కుటుంబంలోని పిల్లలు పెంపుడు జంతువులను అడవికి తీసుకుపోయి పోషిస్తుంటారు. వీరు నిరక్షరాస్యులు. కానీ, మౌఖికంగా పదాలను వల్లిస్తారు. కుటుంబంలోని వృద్ధులు ఎక్కువగా బుట్టలు, తట్టలు అల్లుతూ, చిన్న పిల్లలను ఆడిస్తూ కుటుంబానికి చేదోడు వాదోడుగా ఉంటారు.

వీరు పెంపుడు జంతువులను, గుడిసెలను తమ ఆస్తిగా భావిస్తారు. వీరికి ఎక్కువ స్థిర-చర ఆస్తులు ఉండవు. ముఖ్యంగా తమ కళను ప్రదర్శించడం ద్వారా వచ్చిన కొద్దిపాటి డబ్బులు, ధాన్యంతో తమ జీవితాన్ని కొనసాగిస్తుంటారు. వివాహం వారి తెగకు సంబంధించిన వారిని మాత్రమే చేసుకుంటారు. ఒకవేళ ఎవరైనా దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తే తెగనుండి వెలివేస్తారు. లేదా గూడెం పెద్దమనిషి కఠినమైన శిక్షలు విధిస్తాడు. దానికి అందరూ కట్టుబడి ఉండాలి. దాసరులలో బాల్య వివాహాలు ఎక్కువగా జరుగుతాయి. ఆడపిల్లలకు పద్నాలుగు సంవత్సరాలకే వివాహం చేస్తారు. పురుషునికి 15-20 మధ్య వివాహం చేస్తారు. వీరు కట్నకానుకల కింద కొద్దిపాటి బంగారు, వెండి ఆభరణాలు ఇచ్చుకుంటారు. అంతేగాకుండా పెంపుడు జంతువులైన మేకలు, కోళ్లు, బాతులు, గొర్రెలను కూడా ఇస్తారు. వివాహం జరిపించడానికి తెగకు చెందిన ప్రత్యేక పూజారి ఉంటాడు.

దాసరులు తమ కళాసంపద ద్వారా ప్రజలకు వినోదాన్ని విలువల్ని పెంపొందించడంలో తోడ్పడతారు. పౌరాణిక రాజకీయ మత సమైక్యతలకు సంబంధించిన ఇతివృత్తాలను తీసుకొని ప్రదర్శించడం ద్వారా ప్రజలకు సామరస్య భావనను చాటుతారు. దాసరులు ప్రదర్శనలో రాముడు, సత్యహరిశ్చంద్రుడు, సీత, అరుంధతి, అహల్య, ద్రౌపది మొదలైన పాత్రలు ప్రదర్శించి ప్రజలకు నైతిక విలువలను తెలియజేస్తారు.

దాసరుల కళాప్రదర్శనలు మతసామరస్యాన్ని పెంపొందించడానికి తోడ్పడతాయి. పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర ద్వారా మతసామరస్యానికి చెందిన పాత్రలు ప్రదర్శిస్తుంటారు. వీరి ప్రదర్శనల ద్వారా ప్రజలు ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించడానికి తోడ్పడతాయి. ప్రజలు వీరికి ధాన్యం, నగదు, బట్టలు, ఇతర పప్పుదినుసులు దానంగా ఇస్తారు. ప్రపంచీకరణ తరువాత ఉమ్మడి కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నం కావడం వలన కొత్తగా వచ్చిన సాంకేతిక విప్లవం వలన దాసరుల బతుకులు చిందరవందర అయినాయి. వారు తరతరాలుగా నమ్ముకొని వస్తున్న కళకు ఆదరణ తగ్గిపోవడం, తమ విద్య నేర్చుకోకపోవడం వలన వారి జీవితం పతన స్థితికి చేరుకుంది.

ప్రపంచీకరణ తరువాత భూంపల్లి దాసరుల బతుకులు కూడా ఆర్థికంగా, సామాజికంగా విచ్ఛిన్నం అయి వారి సంస్కృతి కనుమరుగవు

చరిత్ర, దాని పూర్వాపరాలు అర్థం చేసుకోవాలంటే వివిధ ప్రాంతాలలో యుగాల వారీగా జరిగిన భౌగోళిక, వాతావరణ మార్పులలో వ్యత్యాసాలు తెలుసుకోవాలంటున్నారు **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# హిమయుగాలు, చరిత్ర

మానవజాతి చరిత్ర ఎప్పుడు మొదలయిందో కచ్చితంగా చెప్పడం కష్టమే. ఎందుకంటే అది ఆదిమానవుల ఆవిర్భావం మీదా, ఇంకా చెప్పాలంటే అంతకుముందు జరిగిన ప్రాణుల, క్షీరదాల జీవపరిణామం మీదా ఆధారపడే విషయం. మరొకటేమిటంటే ఈ చరిత్ర, లేదా దానికి పూర్వరంగం ఎక్కడెక్కడ, ఎప్పుడు, ఎలా మొదలయిందో అర్థం చేసుకోవాలంటే వివిధ ప్రాంతాల్లో యుగాలవారీగా జరిగిన భౌగోళిక మార్పులూ, వాతావరణపు వ్యత్యాసాలూ అన్నీ లెక్కలోకి తీసుకోవాలి. వీటిని అధ్యయనం చేస్తే చరిత్రకు పునాదులు ఎలా ఏర్పడ్డాయో తెలుస్తుంది. అందువల్ల ఒక్కొక్కప్పుడు చరిత్ర కూడా విజ్ఞాన శాస్త్రం లాగే తయారవుతుంది.

భౌతిక పరిణామాలే జీవపరిణామాలకు ప్రేరణ. వీటిలో స్థానికంగా ప్రకృతి వైపరీత్యాలని కలిగించిన అగ్నిపర్వతాల పేలుళ్లూ, భూకంపాలూ, వరదలేకాక, ఆకస్మికంగా భూమిమీదికి వచ్చిపడిన ఉల్కలూ, పరోక్ష కారణాలవల్ల అనేకమార్లు విచ్చేసిన హిమయుగాలూ మొదలైనవన్నీ మొత్తం జీవరాశిమీద తీవ్రమైన ప్రభావాలని కలిగించాయి. రోదసిలో గురు, అంగారక గ్రహ కక్ష్యల మధ్య తిరిగే గ్రహశకలాలు కొన్ని భూమ్యాకర్షణకు లోనై భూమిమీదికి వచ్చిపడుతూ ఉంటాయి. ఇవన్నీ సామాన్యంగా గాలి ఒరిపిడికి కాలి నుసి అయిపోతాయిగాని కొన్ని మరీ పెద్దవైతే భూమిని తాకి పెద్ద ఉత్పాతాన్ని సృష్టిస్తాయి. ఆరున్నర కోట్ల సంవత్సరాల క్రితం వచ్చిపడిన ఒక బ్రహ్మాండమైన శిల డైనొసార్లు అంతరించిపోవడానికి కారణమైందని శాస్త్రవేత్తల అంచనా. అంతకన్నా పెద్దదొకటి 25 కోట్ల సంవత్సరాల క్రితం మరింత వినాశనాన్ని కలిగించినట్టుగా తెలుస్తోంది. వీటి కారణంగా వివిధ జీవాల మధ్య జరుగుతున్న పోటీల్లో ఆకస్మిక మార్పులు జరిగి జీవపరిణామపు దిశ మారుతూ వచ్చింది.

ఇంత అకస్మాత్తుగా కాకుండా భూమి సగటు ఉష్ణోగ్రత తగ్గుతూపోయే పరిస్థితులను కలిగించేవి హిమయుగాలు. వాటివల్ల భూమి ఉపరితలం 10 నుంచి 30 శాతం దాకా మంచుతో కప్పబడిపోతుంది. 450 కోట్ల సంవత్సరాల క్రితం భూమి ఆవిర్భవించాక దాని మొత్తం చరిత్రలో 15 నుంచి 20 శాతం హిమయుగాలుగానే గడిచింది. వీటిలో కొన్ని హిమయుగాలు కోట్ల సంవత్సరాలూ, మరికొన్ని ఎన్నో వేల సంవత్సరాల తరబడి కొనసాగాయి. గతంలో 80-60, 46-43, 35-25 కోట్ల సంవత్సరాల కిందట ఇవి కనీసం నాలుగుసార్లు వచ్చాయి. (పటం). ఒక్కొక్కసారి వచ్చినప్పుడల్లా వీటిల్లో కాస్త హెచ్చుతగ్గులు కలుగుతూ ఉండేవి కాని మొత్తంమీద శీతలస్థితే ఎక్కువ. మంచు హిమానీనదాల రూపంలో (గ్లేసియర్స్) ధ్రువాలనుంచి ఇతర ప్రాంతాలకు చొచ్చుకువస్తూ ఉండేవి. హిమయుగాల్లో ఈ హిమానీనదాలు భౌగోళికంగా పెద్ద మార్పులు కలిగించేవి. ఇవి




తోంది. వారి కళ అడుగంటుతోంది. గత పదిహేనేళ్లలో 300 కుటుంబాలకు గాను 230 కుటుంబాలు వలసపోయాయి. ఇప్పుడు కేవలం 70 కుటుంబాలు మాత్రమే స్థిరంగా ఉన్నాయి. ఈ కుటుంబాల జనాభా 475. ఇందులో 12 కుటుంబాలు కోడిగుడ్లు అమ్మి తమ జీవనం సాగిస్తున్నాయి. 22 కుటుంబాలు పూసలు, 18 కుటుంబాలు బుగ్గలు, 9 కుటుంబాలు పాత ఇనుప సామానులు అమ్ముకుంటూ జీవితం గడుపుతున్నాయి. 4 కుటుంబాలు క్షవరాలు చేసుకుంటూ, 2 కుటుంబాలు బిక్షాటన చేస్తూ, 3 కుటుంబాలు ఇతరపనులు చేస్తూ జీవిస్తున్నాయి. వీరి ఆర్థికపరిస్థితి దినదినం దిగజారి పోతోంది.

దాసరి కళను రక్షించుకోవడానికి యుద్ధ ప్రాతిపదికన పరిశోధనలు జరగాలి. కళాకారులకు జీవన భృతితోపాటు వారిని ప్రభుత్వ పథకాలను ప్రచారం చేయడానికి నియమించాలి. భవిష్యత్‌తరాల వారికి ఈ కళ అంతరించిపోకుండా డాక్యుమెంటరీలు రూపొందించాలి. వారి సాహిత్యాన్ని ఆడియో, వీడియోలలో భద్రపరిచి ముందుతరాల వారికి అందుబాటులో ఉంచాలి. దాసరుల పిల్లలను అక్షరాస్యులుగాచేసి వారి సంస్కృతిని రక్షించుకునేటట్లు వారి కళలలో నైపుణ్యం సాధించేటట్లు వారి తెగ వారితో ప్రత్యేక శిక్షణను ఇప్పించాలి. వీరికి ఇళ్ల స్థలాలను ప్రభుత్వ పథకాల ద్వారా అవకాశాలను కల్పించాలి.




మానవుల ప్రస్థానం

మానవుల పరిణామాన్ని ప్రత్యక్షంగా తీర్చిదిద్దాయి కనక వీటి వివరాలు ఆసక్తికరంగా అనిపిస్తాయి.

హిమయుగాలు ఎందుకు, ఎలా వస్తాయో శాస్త్రవేత్తలు వివరించగలరు. పైకి నిశ్చలంగా అనిపించినప్పటికీ భూఖండాలు వాటి కిందనున్న ఫలకాలలో కలిగే ప్రక్రియల కారణంగా (ప్లేట్ టెక్టానిక్స్) కదులుతూ ఉంటాయి. ధ్రువాలకు సమీపంలో పొడినేల వైశాల్యం కనక పెరిగితే మంచు పేరుకోవడం సముద్రజలాల మీద కన్నా సులువుగా జరుగుతుంది. 35-25 కోట్ల సంవత్సరాల క్రితం దక్షిణ అమెరికా, ఆఫ్రికా, ఇండియా, అరేబియా ద్వీపకల్పాలూ, ఆస్ట్రేలియా, అంటార్కిటికా అన్నీ కలిసి పేంజియా అనే బ్రహ్మాండమైన భూఖండం రూపంలో దక్షిణ ధ్రువాన ఉండేవి. దాని ఫలితమే అప్పటి హిమయుగం. అలాగే భూగర్భంలోని ఫలకాల కదలికవల్ల కొంత భూభాగం (నేటి హిమాలయ పర్వతాల లాగా) పైకి లేస్తుంది. దీనివల్ల సముద్రజలాల కదలికా, వాతావరణ ప్రక్రియ లన్నిటిలోనూ మార్పులు కలుగుతాయి. వాతావరణంలో కార్బన్ డయాక్సయిడ్ మోతాదు తగ్గినా ఉష్ణోగ్రత తగ్గిపోతుంది. నేటి గ్రీన్‌హౌజ్ ప్రభావానికిది వ్యతిరేకమైనది. సూర్యుడి చుట్టూ భూమి తిరిగే కక్ష్యలో కలిగే కొన్ని దీర్ఘకాలిక మార్పులు కూడా హిమయుగాలకు కారణం కావచ్చు.

హిమయుగాల్లో మంచు పేరుకుని హిమానీనదాలు విస్తరించకముందే లక్షల, కోట్ల సంవత్సరాల తరబడి సగటు ఉష్ణోగ్రత తగ్గనారంభిస్తుంది. తెల్లని మంచు పేరుకుంటున్న కొద్దీ సూర్యకాంతి అంతా ప్రతిఫలించడం వల్ల భూమి తగినంతగా వేడెక్కదు. రానురాను పెరుగుతున్న చలి జీవరాశిని అనేకరకాలుగా ప్రభావితం చేస్తుంది. వీటికి మనుషులు కూడా గురికాక తప్పలేదు. మనుగడే సమస్య అయిన మానవుల చరిత్ర యావత్తూ ఒకరకంగా చెప్పాలంటే 'పొట్ట తిప్పలే'. వేటమీదా, ఆహార సేకరణమీదా ఆధారపడిన తొలిమానవులు మొక్కలనూ, జంతువులనూ వెతుక్కుంటూ దేశదేశాలూ తిరిగారు. ఎప్పటికప్పుడు మారుతూ ఉండే భౌగోళిక, వాతావరణ పరిస్థితులను బట్టి ఒక్కొక్కచోట ఒక్కొక్క సమయంలో వారికి ఆహారం లభిస్తూ ఉండేది. వ్యవసాయం, స్థిరనివాసాలూ మొదలవక ముందే మానవులు అనేక ప్రాంతాలకు తరలి వెళ్లారు. ఇదంతా కనీసం రెండు విడతలుగా జరిగింది. దాదాపు 17 లక్షల ఏళ్ల క్రితం మనకు పూర్వికులైన హోమో ఎరెక్టస్ జాతివారూ, ఆ తరువాత సుమారు లక్షా పాతికవేల సంవత్సరాల క్రితం ఆధునిక మానవులూ ఆఫ్రికా నుండి వివిధ ప్రాంతాలకు విస్తరించారు. పటంలో హోమో ఎరెక్టస్ జాతి తిరిగిన ప్రాంతాలు బూడిద రంగులోనూ, తరవాతి హోమోసేపియెన్స్ మానవులు చేసిన ప్రయాణాలు చుక్కలతోనూ సూచించబడ్డాయి.

ఇందులో గమనించవలసిన విషయం ఒకటేమిటంటే హిమయుగాల్లో చివరిది 16 లక్షల ఏళ్ల క్రితం మొదలై 10 వేల ఏళ్ల క్రితం అంతమైంది. ఇది సరిగ్గా మానవుల పరిణామకాలానికి సరిపోతుంది. హిమయుగాలు వచ్చినప్పుడల్లా దాటరాని కొన్ని జలసంధులూ, జలాశయాలూ గడ్డకట్టుకు పోవడంతో వాటిపై నడిచి వెళ్లడం వీలయేది. మంచు ఎక్కువగా ధ్రువాల్లో పేరుకుపోవడంతో సముద్ర మట్టాలన్నీ తగ్గిపోతూ ఉండేవి. ప్రస్తుతం పడవలు లేకుండా దాటరానివిగా అనిపిస్తున్న కొన్ని ప్రాంతాలు అప్పట్లో లోయలలాగా అనిపించేవి. అందుచేత వానరాలకు భిన్నంగా రెండుకాళ్ల నడక మొదలుపెట్టిన తొలి మానవులు ఎంత దూరమైనా కాలినడకన వెళ్లగలిగారు. ఆహార సేకరణకై అది మానవుల బృందాలు సగటున ఎనిమిది సంవత్సరాల కొక మైలు దూరానికి కదులుతూ క్రమంగా భూ ఖండాలన్నిటినీ ఆక్రమించారు. పటంలో చూపినట్టుగా అప్పట్లో తూర్పు ఆఫ్రికానుంచి పశ్చిమాసియాకూ, అరేబియా నుంచి మన దేశానికి కాలినడకన వెళ్లడం వీలయేది. మహా అయితే కొన్ని రుతువుల్లో చిన్న చిన్న తెప్పలు అవసరమయేవేమో. అలాగే నేటి ఇండో చైనా ద్వీపకల్పం, ఇండోనేషియా ప్రాంతాలూ అన్నీ ఒకటిగా ఉండేవి. తూర్పుకేసి నడిచిన తొలి మానవులు న్యూగినీ, ఆస్ట్రేలియా మొదలైన ప్రదేశాలన్నిటినీ సులువుగా చేరుకోగలిగారు. హిమయుగం అంతమై సముద్రజలాల మట్టం పెరిగిన తరవాత ప్రస్తుతపు తీరరేఖలన్నీ రూపుదిద్దుకున్నాయి. అప్పటికే వివిధ ప్రదేశాలకు చేరుకున్న ప్రజలు నౌకాయానాలూ, ఇతర రవాణా సౌకర్యాలూ కనిపెట్టిన దాకా ఎక్కడికక్కడే బందీలలాగా మిగిలిపోయారు. ఎటువంటి సంపర్కమూ లేకుండా వేల ఏళ్లపాటు దిగబడిపోవడంతో ఎక్కడెక్కడ ఎవరెవరు ఉన్నారో, ఇతర ప్రాంతాల్లో స్థానిక పరిణామాలు ఎలా జరిగాయో తెలుసుకోవడానికి ప్రజలకు ఎన్నో వేల సంవత్సరాలు పట్టింది. ■

*సామాజిక మార్పులను అర్థం చేసుకోవడంలో మార్క్సిస్టు చారిత్రక భౌతికవాద దృక్పథం ఎలా మార్గదర్శకంగా ఉంటుందో వివరిస్తున్నారు* **కృష్ణా భరద్వాజ్**

# సామాజిక మార్పును విశ్లేషించడం ఎలా?

*(...గత సంచిక తరువాయి)*

## మార్పును నిర్దేశించే శక్తులు – 'బహుళ కారణాల' వివరణ

మార్పు అనేదే ఒక పరిస్థితి సారాంశం అయినట్టయితే, మార్పులనేవి పూర్తిగా యాదృచ్ఛికం కానట్టయితే, సమాజ చలనాలను ప్రేరేపించే శక్తులు ఏమిటీ? ఇప్పటిదాకా సాగిన చర్చలో మనం ఆచరణ ద్వారా జ్ఞానసముపార్జన గురించి, ఆ జ్ఞానాన్ని సిద్ధాంతాలుగా సాధారణీకరించడం గురించి మాట్లాడుకున్నపుడు అటువంటి శక్తుల గురించి పరోక్షంగా ప్రస్తావించుకున్నాం. మన చర్చకు పునాదిగా ఉన్న సామాజిక చరిత్ర గురించిన గతి తార్కిక భౌతికవాద దృక్పథం ప్రకారం సమాజం గురించి ఏ ఒక్క క్షణపు వర్ణన – అంటే, దాని 'స్థిరత్వం' గురించి వర్ణన – అయినా అదే సమయంలో అది మారడానికి అవకాశం ఇచ్చే పునాదిని కూడా వివరిస్తుంది. ఎందుకంటే, వర్తమానం అనేది గత చరిత్ర నుంచి మాత్రమే పుట్టుకువస్తుంది. అలాగే ఆ వర్తమానం అనేదే భవిష్యత్తు పరిణామాల బీజాలను కలిగి ఉంటుంది. ఇక్కడ ఈ అభిప్రాయాన్ని మనం మరింత వివరంగా పరిశీలిద్దాం.

ప్రపంచాన్ని భావాలే పరిపాలిస్తాయని భావవాదులు నమ్ముతారు. ఒక ప్రత్యేక యుగంలో భౌతిక, సామాజిక పరిస్థితులను ప్రభావితం చేసే ఒక్కొక్క భావం ఉంటుందని వాళ్లు అనుకుంటారు. చాలామంది అంగీకరించే దృక్పథం ఏమంటే మార్పుకు ఏదో ఒక్క కారణభూతమైన శక్తి ఉండకపోవచ్చు. భౌగోళికమైన, జాతిపరమైన, భావజాలపరమైన, మతపరమైన, నైతికమైన కారణాలతో సహా ఒక నెపోలియన్, ఒక హిట్లర్, ఒక గాంధీ, ఒక నెహ్రూ వంటి చారిత్రక వ్యక్తుల ఆవిర్భావం వంటివి యాదృచ్ఛికమని అనిపించే ఘటనలు కూడా కలిసి బహుకారణాలు మార్పుకు దారితీస్తాయని వాళ్లంటారు. నిజమే, భౌగోళికమైన, పర్యావరణపరమైన కారణాలు ఆర్థిక వ్యవస్థల అభివృద్ధిని ప్రభావితం చేసాయి. అయితే, ఈ కారణాలు ఎంత వరకు, ఏ పద్ధతిలో మానవ కార్యాచరణను నిబద్ధం చేసాయనే అంశం, ఆ కాలపు ఉత్పత్తి శక్తుల అభివృద్ధి మీద ఆధారపడి ఉంటుంది. తొలిసమాజాలలో ప్రకృతి మీద మనిషి అదుపు చాలా పరిమితంగా ఉన్నప్పుడు స్థిరవ్యవసాయమే మనుషుల మనుగడకు వనరయినప్పుడు నదీ తీరాలలోనూ, సారవంతమైన మైదానాలలోనూ ఉన్న జనసమూహాలు మాత్రమే అభివృద్ధి చెందాయి. అవే ఆనాటి నాగరికతా కేంద్రాలయ్యాయి. అయితే ఒకసారి సహజ జలమార్గాల మీద మాత్రమే ఆధారపడి సాగే రవాణా పద్ధతులను అధిగమించిన తరువాత ఈ సహజ అవకాశాల పాత్ర తగ్గిపోయింది. అలాగే కొన్ని మానవ సమూహాలు మాత్రమే నావికా కార్యకలాపాలలో సాపేక్షికంగా అభివృద్ధి చెందాయనేది స్పష్టంగానే వాళ్లు సముద్ర జలాలమీద ప్రయాణించగల నౌకలనూ, సాధనాలనూ తయారు చేయడంలో ఎంత సాంకేతికాభివృద్ధి సాధించారనే దానితో సంబంధంలో ఉంది. కొన్ని దేశాలు సహజమైన వనరుల లభ్యత వల్ల సాపేక్షిక ఆర్థికాభివృద్ధిని సాధించగలిగాయని చెప్పే 'వనరుల లభ్యత' సిద్ధాంతాలు కూడా ప్రపంచ వాణిజ్య విస్తరణ తరువాత తమ ప్రాబల్యం కోల్పోయాయి. మానవ కార్యాచరణను పర్యావరణ శక్తులు పెద్ద ఎత్తున పరిమితం చేస్తాయని, అవకాశాలు కల్పిస్తాయని అనడంలో సందేహం లేదు. కాని, మనిషికీ ప్రకృతికీ ఉన్న ఈ సంబంధంలో మనిషి ఎల్లప్పుడూ క్రియాశీల వ్యక్తిగా ఉండి ఎప్పటికప్పుడు తన ప్రయోజనం కొరకు ప్రకృతిని మార్చడానికి ప్రయత్నించాడు. గణనీయంగా విజయం సాధించాడు. ఇలా మారిన సంబంధం మళ్లీ మనిషి జీవన పద్ధతి మీద ప్రభావం వేసింది.

ఇక ఒక వివరణగా జాతి కారణాలని చూపెట్టడానికి ఎటువంటి పునాది లేదు. ఉదాహరణకు ఒకప్పుడు మానవ నాగరికతకు అగ్రగామిగా ఉండిన తూర్పు దేశాల ప్రజలు కాలక్రమంలో ఎందుకు వెనుకబడిపోయారో, అదే జాతికి చెందిన ప్రజలు పూర్తిగా భిన్నమైన ఆర్థిక పరిస్థితులలో ఎందుకు ఉన్నారో ఈ జాతి సిద్ధాంతం వివరించ జాలదు. ఏదేమైనా ప్రస్తుత కాలంలో ఈ జాతి సిద్ధాంతం వివరణను తీవ్రంగా పరిగణనలోకి తీసుకునే వారెవరూ లేరు. గతంలో దానికి గుర్తించదగిన ప్రాబల్యం ఉండేది. దాన్ని చాలామంది నమ్మేవారు. ఇవాళ్టికి కూడా అది లోలోపల ఉన్న దురభిప్రాయంగా, జాత్యాహం కారంగా కొనసాగుతూ ఉండవచ్చు. కొన్నిసార్లు బహిరంగంగానూ, కొన్నిసార్లు పరోక్షంగానూ బయటపడుతూ ఉండవచ్చు.

అభివృద్ధి స్థాయిలలో భిన్నత్వాలను కొన్నిసార్లు సముచిత రాజకీయ వ్యవస్థల ఏర్పాటుతో అనుబంధించి చూడడం జరుగుతుంది. రాజకీయ వ్యవస్థల గురించి ఇలా మాట్లాడేవాళ్లు, విభిన్న రూపాల ప్రభుత్వాల సాపేక్షిక గుణాలను తులనాత్మకంగా విశ్లేషిస్తుంటారు. ఉదాహరణకు ప్రజాస్వామ్యానికీ, నిరంకుశత్వానికీ మధ్య స్వేచ్ఛా వాణిజ్యానికీ, ప్రభుత్వ నియంత్రణకూ మధ్య ఉన్న తేడాలను బట్టి మాట్లాడుతుంటారు. ప్లేటో, అరిస్టాటిల్ వంటి రాజకీయ తత్వవేత్తలను ఆకర్షించిన అతి ప్రాచీన ఇతివృత్తం ఇది. అలాగే సామాజిక శాస్త్రవేత్తలు

మత, నైతిక వైఖరుల మీద కూడా శ్రద్ధ కేంద్రీకరిస్తారు. ఇంకా చెప్పాలంటే మాక్స్ వెబర్ పెట్టుబడిదారీ విధాన అభివృద్ధికి కారణంగా క్రైస్తవంలోని ప్రొటెస్టెంట్ ధోరణిని చూపాడు. అలాగే ఆసియా ప్రజానీకపు వెనుకబాటుతనానికి కారణం వారికి ఇహం కన్న పరం మీద ఉన్న శ్రద్ధాసక్తులు, లాభసాటి ఆర్జన మీద ఉన్న అశ్రద్ధ అని వివరించేవారు ఉన్నారు. ఆర్థికాభివృద్ధి మీద ఏ ప్రామాణిక పాఠ్యగ్రంథమైన తీసుకోండి. ఈ కారణాలు తోడుగా మరికొన్ని కారణాలు జోడిస్తారు. విద్య, ద్రవ్య పరపతి సంస్థలు, అన్ని రకాల సామాజిక వ్యయాలు వంటి సంస్థాగత కారణాలను, జనాభా కారణాలను వారు కలుపుతారు.

## పునాది – ఉపరితలం

ఇటువంటి వివరణలన్నీ ఒక మౌలికమైన ప్రశ్నను లేవనెత్తుతాయి. ఈ మత భావనలూ, రాజకీయ సంస్థలూ వగైరా కారణాలు సామాజిక కార్యాచరణలోని ఉత్పత్తి సంబంధాల నుంచి, భౌతిక పరిస్థితుల నుంచి ఎంతవరకు విడిగా, స్వతంత్రంగా పనిచేస్తాయి? ఇప్పటికి ఎన్నోసార్లు ఎంతోమంది ఉటంకించిన మార్క్స్ మాటల్లోనే ఆయన అభిప్రాయం చూద్దాం: 'నా పరిశోధనల వల్ల నేను చేరుకొన్న నిర్ధారణ ఏమంటే చట్టపరమైన సంబంధాలను గానీ, రాజకీయ రూపాలను గానీ వాటంతట వాటినే అర్థం చేసుకోవడం సాధ్యం కాదు. లేదా మానవ మేధ సాధించిన సాధారణ అభివృద్ధి అనబడే దాని పునాది మీద కూడా వాటిని అర్థం చేసుకోలేము. అందుకు భిన్నంగా అవి జీవితపు భౌతిక పరిస్థితులలోనే ఆవిర్భవిస్తాయి. ఆ భౌతిక జీవన పరిస్థితులనే హెగెల్ 18వ శతాబ్దపు ఇంగ్లిష్ ఫ్రెంచ్ తత్వవేత్తల పద్ధతిలో 'పౌరసమాజం' అని పిలిచాడు. అంటే ఈ పౌరసమాజపు అంతస్సారాన్ని గుర్తించడానికి రాజకీయార్థ శాస్త్రంలోకి చూడవలసిందే. తమ మనుగడ కోసం సాగించే సామాజిక ఉత్పత్తిలో మనుషులు అనివార్యంగానే నిర్దిష్ట సంబంధాలలో ప్రవేశిస్తారు. ఆ సంబంధాలు వారి సంకల్పానికి అతీతంగా ఉంటాయి. అవి ఆ నిర్దిష్ట దశలోని భౌతిక ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి తగిన ఉత్పత్తి సంబంధాలుగా ఉంటాయి. ఈ ఉత్పత్తి సంబంధాల సమాహారమే సమాజపు ఆర్థిక పునాదిగా ఉంటుంది. ఇదే నిజమైన పునాది. చట్టపరమైన రాజకీయ ఉపరినిర్మాణం అంతా దీనిపైననే లేచి నిలుస్తుంది. నిర్దిష్టమైన సామాజిక చైతన్య రూపాలు ఈ ఉపరినిర్మాణం తో సమన్వయంలో ఉంటాయి. అంటే, భౌతిక జీవన పరిస్థితుల ఉత్పత్తి విధానమే సామాజిక, రాజకీయ, మేధో జీవితపు సాధారణ క్రమాన్ని నిర్దేశిస్తుంది. అంటే, మనుషుల మనుగడను నిర్ణయించేది వారి చైతన్యం కాదు. వారి సామాజిక అస్తిత్వమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది.' బానిసల దోపిడీ మీద ఆధారపడిన అరిస్టాటిల్ నాటి సమాజం ఆనాటి సామాజిక అసమానత గురించి ఎటువంటి నైతిక సందేహానికి లోను కాలేదు. నిజానికి ఆనాటి సమాజంలో సామాజిక గౌరవంగానీ, హోదాగానీ ఒక వ్యక్తి ఎంత మంది బానిసలను కలిగి ఉన్నాడనీ, ఆ బానిసల భుజబలం ఎంత? అనే పునాది మీదనే ఉండేవి. సరిగ్గా అంతకు ముందరి పశుపోషక సమాజాలలో ఒక మనిషి హోదా ఎన్ని పశువులను కలిగి ఉన్నాడనే దాని మీద ఆధారపడి ఉన్నట్టుగానే. మన సమాజమే చూస్తే ఇవాళ కొనసాగుతున్న ఉత్పత్తి సంబంధాలలో కుల అసమానత ఆధిపత్య అగ్రవర్ణాల దోపిడీకి పునాది కల్పిస్తున్నంతవరకూ ఆ కుల అసమానతలను కేవలం రాజకీయ సంస్కరణ ద్వారా నిర్మూలించమనే విషయం స్పష్టమే. భూస్వామ్య యుగంలో దాతృత్వం, వీరత్వం, సాహసం, పోషణ, హోదా, విశ్వాసం వగైరా లక్షణాలను ఉత్తమ లక్షణాలుగా చూపి వాటికి సామాజిక ఆమోదాన్ని, గౌరవాన్ని కల్పించడం జరిగింది. ఇది దేనికి ప్రతిఫలమంటే ఆనాటి భూస్వామ్య సామాజిక సంబంధాలలో వ్యక్తిగత భూస్వామి – అతని దగ్గర కౌలు చేసే రైతు మధ్య సంబంధంలో ఒకే నాణానికి బొమ్మా బొరుసూ లాగ దోపిడీ, పోషణ ఉండేవి. మరొకపక్క భూస్వామ్య సమాజం నుంచి పెట్టుబడిదారీ సమాజానికి మారుతున్నప్పుడు వ్యక్తి స్వేచ్ఛ ఆకాంక్ష, సొంత ప్రయోజనం కొరకు నిరాటంకమైన ప్రయత్నాన్ని ప్రబోధించే ఉపయోగితవాద తాత్విక ధోరణులు, వ్యక్తి చొరవ మీద పూనిక స్వేచ్ఛా వాణిజ్య సిద్ధాంతం వంటి ఆలోచనలన్ని 18వ శతాబ్దపు ఫ్రాన్స్‌లో, ఇంగ్లండ్‌లో ప్రాధాన్యత వహించాయి. ఇవన్నీ అప్పుడు ఆరోహణ దశలో ఉన్న బూర్జువా వర్గపు ఆకాంక్షల ప్రతిధ్వనులే. పెట్టుబడిదారీ సొంత ఆస్తి విధానంలో ఉత్పత్తి మరింతగా సామాజికమైన పునాదిమీద సాధారణంగా వ్యాపించిన మారకపు ఆర్థికవ్యవస్థలో మాత్రమే ఈ ఆలోచనలు ప్రాబల్యం పొందగలిగాయి. అక్కడ మాత్రమే వ్యక్తులు స్వతంత్ర వ్యక్తులుగా, స్వేచ్ఛాయుతమైన నిర్ణయాలు తీసుకోగలిగిన వారుగా కనబడ్డారు. ఇటువంటి ఉదాహరణలు ఎన్నైనా ఇవ్వవచ్చు. మొత్తం మీద చెప్పగలిగిందేమంటే ఒక సమాజం తనంతట తానే చైతన్యంలో అభివృద్ధి చేసుకున్నట్టు కనబడే తాత్విక, నైతిక భావనలన్నీ మొత్తానికి మొత్తంగా ఆధిపత్య వర్గాల ప్రవర్తనను, లక్షణాలను సమర్థించడానికి, యథాతథ స్థితిని కొనసాగించడానికి తయారయ్యేవే.

అలాగే మతాల చరిత్రను పరిశీలిస్తే మనం గ్రహించగలిగేది ఏమంటే మనిషి దేవుణ్ని తన ప్రతిబింబంగా ఊహించాడు. తన ఆశలను, ఆకాంక్షలను, భయాలను, సందేహాలను ప్రతిఫలిస్తూ తాను ఎటువంటి భౌతిక, సామాజిక పరిస్థితులలో ఆ భావనలను పొందుతున్నాడో అవే దేవుడికి ఆపాదించాడు. అందుకే తవ్వకాలలో దొరికిన అవశేషాల ఆధారంగా మతాచారాలను, సంప్రదాయాలను బట్టి చరిత్ర పూర్వ సమాజాల స్వభావాన్ని గురించి అంచనా కట్టడానికి చాలామంది సామాజిక శాస్త్రవేత్తలు ప్రయత్నించారు. చాలా సందర్భాలలో అట్టడుగు వర్గాల సామాజిక నిరసనలు మత విశ్వాసాల సవాళ్ల రూపంలో వ్యక్తమయ్యాయి. పాశ్చాత్య ప్రపంచంలో ప్రొటెస్టెంటిజం, కాల్వనిజం వంటి ధోరణులు, మన సమాజంలో బౌద్ధం, జైనం, భక్తి ఉద్యమాలు అభివృద్ధి చెందడంలో ఇది స్పష్టంగా కనబడుతుంది. నైతిక నియమాలలో మార్పులకూ, ఉత్పత్తి సంబంధాలకూ భావజాలానికి మధ్య సంబంధానికీ మరొక ఆసక్తికరమైన ఉదాహరణగా హింస భావనను కూడా చూడవచ్చు. భౌతిక సంపదలో అత్యున్నత స్థాయి సాధించిన రోమన్ సమాజం మల్లయుద్ధాన్ని హింసను ఒక బహిరంగ క్రీడగా ఆనందించింది. కాకపోతే ఆ మల్లయుద్ధం చేసి రోమన్‌లకు ఆనందం కలిగించేవారు బానిసలైనంత కాలం మాత్రమే. అలాగే మానవజాతి మధ్య ప్రేమ గురించి, శాంతి గురించి గొప్ప తాత్విక ఆదర్శాలను ప్రకటించిన చర్చ్ విడిగా వ్యక్తుల మీద హింసకు ఆదేశించింది. భిన్నాభిప్రాయాలు ప్రకటించిన వారి మీద మరణశిక్షతో అంతమయ్యే విచారణలు జరిపింది. పవిత్ర యుద్ధాల పేరుతో మతయుద్ధాలు సాగించింది. మన కాలంలోనే చూస్తే అట్టడుగు ప్రజల మీద, అనాదృత వర్గాల మీద మెల్లగా, పద్ధతి ప్రకారం సాగే దోపిడీని కొన్నిసార్లు బహిరంగ హింసను కూడా సహించడం

జరుగుతోంది. కాని ఆస్తికి వ్యతిరేకంగా, ఆస్తి యజమానులకు వ్యతిరేకంగా ఎటువంటి హింస జరిగినా చట్టబద్ధంగా, కఠినంగా శిక్షలు విధించడం జరుగుతోంది. అసలు చట్టమనేదే పాలక వర్గాల చేతిలో సాధనంగా ఉంటుంది. అంటే చాలా సందర్భాలలో సమాజాన్ని శాసించే మతం గానీ, నైతిక సూత్రాలు గానీ అంతిమంగా పాలకవర్గాల మతంగా పాలకవర్గాల నైతిక సూత్రాలుగా ఉంటాయి.

జీవితపు భౌతిక, సామాజిక పరిస్థితికి, చైతన్యానికి మధ్య ఉండే ఈ సమన్వయం ప్రాచీన సమాజాలలో బహుశా అత్యంత సన్నిహితంగా కనబడుతుంది. ఆ సమాజాలలో దృశ్య కళారూపాలు గానీ, సాంప్రదాయిక చిత్రలేఖనంగానీ, లయబద్ధమైన నాట్యాలు, సంగీతం గానీ, అనుకరణ కళలు గానీ, నాటకాలు గానీ ఒక్క మాటలో చెప్పాలంటే సాంస్కృతిక కార్యకలాపాలు గానీ వాటి ఇతివృత్తాలలోనూ, లయలోనూ వారి నిత్యజీవిత ఆచరణలోని క్రమాలతో, స్వభావంతో కలగలిసి ఉంటాయి. వారి దేవతా రూపాలుగానీ, వారి ఆధ్యాత్మిక జీవిత క్రమం చిత్రించబడిన పద్ధతి గానీ అలాగే ఉంటాయి. వారి భాషలో మిగిలిపోయిన పదజాలం కూడా వారికి సన్నిహితంగా తెలిసిన వస్తువులనూ, ఇంద్రియానుభూతులను ప్రతిఫలించేదిగానే ఉంటుంది.

రాజకీయ సంస్థలు కూడా ముఖ్యంగా రాజ్యాంగ యంత్రం, ఆస్తి చట్టాలు చారిత్రకంగా పరిణామం పొందిన తీరు చూస్తే అవి సాధారణంగా ఉత్పత్తి సంబంధాలను బట్టే అభివృద్ధి చెందాయి. ఈ రంగాలలో అభివృద్ధిని విశ్లేషించడం, ఆ అభివృద్ధికి జీవన భౌతిక పరిస్థితుల మార్పుకు, సామాజిక అధికార నిర్మాణానికి మధ్య ఉన్న సంబంధాన్ని కనిపెట్టడం 18వ శతాబ్దపు భౌతికవాద చరిత్రకారులకు ఇష్టమైన పనిగా ఉండేది. ఒక ఉదాహరణ చెప్పాలంటే, ఒక వ్యక్తికి సొంతంగా ఆస్తి ఉండే హక్కు అనేది ఇటీవలి కాలపు చారిత్రక పరిణామం మాత్రమే. అంతకుముందు ఆదివాసులలో, వేటాడే సమాజాలలో ఆస్తి అనేది ఉంటే ఉమ్మడిగా మాత్రమే ఉండేది. దాన్ని తొలగించి భూస్వామ్య సమాజంలో ఒక భూస్వామికి ఉండే విశాల క్షేత్రం అనే భావన తలెత్తింది. ఆ తరువాత చేతివృత్తుల పనివాళ్లను వాళ్ల యజమానులను గానీ, వాళ్ల వృత్తులను గానీ నిర్దిష్ట ప్రాంతాలకే పరిమితం చేసే చట్టాలు వచ్చాయి. దాన్ని వ్యాపార యుగం అనవచ్చు. క్రమంగా ఆ చట్టాలను తొలగిస్తూ పారిశ్రామిక పెట్టుబడిదారీ యుగంలో స్వేచ్ఛాయుత శ్రామికుల ఒప్పందాలను సమర్థించే చట్టాలు వచ్చాయి. ఇక్కడ మనం మరొక విషయం కూడా గమనించవలసి ఉంది. రాజ్యాంగయంత్రం అనేది ఒక దేశపు చట్టాలను అమలు చేసే అధికారం పొందిన ఉద్యోగుల వ్యవస్థ మాత్రమే కాదు. అది పాలకవర్గాల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే వ్యవస్థ. దాని చట్టాలు, దాని ఆచరణ సాధనాలు, దాని నియంత్రణ పరిధి, ఒక సమాజంలోని ఆధిపత్య వర్గపు ప్రయోజనాలను ప్రతిఫలిస్తుంది. అంతేకాదు, ఇవన్నీ కూడా ఉత్పత్తి సంబంధాలలో వచ్చే మార్పులతో పాటు తప్పనిసరిగా మారుతూ ఉంటాయి. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థమీద ఆర్థిక మాంద్యపు నీలినీడలు కమ్ముకోవడం ఇంకా ప్రారంభం కాని 1920లకు ముందు బూర్జువా రాజ్యాంగయంత్రం తన అధికారాలను ప్రధానంగా శాంతి భద్రతల పరిరక్షణకు మాత్రమే పరిమితం చేసుకుంది. ఇతర దేశాలతో పోల్చినప్పుడు జాతీయ ప్రయోజనాలను పరిరక్షించడం దేశం లోపల సొంత ఆస్తిని పరిరక్షించడం మాత్రమే తన పనులు అనుకుంది. కాని, మహాసంక్షోభం తరువాత పాశ్చాత్య పెట్టుబడిదారీ రాజ్యాలన్నీ తమ పెట్టుబడిదారీ ప్రయోజనాలను పరిరక్షించడం కొరకు ఆర్థిక కార్యాచరణలో ఒడిదుడుకులను అదుపు చేసే బలోపేతమైన ద్రవ్య వ్యవస్థ ఉండాలని భావించాయి. పాశ్చాత్య ప్రపంచంలోని పెట్టుబడిదారీ రాజ్యం ఎప్పటికప్పుడు సంక్షేమ చర్యలను చేపట్టడం మొదలుపెట్టింది. ఆస్తిలేని పేదవర్గాలకు సహాయం చేయాలని అనడం మొదలుపెట్టింది. హింసాత్మక ఘర్షణలుగా పరిణమించే తగాదాలను అడ్డుకొనే పని రాజ్యానిదేనని భావించడం మొదలుపెట్టింది. అయినప్పటికీ ప్రజల నుంచి ప్రతిఘటన తీవ్రంకాగానే అదే రాజ్యం అతి తీవ్రంగా చట్టపరమైన సైనికపరమైన నిర్బంధ చర్యలను చేపట్టడానికి ఎంత మాత్రం సందేహించలేదు.

అలాగే మరొక విషయం కూడా చూస్తే అంతకుముందు వలస ఆర్థికవ్యవస్థలుగా ఉండి స్వాతంత్ర్యం పొందిన దేశాలన్ని స్వాతంత్ర్యం తరువాత ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానాన్ని చేపట్టాయి. విశ్లేషించి చూస్తే ఈ రాజ్యాల వర్గ స్వభావం చాలా సంక్లిష్టమైనవి. అవి చేపట్టిన విధానాలు వైవిధ్యపూరితమైనవి. కాని అంతిమంగా వాటి లక్ష్యం ఆయా దేశాలలో పెట్టుబడిదారీ వర్గం వేగవంతంగా అభివృద్ధి చెందడానికి మార్గం సుగమం చేయడమేననిపిస్తుంది. భిన్న సమ్మేళనంతో కూడిన మధ్యతరగతి వర్గాల పాత్ర పెరిగినకొద్దీ ఈ సమాజాలలో వర్గ ప్రయోజనాల మధ్య సాగే ఘర్షణ అంత స్పష్టంగా కనబడకుండా పోతుంది. మరీ ముఖ్యంగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యాలలో రాజకీయ క్రమాలు చాలా సంక్లిష్టంగా మారిన చోట సార్వత్రిక ఎన్నికలు వగైరాల ద్వారా రాజకీయ క్రమాల వడపోత జరిగే చోట స్వయంగా రాజకీయవేత్తలు ఒక వృత్తిపరమైన బృందంగా తయారై ప్రణాళికావేత్తలతో, సాంకేతిక నిపుణులతో, నిర్వహణా నిపుణులతో, ఉన్నతోద్యోగులతో కలిసి పనిచేసే చోట రాజ్యం స్వభావం ఏమిటని గుర్తించడం అంత సులభం కాదు. రాజ్య విధానాలలో ఉండే వర్గ అనుకూలతను పారదర్శకంగా గుర్తించడం సాధ్యం కాదు. అయినప్పటికీ పోటీ పడుతున్న వర్గాలు రాజకీయ క్రమాలను క్రియాశీలంగా తమ ప్రయోజనాల కొరకు వాడుకుంటారనడంలో ఎటువంటి సందేహం లేదు. రాజ్య విధానాలు బహువర్గ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే విచిత్ర సమ్మేళనంగా కనబడినప్పటికీ, వర్గ ప్రయోజనాల ఘర్షణ తీవ్రతరమైన వ్యక్తీకరణ పొందినప్పుడు రాజ్యం ఏ వర్గానికి అనుకూలంగా ఉన్నదో బహిరంగంగానే, బలవత్తరంగానే స్పష్టమవుతుంది. అటువంటి సమయాలలో పాలకవర్గాలు ఎటువంటి రాజీవైఖరులను ప్రదర్శించవు. ప్రజాస్వామిక క్రమాలను పక్కన పెట్టడానికి కూడా వెనుకాడవు.

## పునాది ఉపరితలపు సంబంధపు చారిత్రక అభివృద్ధి

ఒక్కమాటలో చెప్పాలంటే పౌర సమాజం అనేదాన్ని పునాది గణనీయంగా నిర్దేశిస్తుంది. పునాది అంటే ఉత్పత్తి శక్తుల స్థాయి, అప్పటికి కొనసాగుతున్న ఉత్పత్తి సంబంధాల మొత్తం. అలాగే, పునాదిలోని మార్పులే సాధారణంగా పౌరసమాజంలోని మార్పులకు కారణమవుతాయి. అయితే, ఈ సూత్రాన్ని మొరటుగా అర్థం చేసుకోకూడదు. ఎంతోమంది విమర్శకులు అర్థం చేసుకున్నట్టుగా ఇదేదో యాంత్రిక నియతివాదంగా అర్థంచేసుకోకూడదు.

మొట్టమొదట ఉపరితలంలోని చాలా రూపాలు స్వతంత్ర ప్రతిపత్తి

కలిగి ఉన్నట్టుగా కనబడుతాయని గుర్తించవలసి ఉంది. చాలా రూపాలు వాటి పుట్టుకకు కారణమైన పాత ఉత్పత్తి సంబంధం అంతమై పోయినప్పటికీ కొనసాగుతూ ఉంటాయి. ఉదాహరణకు, చాలా మతాచారాలు వాటి భౌతిక ఆవశ్యకత రద్దయిపోయినప్పటికీ ఇంకా కర్మకాండల రూపంలో, సంప్రదాయాల రూపంలో కొనసాగుతూ ఉంటాయి. అయితే అవి ఇంకా కొనసాగడానికి అవకాశం ఎక్కడ దొరుకుతుందంటే జీవితంలో ఏ రంగాలలో కొత్త ఉత్పత్తి సంబంధాలు ఇంకా తమ పూర్తి ప్రభావాన్ని చూపలేకపోయాయో అక్కడ మాత్రమే. తమ ఇళ్లలో వ్యక్తిగత ప్రవర్తనలో ఉండే తీరుకు, తమ వృత్తి పరమైన ప్రయోజనాలు సాధించడంలో బయటి సమాజంలో ఉండే తీరుకు అఖాతం కనబడుతుంది. ఉదాహరణకు, అత్యాధునికమైన శాస్త్రవిజ్ఞాన రంగాలలో పరిశోధన చేసే శాస్త్రవేత్త తన కుటుంబ జీవితంలో ఛాందస మూఢాచారాల కర్మకాండలను పాటించడం కనబడుతుంది. మధ్యతరగతి గృహిణులలో ఇంకా కనబడుతూ ఉండే మతాచారాల ప్రవర్తనలు కూడా దీన్నే సూచిస్తాయి. వీటివల్ల తేలేదేమంటే, పాత జీవన విధానం కొనసాగడమనేది హఠాత్తుగా రద్దు కాదు. కొత్త ఉత్పత్తి సంబంధాలు ఇంకా బలపడని జీవన రంగాలలో ఉన్న స్త్రీ పురుషులలో ఈ అవశేషాలు కొనసాగుతాయి. అలాగే పాత సంప్రదాయాలు, మతాచారాలను సాంస్కృతిక జీవనాన్ని పునరుద్ధరించాలనే ఆలోచనలో కూడా ఉంటాయి. ఇటువంటి పునరుద్ధరణ వాదానికి సామాజిక కారణాలు పాక్షికంగా 'గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్' అనే పాత సమాజ వైభవం గురించిన ఉద్వేగాలలో ఉంటాయి. కాని అంతిమంగా ఈ పునరుద్ధరణ వాదానికి కారణాలను అది చేపట్టే రూపాన్ని ప్రస్తుత సామాజిక అభివృద్ధి దశ నుంచే వివరించవలసి ఉంటుంది. బాహ్య రూపంలో ఇవి పాత వాటిలాగానే కనబడినప్పటికీ ఈ పునరుద్ధరించిన ఆచారాలు కొన్నిసార్లు పూర్తి భిన్నమైన విధిని నిర్వర్తిస్తుంటాయి. అంతేకాదు, కొన్ని అంశాలనే కొత్తగా బలోపేతం చేయడం ఎందుకు జరుగుతుంది? కొన్ని ధోరణులు ఒక ప్రత్యేక చారిత్రక సందర్భంలోనే ఎందుకు తలెత్తుతాయి అనే ప్రశ్నలు కూడా ప్రస్తుతం కొనసాగుతున్న సామాజిక సంబంధాల వెలుగులోనే అర్థం చేసుకోవలసి ఉంటుంది. అమెరికాలో 'హరేరామ' ఉద్యమం ఇటువంటి ఆలోచనకు అవకాశం కల్పిస్తుంది.

రెండవది, భావాలు, నీతి, సత్ప్రవర్తన వగైరా చైతన్యమంతా సామాజిక అస్తిత్వ పద్ధతి వల్లనే ఎక్కువగా నిర్ధారితమవుతుందని అనడం నిజమే అయినప్పటికీ ఈ సంబంధం కూడా చారిత్రకంగా మారుతూనే ఉంది. మనం ఇప్పటికే పరిశీలించినట్టుగా తొలి సమాజాలలో పునాది మీద ఉపరితలం ఆధారపడడం తక్షణమే ప్రత్యక్షంగా కనబడే విధంగా ఉండేది. కాని, సామాజిక కార్యాచరణ పురోగమిస్తున్న కొద్దీ ఈ సంబంధం చాలా సంక్లిష్టంగా మారిపోవడం మాత్రమే కాదు, ఉపరితలం పునాదిలో శక్తిమంతంగా జోక్యం చేసుకోవడం కూడా మొదలైంది. ఉదాహరణకు రాజ్యాంగ యంత్రపు పనులను తీసుకోవచ్చు. రాజ్యాంగ యంత్రపు విధులు విస్తరించడంతో అది కేవలం పాలకవర్గాల ప్రయోజనాలను పరిరక్షించడం మాత్రమే కాదు ఉత్పత్తి పరిస్థితులలో, ఉత్పత్తి సంబంధాలలో మార్పులు ప్రవేశపెట్టడానికి ఉద్దేశించిన విధానాలను భౌతిక, చట్టపరమైన ప్రేరణలద్వారా పునాదిలో జోక్యం చేసుకోవడానికి కూడా ప్రయత్నిస్తుంది. అంతేగాక రాజ్యాంగయంత్రం, చట్ట వ్యవస్థలు ఒక నిర్దిష్ట వర్గ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తూ ఉన్నప్పటికీ సమాజపు 'సాధారణ శ్రేయస్సు' అనే రూపం తీసుకుంటున్నట్టు కనబడతాయి. నిజానికి చట్ట ప్రకారం 'బూర్జువా వర్గం ఒక వర్గంగా పాలిస్తున్నందువల్లనే అందరికీ ప్రాతినిధ్యం వహిస్తున్నట్టు ఒక సాధారణ వ్యక్తీకరణ ఇవ్వవలసి ఉంటుంది' అని మార్క్స్ అన్నాడు. న్యాయశాస్త్రంలో చూస్తే ప్రస్తుతం కొనసాగుతున్న ఆస్తి సంబంధాలను సమాజం మొత్తం కలిసి తీసుకున్న నిర్ణయపు ఫలితంగా చెప్తూ ఉంటారు. 'పాలకవర్గానికి చెందిన వ్యక్తులు తమ ఉమ్మడి ప్రయోజనాలను స్థాపించుకోవడానికి తయారు చేసుకునే రూపమే రాజ్యం కనుక, ఆ రాజ్యంలోనే ఆ యుగపు సమస్త పౌరసమాజం మూర్తీభవించి ఉంటుంది గనుక రాజ్యమనేది అన్ని ఉమ్మడి సంస్థలు రూపొందడానికి మధ్యవర్తిగా పనిచేస్తుంది. ఆ విధంగా ఆ సంస్థలన్నీ రాజకీయ రూపాన్ని పొందుతాయి. అందువల్లనే చట్టాలనేవి ప్రజలందరి ఉమ్మడి సంకల్పం మీద రూపొందినట్టుగా భ్రమ కలుగుతుంది. ఈ ఉమ్మడి సంకల్పం అనేది దాని వాస్తవ పునాది నుంచి వేరు చేయబడినది. ఆ వాస్తవపునాది స్వేచ్ఛా సంకల్పం. అదే విధంగా న్యాయం అనేది కూడా కొనసాగుతున్న చట్టాలు అనే సంకుచిత అర్థానికి కుదించబడుతుంది' అన్నాడు మార్క్స్. అయితే వాస్తవంలో శ్రమ విభజన ముందుకు సాగిన కొద్ది రాజ్యాంగ యంత్రంలో వేరువేరు విధులు నిర్వర్తించేవారు, ఉదాహరణకు న్యాయవాదులు, ఉన్నతాధికారులు ఎంతగా సాంకేతిక నైపుణ్యం సాధించిన బృందాలుగా మారిపోతారంటే వాళ్లకు పైకి చూడడానికి స్వతంత్ర ప్రతిపత్తి ఉన్నట్టు అనిపిస్తుంది. ఇందువల్ల కొన్ని సందర్భాలలో ఈ విధి నిర్వాహక బృందాలకూ ప్రభుత్వానికీ మధ్య ఘర్షణ జరుగుతున్నట్టు కూడా కనబడుతుంది. అంతకన్న ముఖ్యంగా ఇంతకుముందే చెప్పినట్టు ప్రభుత్వ విధానాలు అనబడే వాటిని ఈ స్వతంత్ర ప్రతిపత్తి గల బృందాలే తయారు చేసినట్టు అనిపిస్తుంది. వారు ఆ తయారీలో 'న్యాయం', 'సంక్షేమం', 'ప్రజలకొరకు', 'స్వేచ్ఛ', 'సమర్థత', 'త్వరిత ప్రగతి', 'సమానత్వం' వగైరా అమూర్త ఆదర్శాలతో తయారుచేసినట్టు అనిపిస్తుంది. ఈ విధంగా కాలక్రమంలో రాజ్యాంగయంత్రం చాలా సంక్లిష్టంగా తయారైందనడంలో సందేహం లేదు. ఆ క్రమంలో అది అంతర్గత సమస్యలను కూడా సృష్టించుకుంది. కాని, ఎంతమాత్రమూ మరచిపోకూడని విషయమేమంటే వాళ్లు చట్టాలను రాజ్యాంగాన్ని, సామాజిక విధానాలను, వ్యాఖ్యానించినా, అమలుచేసినా, ఆ క్రమంలో న్యాయాన్ని, సామాజిక అవసరాలను నిక్షిప్తం చేసుకున్నట్టు కనిపించినా అదంతా అంతిమంగా పాలక వర్గాల దృష్టికోణం నుంచి మాత్రమే. అప్పుడప్పుడూ కీలకమైన చారిత్రక సందర్భాలలో ఎత్తుగడల కోసమో, ఇతర కారణాల కోసమో పాలకవర్గాలు రాజీలకు సిద్ధపడినట్టు కనిపించవచ్చు. కాని, శక్తిమంత మైన సవాళ్లు ఎదురైనప్పుడు పాలకవర్గాలు తమ నిజస్వరూపాన్ని స్పష్టంగా ప్రకటిస్తాయి.

అంటే, చారిత్రకంగా రూపొందిన నిర్మాణాత్మక సంబంధాలు అనేక రకాలుగా ముఖ్యమైన నిర్ణాయక అంశాలుగా ఉంటాయి. మొట్టమొదట రాజ్యాంగ యంత్రపు వర్గ స్వభావం విధానాలు ఎంత వరకు సాగవచ్చునో, ఏయే ప్రత్యేక రూపాలు తీసుకోవచ్చునో పరిమితులు విధిస్తుంది. ఆ వర్గ స్వభావం కూడా మళ్లీ అప్పటికి ప్రాబల్యంలో ఉన్న

# వీక్షణం రచయితల సమావేశం

వీక్షణం రచయితల మూడవ సమావేశం ఏప్రిల్ 12న హైదరాబాద్‌లో జరిగింది. ఈ సమావేశానికి వీక్షణం గౌరవ సంపాదకులు వి. హనుమంతరావు, వకుళాభరణం రామకృష్ణ, కె. ఆర్. చౌదరి, ఎం. రత్నమాల, కాకరాల, అరిబండి ప్రసాదరావు, రావెల సోమయ్య, టి.వివేక్, కె. విజయకుమార్, వి. చలపతిరావు, వి. వంశీచరణ్, శ్రీధర్ దేశ్‌పాండే, కె. సురేష్, ఇ.ఎస్. బ్రహ్మచారి, విద్యాభూషణ్, డి. పాపారావు, బి.ఎస్. రాజు, ఆకుల భూమయ్య, పి.వి. రమణ, జి. సత్యం, బి. జ్యోతి, వి. శ్రీదేవి, జయరాజు, ఎం.డి. ఇబ్రహీం, కె. ప్రభాకర్, కె. దిలీప్ హాజరయ్యారు. ఎన్నికల శిక్షణ కార్యక్రమాల వల్ల, ఇతర కార్యక్రమాల వల్ల ఈ సమావేశానికి హాజరు కాలేకపోతున్నామని చాలా మంది రచయితలు తెలియజేశారు.

వీక్షణం సహాయ సంపాదకులు డి.వి. రామకృష్ణారావు రచయితలకు స్వాగతం చెప్పారు. సమావేశానికి అధ్యక్షత వహించిన వకుళాభరణం రామకృష్ణ పత్రిక గురించి వివరిస్తూ వివిధ సాహిత్య సంఘాల పత్రికలూ, వివిధ అస్తిత్వ ఉద్యమాల పత్రికలూ ఉన్నాయి కానీ, రాజకీయార్థిక మాస పత్రికగా వీక్షణం మాత్రమే వస్తోందన్నారు. 2003లో ప్రారంభమైన ప్రజాపక్ష సమీక్ష ఒక ఉన్నతమైన ఆశయంతో మొదలుపెట్టామనీ, తరువాత వీక్షణంగా ఇప్పటికి 93 సంచికలు వెలువడ్డాయన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాలను సీరియస్‌గా విశ్లేషించే పత్రికలేదు. పత్రిక ఎలా ఉండాలనే దానికి ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ ఒక నమూనాగా అనుకున్నాం అన్నారు. ఇ.పి.డబ్ల్యు.కి సంబంధించిన ప్రస్తుత సంక్షోభం ఆర్థికపరమైనది. ఈ రోజు ఆ పత్రికలో అచ్చువడమే గర్వంగా భావించే స్థితి ఉంది. మనం ఎంతవరకు దాన్ని చేరుకోగలిగాం, ఇంకా ఏమి చేయగలం, ఇప్పుడు పత్రిక ఎలా ఉంది, ఎలా ఉండాలి, కొత్త శీర్షికలేమైనా పెట్టాలా, ఇంకా వైవిధ్యభరితంగా ఏమైనా తేగలమా ఆలోచించి, ఆర్థిక పరమైన చేయూతనిచ్చి పత్రికను బతికించుకోవాల్సిన అవసరం ఉందని ఆయన అన్నారు.

పత్రిక ప్రారంభ సంపాదకులు వి. హనుమంతరావు పత్రిక నడచి వచ్చిన కాలాన్ని వివరిస్తూ ఈ ఏడు సంవత్సరాలు చేసిన పనిని సమీక్షించుకుంటున్నాం, ఇంకా చాలా దూరం వెళ్లాల్సేవుందన్నారు. పత్రికను మిత్రుల ఆర్థిక సహకారంతో ప్రారంభించాం. మొదట్లో వ్యాసాలు సేకరించడం చాల కష్టంగానే ఉండేది. వచ్చిన ప్రతి వ్యాసాన్ని వేయాల్సివచ్చేది. ఇప్పుడు చాల మంది కొత్త రచయితలు రాస్తున్నారు. చాలానే వస్తున్నాయి. రచయితలు మరింత శ్రద్ధవహించి, సాధన చేస్తే వ్యాసాల నాణ్యత పెరుగుతుందన్నారు. పత్రిక ఆర్థికంగా నిలదొక్కుకోవడానికి ప్రకటనలు వేయాల్సి ఉంటుంది. ఇప్పుడు సమాచార పౌరసంబంధాల శాఖకు సంబంధించి ఒక ప్రకటన మాత్రమే

---

ఉత్పత్తి స్వభావం వల్లనే రూపొందుతుంది. రెండవది, రాజ్యాంగ యంత్రం గనక సమాజ మౌలిక నిర్మాణాన్ని ప్రభావితం చేయకుండానే సంస్కరణ విధాన వాదాలు అవలంబించినట్టయితే చట్టపరమైన రూపాలన్నీ శక్తిహీనమైపోతాయి. ఉండి లేనట్టు మారిపోతాయి. విద్యను, ఆరోగ్యాన్ని అటువంటి రంగాలను మెరుగుపరిచే లక్ష్యంతో తయారయ్యే సంక్షేమ కార్యక్రమాలు, ఉత్పత్తి సంబంధాలలో మౌలికంగా, బలహీనంగా ఉన్న వర్గాల భౌతిక జీవన స్థితిగతులను ఎంతమాత్రం మార్చలేవు. అవి ఎక్కువలో ఎక్కువ వ్యాధికి పైపైన ఉపశమనం ఇచ్చే మందులు మాత్రమే. మూడవది, రాజ్యాంగ యంత్రం చేపట్టే అనేక విధానాల పరిణామాలు ఎలా ఉంటాయనేది అప్పటికి కొనసాగుతున్న ఉత్పత్తి సంబంధాలలో వేరువేరు వర్గాల స్థితి ఏమిటి అనే దానిమీద ఆధారపడి ఉంటుంది. ఆకర్షణీయమైన గిట్టుబాటు ధరలు ఇచ్చే కొత్త వాణిజ్య పంటల ప్రవేశం, కాలువల ద్వారా నీటిపారుదల సౌకర్యాలను విస్తృతంగా పెంచడం, భూ యాజమాన్యంలో వ్యక్తిగత ఆస్తి హక్కులను గుర్తించడం వంటి పైకి చూడడానికి ప్రగతిశీలంగా కనిపించే విధానాలను ఉత్తర్ ప్రదేశ్ ప్రాంతంలో 18వ శతాబ్దంలో వలస ప్రభుత్వమే ప్రారంభించింది. వ్యవసాయాన్ని ఆధునీకీకరించే ఉద్దేశంతో వచ్చిన ఈ విధానాలు రైతాంగంలోని భిన్న బృందాల మీద వేరువేరు ఫలితాలను చూపించడం మనకు తెలిసిందే. చిన్నస్థాయి వ్యవసాయదారులు వంటి కొన్ని బృందాలు తమ తిండి గింజల వ్యవసాయాన్ని ఒదిలి వాణిజ్య పంటలకు వెళ్లినందువల్ల స్వయం సమృద్ధిని కోల్పోయి వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాలలో చిక్కుకుపోయారు. భూముల ధరలు పెరిగిపోయి, భూ బదిలీలు జరిగి చిన్న రైతులు భూములు కోల్పోయారు. భూములన్నీ సంపన్న భూస్వాముల చేతుల్లోకీ, వడ్డీవ్యాపారుల చేతుల్లోకీ వెళ్లాయి. చాలాచోట్ల భూములు ఎప్పటికీ తెగని న్యాయస్థానపు వివాదాలలో చిక్కుకున్నాయి. మరొకవైపు ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకుని ధనిక రైతులు నిరుపేద రైతుల మీద తమ ఆధిక్యతను పెంచుకున్నారు. అంటే, ఒక రాజ్యాంగయంత్రపు విధానపు పరిణామాలు విభిన్న వర్గాల మీద ఎలా ఉంటాయో అంచనా కట్టడానికి అప్పటికి కొనసాగుతున్న సామాజిక సంబంధాల గురించి మనం అర్థం చేసుకోవలసి ఉంటుంది. అంటే, రాజ్యాంగ యంత్రమూ, ఇతర రాజకీయ నిర్మాణాలూ చాలా సంక్లిష్ట స్వభావాన్ని సంతరించుకున్నాయి అనడంలో సందేహం లేనప్పటికీ, వాటిని సంపూర్ణంగా స్వయంప్రతిపత్తి కల సంస్థలుగా గుర్తించడానికి వీలులేదు. అలాగే రాజ్యాంగ యంత్రపు చర్యలను ఉత్పత్తి సంబంధాల స్వభావంతో సంబంధంలేని ఏదో సహజాతమైన, అమూర్తమైన న్యాయభావన ఆధారంగానో, సంక్షేమ సూత్రాల ఆధారంగానో అంచనా కట్టడం అసాధ్యం.

*(...ముగింపు వచ్చే సంచికలో)*

వస్తోంది. పత్రికకు ప్రకటనలు తేవడంలో, విరాళాలు సేకరించడంలో విఫలమయ్యాం.

వివిధ రచయితలు వ్యక్తం చేసిన అభిప్రాయాలు, సూచనలు:

- ఇవాళ రాసేవాళ్లు తక్కువమంది ఉన్నారనీ, పరిశోధకులు, అధ్యాపకులు, రచనలు చేసే అవకాశం ఉన్నవారు చేయాల్సిన కృషి చేయడం లేదు.
- కొత్త రచయితలను కనుక్కోవాలి. ఉన్న రచయితలను మరిన్ని రాసేలా ప్రోత్సహించాలి.
- ఇంటర్‌నెట్, ఇంగ్లిష్ పత్రికలలో చాలా అంశాలపై వ్యాసాలు వస్తున్నాయి. వాటిని తెలుగులోకి అనువదిస్తే తెలుగు పాఠకుల అవగాహన పెంచడానికి తోడ్పడుతుంది. రచయితలు మంచి అనువాదాలకు కూడా పూనుకుంటే బాగుంటుంది.
- పత్రిక సర్క్యులేషన్ అన్ని జిల్లాల్లో ఒకేలా లేదు. అన్ని జిల్లాలలో చందాలు కట్టించాలి.
- మన రాష్ట్రంలోని యూనివర్సిటీలలో చేసే పరిశోధనా పత్రాలను సేకరించి పత్రికలో వేయాలి.
- కొత్తగా వచ్చే కొన్ని రచనలు పేలవంగా ఉంటున్నాయి.
- శాస్త్ర, సాంకేతిక రంగాల్లో చాలా మార్పులు వచ్చాయి. అవి సమాజంపై ఏవిధమైన ప్రభావాన్ని వేస్తున్నాయో విశ్లేషించే వ్యాసాలు రావాల్సిన అవసరం ఉంది.
- ప్రాజెక్టుల వల్ల నిర్వాసితులవుతున్న వారి సమస్యలను కేస్ స్టడీలుగా వేస్తే బాగుంటుంది.
- దేశవ్యాప్తంగా ప్రజల సమస్యలపై జరుగుతున్న ఉద్యమాల రిపోర్ట్స్ వేయాల్సిన అవసరం ఉంది.
- సాహిత్యంలో కూడ సామాజిక కోణాలు ఉంటాయి కాబట్టి సమీక్షలు సాహిత్యం నుంచి కూడా రావాలి.
- చట్టానికి సంబంధించిన విషయాలపై వ్యాసాలు వస్తే ప్రజలకు అవగాహన కలగడానికి అవకాశం ఉంటుంది.
- ప్రజల సమస్యల పై డిబేట్స్ వేస్తే బాగుంటుంది.
- రచయితలకు సపోర్టింగ్ మెటీరియల్ ఇస్తే వ్యాసాలు మరింత బాగుంటాయి.
- దేశ ఆర్థిక పరిస్థితిపై విశ్లేషణతో కూడిన వ్యాసాలు రావాలి.
- అంతర్జాతీయ పరిణామాలు, లాటిన్ అమెరికా పరిణామాలపై వ్యాసాలు వస్తే బాగుంటుంది.
- ముందే వచ్చిన వ్యాసాలను ఎవరికైన ఇచ్చి దాని మీద కొంత పని చేస్తే వ్యాసం నాణ్యత పెరగడానికి వీలవుతుంది.
- పత్రిక ఆర్థిక లోటును తగ్గించుకోవడానికి సంవత్సర పెంచవచ్చు.
- పత్రికలో అచ్చయ్యే వ్యాసాలు తెలుగు సమాజంలోని విషయాలపై బాగానే వస్తున్నాయి. దేశ, ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్న పరిణామాల మీద వ్యాసాలు తక్కువగా వస్తున్నాయి. ఈ లోటును పూడ్చితే తెలుగు సమాజానికి ఉపయోగకరంగా ఉంటుంది.
- పత్రికను ఆన్‌లైన్‌లో చూశాం. ఇది మంచి ప్రయత్నం, ఎక్కువ మందికి చేరే అవకాశం ఉంది.
- ప్రపంచీకరణ ప్రభావం వల్ల జరుగుతున్న సంక్షోభంపై ఫోకస్ ఉండే రచనలు రావాల్సిన అవసరం ఉంది.
- మేధో మదనంలాగా ఏఏ విషయాల మీద ఫోకస్ చేయాలో చర్చ చేసి దాన్ని అమలులోకి తెస్తే ఉపయోగకరంగా ఉంటుంది.
- పత్రికలో అచ్చయ్యే వ్యాసాలు ప్రాంతీయతతో, రాజకీయాభిప్రాయాలకు అధిక ప్రాధాన్యతతో వస్తున్నాయి.
- వీక్షణం ఆర్థికంగా నిలదొక్కుకుంటే మిగతా సమస్యలను పరిష్కరించుకోవచ్చు.
- ప్రభుత్వం చేపడుతున్న పనుల ప్రమాణాలపై విశ్లేషణలతో రచనలు రావాలి.
- జిల్లాల్లోని సమస్యలను పత్రిక ద్వారా చెప్పగలిగితే పత్రిక అక్కడి ప్రజల్లోకి వెళ్లడానికి అవకాశం ఉంటుంది.
- ఇబ్బందుల్లో కూడా పత్రికను క్రమం తప్పకుండా తీసుకురావడం సంతోషకరమైన విషయం.
- వ్యాసాలు తేలికగా వస్తున్నాయి. లోతయిన పరిశోధన, విశ్లేషణలతో వచ్చే విధంగా కృషి జరగాలి.
- మహిళా సమస్యల మీద తగినన్ని వ్యాసాలు రావడంలేదు. మహిళలపై చాలా రకాల దాడులు జరుగుతున్నాయి, ఆ విషయాలపై లీడ్ ఇచ్చి రాయించాలి.
- వీక్షణంలో వచ్చిన సామాన్యుల అభిప్రాయాల ద్వారా మారు మూల ప్రాంతాల ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకునే అవకాశం పాఠకులకు కలిగింది.
- ఆర్థిక సంక్షోభం పైన మరింత లోతయిన చర్చకు వీక్షణం కృషి చేయాలి.
- పుస్తక సమీక్షలు వేయాల్సిన అవసరం ఉంది. గత చరిత్రను అర్థం చేసుకోవడానికి అవి చాల అవసరం.
- ప్రజలకు ఉపయోగపడే సినిమాలు, సాహిత్యం గురించి సమీక్షలు రావాలి.
- వీక్షణం ప్రభుత్వ ప్రకటనకు బదులు ప్రత్యామ్నాయ ఆదాయ వనరులను చూసుకోగలిగితే బాగుంటుంది.
- చరిత్ర, సంస్కృతులపై వ్యాసాలు రావాలి.
- పత్రిక ఆర్థికంగా నిలదొక్కుకోవడానికి హాస్పిటల్స్, విద్యాసంస్థల ప్రకటనలు వేస్తే బాగుంటుంది.
- జిల్లాలలో వీక్షణం పాఠకుల క్లబ్‌లు నిర్వహిస్తే బాగుంటుంది.
- శిక్షణా తరగతులను కూడా నిర్వహిస్తే పాఠకులను, రచయితలను పెంచుకునే అవకాశం ఉంది.
- వీక్షణం పత్రిక ఉపాధ్యాయుల్లో ఒక స్పీకర్‌గా పనిచేస్తోంది.
- ఈనాడు సమాజంలో జరుగుతున్న పరిణామాలపై వీక్షణం సెమినార్స్ నిర్వహిస్తే మావంతు సహకారాన్ని అందజేస్తాం.

వకుళాభరణం రామకృష్ణ సమావేశంలో ఆశాజనకమైన సూచనలు వచ్చాయన్నారు. కొన్ని లక్ష్యాలు దీర్ఘకాలికంగానూ, కొన్ని తక్షణం పరిష్కరించేవిగానూ ఉన్నాయన్నారు. సమావేశ చర్చపైన, సూచనలపైన వీక్షణం సంపాదకులు ఎన్.వేణుగోపాల్ తన ప్రతిస్పందనను, రచయితలకు కృతజ్ఞతలను తెలిపారు. సర్క్యులేషన్ మేనేజర్ వై.రామచంద్రం సమావేశానికి వచ్చిన వారికి, సహకరించిన వారికి కృతజ్ఞతలు తెలియజేయడంతో సమావేశం ముగిసింది. వీ

*మాతృభాష, దానికున్న ప్రాముఖ్యత, విద్యారంగంలో జరుగవలసిన సంస్కరణల గురించి వివరించే వ్యాసాల సంపుటి 'భాష-సంస్కృతి-సమాజ దర్శనం' పుస్తకాన్ని సమీక్షిస్తున్నారు* **వి. చలపతిరావు**

# 'భాష-సంస్కృతి-సమాజ దర్శనం'




ఎం. వీరప్ప మొయిలీ మాజీ కర్ణాటక ముఖ్యమంత్రిగా, భారత ప్రభుత్వం నియమించిన పాలనా సంస్కరణల కమిషన్ అధ్యక్షునిగానే అందరికీ పరిచయం. ఈయన ఇటీవల కాంగ్రెస్ వ్యవహారాల ఆంధ్రప్రదేశ్ ఇన్‌చార్జ్‌గా పనిచేసినందువల్ల తెలుగు ప్రజలకు పరిచయమయ్యారు. కాని, ఈ గ్రంథం ద్వారా ఈయన ఒక రచయితగా, కన్నడ సాహిత్యవేత్తగా, ఒక పాలనా సంస్కర్తగా, భారతీయ సాహితీ సంస్కృతుల పై అపార అభిమానం, అనుభవం కలిగిన బహుముఖ ప్రజ్ఞాశాలిగా తెలుగు ప్రజలకి పరిచయం అవుతారు.

విద్యారంగంలో మొయిలీ సూచించిన విషయాలు చాలా మౌలికమైనవి, విలువైనవి, ఆచరించదగినవి. ఒకటవ తరగతి నుండి నాలుగవ తరగతి వరకు మాతృభాషలోనే విద్యాబోధన జరగాలని సూచించారు. 'మాతృభాషే ప్రగతికి రహదారి' అనే వ్యాసంలో ఈ విషయం గురించి గట్టిగా వాదిస్తారు. 'పరభాషను మనదిగా స్వీకరించి ప్రజల బతుకులను పాడుచేసే ప్రవృత్తి ఇకనైనా ఆగాలని' ప్రభుత్వాలను గట్టిగా హెచ్చరిస్తారు. అందుకు మొయిలి మహాత్మాగాంధీ 1946లో 'హరిజన' పత్రికలో రాసిన మాటలను ఉటంకించారు. 'నేను నా తల్లి పాలను ఎంత ఆస్వాదిస్తానో నా మాతృభాషను కూడా అంతే ఆస్వాదిస్తాను' అని గాంధీజీ తన అభిప్రాయాన్ని ఆనాడే వెల్లడించారు. (పేజీ 7). కానీ ఈనాటి రాష్ట్ర ప్రభుత్వాలు ఈ విషయంలో నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నాయని ఆయన అంటారు. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ మొదటి భాషా ప్రయుక్త రాష్ట్రం అయినప్పటికీ నాటి నుండి నేటి వరకు ఈ రాష్ట్రాన్ని ఏలిన ముఖ్యమంత్రులు నిర్లక్ష్యం వహించటం వలన, విద్యా, పాలనా రంగంలో తెలుగు భాషకు తగు ప్రాముఖ్యత లభించక మన భాష క్రమక్రమంగా మృతభాషగా మారిపోతున్నది. ఇప్పటికే ప్రభుత్వ ఉత్తర్వులు తెలుగులో వెలువడక పోవటం శోచనీయం. ప్రజల భాషలో ప్రభుత్వ వ్యవహారాలు నడవటం భాషా ప్రయుక్త రాష్ట్రాల ముఖ్య ఉద్దేశ్యం కదా. ప్రజాస్వామ్య వ్యవస్థకు కూడా ఇది పునాది కదా. పైగా రాజశేఖరరెడ్డి ప్రభుత్వం, గ్రామస్థాయి నుండి ప్రాథమిక పాఠశాలలో ఇంగ్లిష్ మాధ్యమం ప్రవేశపెట్టాలని చర్యలు చేపట్టింది. ఈనాడు ఈ రాష్ట్రంలో ఇంగ్లిష్ మీడియంలో చదివిన విద్యార్థులకు తెలుగు రాయటం, చదవటం రాదంటే అతిశయోక్తి కాదు. ఈ దుస్థితి పోవాలని ఈ గ్రంథకర్త గట్టిగా వాదిస్తారు.

మొయిలీ కర్ణాటక ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో అన్ని నిమ్నకులాల విద్యార్థులకు ఉన్నత విద్యావకాశాలు, ముఖ్యంగా సాంకేతిక విద్యావకాశాలు వీలయ్యే విధంగా ప్రవేశపెట్టిన 'అర్హత పరీక్ష' విధానం చాలా ప్రాముఖ్యత సంతరించుకుంది. ఈ విధానాన్ని దేశంలోని మిగతా రాష్ట్రాలు అనుసరించాయని, చైనా కూడా ఈ విధానాన్ని ప్రశంసించటమే కాక దీనిని అమలు పరిచినట్లు ఈ గ్రంథంలో పేర్కొన్నారు. కర్ణాటక విద్యారంగంలో ప్రవేశపెట్టిన ఈ అర్హత పరీక్ష, 'సెట్' విధానం వల్ల పేదవిద్యార్థులు డాక్టర్లుగా, ఇంజనీర్లుగా దేశవిదేశాలలో మంచి ఉద్యోగాలు పొందటమే కాక, ఈ రాష్ట్రంలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగంలో ప్రపంచ ప్రఖ్యాతి పొందటానికి, మరో సిలికాన్ వ్యాలీగా గుర్తింపు పొందటానికి వీలు కలిగింది అని ఈ గ్రంథంలోని 'సామాన్య ప్రవేశపరీక్ష – ఓ వరం' అనే వ్యాసంలో తెలిపారు. (54వ పేజీ)

'చరిత్రను విస్మరించినవారు చరిత్రను సృష్టించలేరు' అనే మరొక వ్యాసంలో ప్రపంచ చరిత్రలో జరిగిన ఎన్నో పరిణామాలను గురించి తెలిపారు. సమాజం పురోగతిని సాధించాలంటే ఆ సమాజం చరిత్రను మరువ కూడదు అని మొయిలి తన అభిప్రాయాన్ని నిర్దిష్టంగా తెలిపారు.

ఈ గ్రంథంలో మొత్తం 44 వ్యాసాలు 6 భాగాలుగా ప్రచురించారు. మూడో భాగంలో 'గాంధీ జీవితమే ఒక మహా కావ్యం', నాలుగో భాగంలోని 'ప్రపంచీకరణ – సవాళ్లు', 'దేశానికి పెద్ద సవాలు నిరుద్యోగం', ఐదో భాగంలో 'భారతీయ ధర్మం – సమకాలీన చింతన', 'బాపు చూపిన దారి' లాంటి ఎన్నో ఇతర వ్యాసాలు చదవదగ్గవి. ముఖ్యంగా యువత ఈ వ్యాసాలను చదవాలి. ద్రావిడ విశ్వవిద్యాలయం కన్నడ పుస్తకాన్ని తెలుగులోకి అనువదించి, ప్రచురించినందుకు అభినందనలు. భారతదేశం వికాసం కోరే ప్రతి పౌరుడు ఈ పుస్తకం చదువవదగినది. దీని వెల వందరూపాయలు కాకుండా యాభై రూపాయలు పెట్టి ఉంటే బాగుండేది.

కన్నడ మూలం : **ఎం. వీరప్పమొయిలీ**
తెలుగు అనువాదం :
కె. శారద, ఎస్. లక్ష్మీదేవి, బి.ఎన్. శివకుమార్, సీతారాం, జిలుకర శ్రీనివాస్
246 పేజీలు, వెల **రు. 100**
**ప్రతులకు :**
ది రిజిస్ట్రార్, ద్రావిడ విశ్వవిద్యాలయం,
శ్రీనివాసవనం, కుప్పం – 517 425

## సిక్కుల హత్య కేసులో...

ఇందిరాగాంధీ హత్యానంతరం 1984లో జరిగిన సిక్కు వ్యతిరేక అల్లర్ల కేసుల్లో ఆరోపణలెదుర్కొంటున్న జగదీష్ టైట్లర్, సజ్జనార్‌లకు ఏప్రిల్ 2న సిబిఐ క్లీన్‌చిట్ ఇచ్చింది. సిబిఐ తీసుకున్న ఈ నిర్ణయానికి వందలాది మంది సిక్కులు కోర్టువద్ద టైట్లర్, సజ్జన్‌కుమార్, కమల్‌నాథ్ లకు, కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా నినాదాలు చేశారు. ఇందిరాగాంధీ హత్యానంతరం జరిగిన అల్లర్లలో దాదాపు మూడు వేల మంది సిక్కులు ఊచకోతకు గురయ్యారు. టైట్లర్, సజ్జానార్‌ల ప్రోద్బలంతోనే ఈ దహనకాండ జరిగిందనేది అభియోగం. ఈ కేసును ప్రత్యేక కోర్టు ఏప్రిల్ 28కి వాయిదా వేసింది.

## భూనిర్వాసితుల ఎన్నికల బహిష్కరణ

మధ్యప్రదేశ్ రాష్ట్రం ఛింద్వారా జిల్లాలో పెంచ్ నదిపై నిర్మించిన థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ వల్ల 32 గ్రామాలు నీట మునిగి ప్రజలు నిర్వాసితులైనారు. దీనికి నిరసనగా 30 వేలకు పైగా ప్రజలు లోక్‌సభ ఎన్నికలను బహిష్కరించాలని నిర్ణయించుకున్నారనీ, ఈ మేరకు ప్రమాణం కూడ చేయనున్నారనీ కిసాన్ సంఘర్ష్ సమితి (కెఎస్ఎస్) నాయకుడు ఆరాధన భార్గవ తెలిపారు.

## స్విస్ బ్యాంకుల్లో భారత్ ఖాతాలు

స్విస్ బ్యాంకింగ్ అసోసియేషన్ 2006లో వెల్లడించిన నివేదిక ప్రకారం పలువురు భారతీయుల స్విస్ బ్యాంకుల్లో అక్రమంగా దాచిన డబ్బు రు. 60 లక్షల కోట్లు కాగా, ఇప్పుడది 75 లక్షల కోట్లను దాటింది. దేశాల వారిగా చూస్తే భారత్ 1572 బిలియన్ డాలర్లతో అగ్రస్థానంలో ఉంది. తరువాతి స్థానాల్లో రష్యా 610, చైనా 213, బ్రిటన్ 210, ఉక్రెయిన్ 140, మిగతా ప్రపంచ దేశాలు మొత్తం 300 బిలియన్ డాలర్లతో ఖాతాలు కలిగి ఉన్నాయి. డబ్బు దాచుకున్న వారిలో అధిక భాగం పారిశ్రామికవేత్తలు, అవినీతి ఐఏఎస్, ఐపిఎస్, ఐఆర్ఎస్, రాజకీయ నాయకులకు చెందినవే. స్విస్ బ్యాంకుల్లో భారతీయులు దాచిన నల్లడబ్బు మన విదేశీ రుణాల కంటే 13 రెట్లు ఎక్కువ.

## సంస్కరణలకు ఎన్నికల కమిషన్ సిఫారసు

వచ్చే ఎన్నికల నుంచి వర్తింప చేయనున్న సంస్కరణలను ఎన్నికల కమిషన్ సిఫారసు చేసింది. కమిషన్ తీసుకున్న కొన్ని కీలక నిర్ణయాలు – ఏ వ్యక్తి ఒక పదవికి రెండుసార్లకు మించి పోటీ చేసే అవకాశం లేదు. ఒకటికి మించి నియోజకవర్గాల్లో పోటీ చేయకూడదు. ఒక కుటుంబం నుంచి ఒకరు మాత్రమే ప్రజలకు ప్రాతినిధ్యం వహించేందుకు అనుమతించాలి. అక్రమాలకు పాల్పడినట్లు ఆరోపణలు వస్తే వారి అభ్యర్థిత్వాన్ని సస్పెన్షన్‌లో ఉంచాలి. ఎం.ఎల్.ఎ., ఎం.పి. పని తీరు బాగోలేదని నియోజకవర్గ ప్రజలు వెయ్యి మంది లిఖితపూర్వకంగా ఫిర్యాదు చేస్తే ప్రజా ప్రతినిధిని రీకాల్ చేసి, మళ్లీ ఎన్నికలు నిర్వహించాలి. స్థూలంగా ఇవి కొన్ని ముఖ్య సిఫారసులు.

## లిబర్‌హాన్ కమిషన్ గడువు పొడిగింపు

బాబ్రిమసీదు కూల్చివేత సంఘటనపై దర్యాప్తు జరుపుతున్న లిబర్‌హాన్ కమిషన్ గడువును కేంద్రప్రభుత్వం మార్చ్ 31న మరో మూడు నెలలపాటు పొడిగించింది. ఈ రకంగా గడువును పొడిగించడం ఇది 48వ సారి. 1992 డిసెంబర్ 6న జరిగిన సంఘటన దర్యాప్తునకు అదేనెలలో ఏర్పాటు చేసిన ఈ కమిషన్ 1993 మార్చి నాటికల్లా తన నివేదికను సమర్పించాల్సి ఉంది. అప్పటినుండి ఈ కమిషన్ 16 సంవత్సరాల్లో 400 సార్లకు పైగా సమావేశమైంది.

## లోక్‌సభ బరిలో నేరచరితులు

ఈసారి లోక్‌సభకు జరుగుతున్న ఎన్నికల్లో ఆరు జాతీయ పార్టీలు ప్రకటించిన అభ్యర్థుల్లో 70 మంది నేర చరితులున్నారు. వీరిలో 40 మందిపై తీవ్ర అభియోగాలున్నాయి. నేరచరితులకు టికెట్లు ఇవ్వడంలో బిజెపి ముందుంది. క్రిమినల్ కేసులు ఎదుర్కొంటున్న 28 మందికి బిజెపి టికెట్లు ఇచ్చింది. కాంగ్రెస్ 10 మందికి, సమాజ్‌వాది పార్టీ 6 మంది నేరచరిత్రగలవారిని తమ అభ్యర్థులుగా నిలిపాయి. వీరేకాదు, చాలా పార్టీలు అభ్యర్థులను ఇంకా ప్రకటించాల్సి ఉన్నందున నేర చరితుల సంఖ్య పెరిగే అవకాశం ఉంది.

## అసోంలో పత్రిక ఎడిటర్ కాల్చివేత

అసోంలో ప్రాంతీయ పత్రికైన 'అజి' ఎడిటర్-ఇన్-చీఫ్ అనిల్ మజుందార్‌ను మార్చ్ 24న గుర్తుతెలియని వ్యక్తులు కాల్చి చంపారు. ప్రభుత్వంతో చర్చలకు ముందుకు వస్తున్న ఉల్ఫాకు అనుకూలంగా వార్తలు రాస్తున్నందున కాల్పులకు గురైనట్లు తెలుస్తోంది.

## ఎన్నికల సందర్భంగా...

మావోయిస్టుల ఎన్నికల బహిష్కరణలో భాగంగా భద్రతా బలగాలకు మావోయిస్టులకు మధ్య కాల్పులు, పలు సంఘటనలు చోటుచేసుకున్నాయి. చత్తీస్‌గఢ్ రాష్ట్రంలో ఏప్రిల్ 6 నుంచి ఏప్రిల్ 15 వరకు జరిగిన 12 సంఘటనల్లో పోలీసు సిబ్బంది 14 మంది మృతి చెందగా, ఐదుగురు పోలింగ్ సిబ్బంది, ఒక పౌరుడు మరణించారు. 21 మంది పోలీసులు గాయపడ్డారు. 11మంది మావోయిస్టులు చనిపోయారు. బీహార్ రాష్ట్రంలో ఏప్రిల్ 15న రోతాస్ జిల్లాలోని ధన్సా లోయలో జరిగిన ఎదురుకాల్పుల్లో 12 మంది మావోయిస్టులు చనిపోయారు. ఏప్రిల్ 16న గయాజిల్లా సింగ్‌పూర్ గ్రామంలో జరిగిన కాల్పుల్లో ఒక హోంగార్డు, ఒక పోలీసు అధికారి మృతిచెందారు. జార్ఖండ్ రాష్ట్రంలో ఏప్రిల్ 15న లతేహార్‌లో మందుపాతర పేలి బస్సు డ్రైవర్, తరువాత జరిగిన ఎదురుకాల్పుల్లో ఇద్దరు పోలీసు సిబ్బంది, ఐదుగురు మావోయిస్టులు మృతిచెందారు. ఏప్రిల్ 16న లతేహార్‌లో మందుపాతర పేలి ఐదుగురు జవాన్లు, ఇద్దరు పౌరులు మరణించారు. ఒరిస్సాలో మార్చి 29న మల్కన్‌గిరి మాజీ జిల్లాపరిషత్ చైర్మన్‌ను మావోయిస్టులు కాల్చి చంపారు. ఏప్రిల్ 12న కోరాపుట్ జిల్లాలోని దమన్‌జోడి నాల్కొ గనులపై దాడి ఘటనలో 11 మంది సిఐఎస్ఎఫ్ సిబ్బంది, నలుగురు మావోయిస్టులు మరణించారు.

## పాకిస్థాన్‌లో పోలీసు కేంద్రంపై దాడి

పాకిస్థాన్‌లోని లాహోర్ శివార్లలోని పోలీసు శిక్షణ కేంద్రంపై మార్చ్ 30న ఉగ్రవాదులు దాడిచేశారు. ఈ దాడిలో పదుమూడు మంది చనిపోగా, దాదాపు తొంభై మంది గాయపడ్డారు. లాహోర్ శివార్లలో భారత్ సరిహద్దుకు పన్నెండు కిలోమీటర్ల దూరంలో ఉన్న మనావన్ పోలీసు శిక్షణ కేంద్రంపై ఉదయం 7.30 నుంచి మధ్యాహ్నం 3.30 గంటల వరకు దాడి కొనసాగించారు. భద్రతా బలగాల కాల్పుల్లో నలుగురు ఉగ్రవాదులు చనిపోగా, ముగ్గురు పట్టుబడ్డారు.

## జి-20 సదస్సుపై నిరసన

ఏప్రిల్ 2న లండన్‌లో ప్రారంభమైన జీ-20 దేశాల శిఖరాగ్ర సదస్సును వ్యతిరేకిస్తూ ఏప్రిల్ 1న 1200 మంది నిరసనకారులు ర్యాలీలు, ప్రదర్శనలు జరిపారు. లండన్ నగరంలోని బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండ్ కార్యాలయం వెలువల జరిపిన ఈ ఆందోళనలు హింసాత్మకంగా మారాయి. ఈ సందర్భంలో పోలీసులు జరిపిన లాఠీచార్జ్‌లో అనేకమందికి గాయలయ్యాయి. స్పెయిన్, ఇటలీ, అమెరికా తదితర దేశాలకు చెందిన పెట్టుబడిదారీ వ్యవస్థను వ్యతిరేకిస్తూ ఈ ఆందోళనలో పాల్గొన్నారు.

## మీడియాకు మాంద్యం సంక్షోభం

ప్రపంచ ఆర్థిక సంక్షోభం పత్రికలు, ప్రసార సాధనాలపై కూడా ప్రభావం చూపుతోంది. పెద్ద పెద్ద మీడియా సంస్థలు ఖర్చులను తగ్గించేందుకు, సిబ్బందిని తగ్గించడం, ఉన్న సిబ్బందికి జీతాలు తగ్గంచడం లాంటి పనులు చేస్తున్నాయి. న్యూయార్క్‌టైమ్స్, వాషింగ్టన్ పోస్ట్, షికాగో ట్రిబ్యూన్ వంటి ప్రముఖ పత్రికలూ, ఎబిసి, సిబిఎన్ వంటి న్యూస్ ఛానెళ్లు ఇప్పటికే వందల సంఖ్యలో ఉద్యోగులకు ఉద్వాసన పలికాయి. ఆర్థిక సంక్షోభంతో వ్యాపారాలు మందగించడంతో, మీడియా సంస్థలకు వ్యాపార ప్రకటనల ఆదాయం గణనీయంగా పడిపోయింది. నిర్వహణ వ్యయాన్ని భరించడం కష్టంగా మారడంతో, ఖర్చులను తగ్గించేందుకు సిబ్బందిని తొలగిస్తున్నారు. ముద్రణ వ్యయం కూడా పెరగడంతో వార్తాపత్రికలు ముద్రణేతర మార్గాలవైపు పోతున్నాయి. పత్రికలను చదువుకునేందుకు వీలుగా ఈ-రీడర్స్ పరికరాలను వాడుకలోకి తెచ్చేందుకు ప్రయత్నిస్తున్నాయి. ఒక్క అమెరికాలోనే 2007-08 సంవత్సరాల్లో ఏడున్నర వేలమంది పాత్రికేయుల ఉద్యోగాలు పోయాయి.

## ఉత్తర కొరియా రాకెట్ ప్రయోగం

ఉత్తర కోరియా ఖండాంతర క్షిపణిగా ప్రయోగించే వీలున్న తేపోడాంగ్ - 2 రాకెట్‌ను ఏప్రిల్ 5న ప్రయోగించింది. ప్రపంచ దేశాల హెచ్చరికలను బేఖాతరు చేస్తూ ఈ ప్రయోగం చేసింది. ఈ రాకెట్ జపాన్ మీదుగా ప్రయాణించి పసిఫిక్ సముద్రంలో పడిపోయింది. ఈ రాకెట్ ప్రయోగంతో తమ ఉపగ్రహ ప్రయోగం విజయవంతమైందని ఉత్తర కోరియా ప్రకటించింది. ఆరువేల కిలోమీటర్ల దూరంలోని లక్ష్యాలను ఛేదించగల ఈ క్షిపణి 500 కిలోల ఆయుధాలను మోసుకెళ్లగలదు.

## ఎల్‌టిటిఇ కి మరో దెబ్బ

ఎల్.టి.టి.ఇ. ఆఖరి స్థావరం ముల్లైతీవులోని పుదుకుడియిరిప్పులో ఏప్రిల్ 3 నుండి ప్రారంభమైన భీకరపోరులో 420 మంది టైగర్లు హతమయ్యారు. పెద్ద ఎత్తున టైగర్ల ఆయుధాలు స్వాధీనం చేసుకున్నట్లు తెలిపారు. మృతి చెందినవారిలో ఎల్.టి.టి.ఇ. అగ్రనేతలు మహిళా విభాగానికి నేతృత్వం వహిస్తున్న విదుషా, సైనిక విభాగానికి సారథ్యం వహిస్తున్న దీపన్, ప్రభాకరన్ అంగరక్షకుడు గడాఫీ, నాగేశ్, తురగ తదితరులు ఉన్నారని సైన్యం అధికార ప్రతినిధి తెలిపారు.

## క్యూబన్-అమెరికన్లపై ఆంక్షల ఎత్తివేత

క్యూబన్-అమెరికన్లు క్యూబాలోని తమ కుటుంబ సభ్యులను కలుసుకోవడానికి చేసే ప్రయాణాలపై, అక్కడి తమ బంధువులకు నగదు బదిలీపై ఉన్న ఆంక్షలను అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా రద్దు చేశారు. ఎన్నికల ప్రచారంలో ఇచ్చిన హామీలను నిజం చేయడంలో భాగంగా ఈ ఆంక్షలను ఎత్తేశారు. ఈ ఆంక్షల ఎత్తివేతతో అమెరికాలోని 15 లక్షల క్యూబన్- అమెరికన్లు ప్రయోజనం పొందుతారు. మాజీ అధ్యక్షుడు జార్జిబుష్ హయాంలో క్యూబన్ అమెరికన్లు మూడేళ్లకోసారి మాత్రమే క్యూబాను సందర్శించాలని, తమ బంధువులకు 300 డాలర్లు మాత్రమే పంపాలని ఆంక్షలుండేవి. అయితే క్యూబా పై అమెరికా అమలు చేస్తున్న అన్ని ఆంక్షల కంటే క్రూరమైన ఆర్థిక ఆంక్షలను (ఎంబార్గో) ఎత్తివేయాలని క్యూబా మాజీ అధ్యక్షుడు ఫిడెల్ క్యాస్ట్రో అన్నారు. 1962 నుంచి కూబ్యాపై అమెరికా వాణిజ్య, ఆర్థిక ఆంక్షలను అమలు చేస్తున్నది.

## ఇటలీలో భూకంపం

ఇటలీలోని చారిత్రక నగరం ఎల్ అక్విలాలో ఏప్రిల్ 6న తెల్లవారుజామున భూకంపం సంభవించింది. ఈ భూకంపంలో వంద మందికి పైగా మరణించారు. 1500 మందికి పైగా గాయపడ్డారు. రిక్టర్ స్కేల్‌పై 6.3 తీవ్రతతో ఈ భూకంపం విధ్వంసం సృష్టించింది. లక్ష మంది నిర్వాసితులయ్యారు. ఇటలీ రాజధాని రోమ్‌కు 110 కిలోమీటర్ల దూరంలోని ఈ నగర సమీపంలోనే భూకంప కేంద్రం నమోదైంది. ఈ భూకంపంలో అనేక చారిత్రక భవనాలు నేలమట్ట మయ్యాయి. భూకంప ప్రభావం రోమ్‌లో కూడ కనిపించింది.

## రాజప్రాసాదం హత్యలపై విచారణ

నేపాల్ రాజప్రాసాదం నారాయణహితలో 2001లో జరిగిన హత్యలకూ, అనంతరం జరిగిన హెలికాప్టర్ ప్రమాదానికీ సంబంధం ఉందని నేపాల్ ప్రధాని ప్రచండ ప్రకటించారు. హెలికాప్టర్ ప్రమాదంలో రాణి సోదరి మరణించిందనీ, ఈ రెండింటికీ పాల్పడ్డ నిందితులపై న్యాయస్థానంలో విచారణ జరిపిస్తామని ప్రచండ తెలిపారు. రాజప్రాసాదంలో జరిగిన మారణహోమానికి సంబంధించిన వాటిపై నాటి పార్లమెంట్ స్పీకర్ తారానాథ్ రణభట్ ఆధ్వర్యంలో దర్యాప్తు జరుగుతోంది. వీ

# అసహజ మరణాల సూచి సేకర్తల సమావేశం

వీక్షణంలో ఆగస్ట్ 2006 నుంచి 'అసహజ మరణాల సూచి'ని ప్రారంభించాం. మొదట హైదరాబాద్ జిల్లాతో పాటు, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల సమాచారాన్ని కొంత కలుపుకొని ఈ శీర్షిక ప్రారంభమైంది. క్రమంగా 33వ నెలకు చేరుకునేసరికి 22 జిల్లాల సమాచారంతో 'అసహజ మరణాల సూచి' వస్తోంది. ఒక్క పశ్చిమ గోదావరి జిల్లా నుంచి ఈ శీర్షికకు సమాచారం సేకరించాల్సి ఉంది.

అసహజ మరణాల సూచి మొదలుపెట్టడానికి ప్రధాన కారణం వ్యవసాయరంగంలో పెద్ద ఎత్తున జరుగుతున్న ఆత్మహత్యలే. 65 శాతం పైగా జనాభా వ్యవసాయంపై ఆధారపడుతున్న రాష్ట్రంలో జరుగుతున్న రైతుల ఆత్మహత్యలు సామాజిక సంక్షోభానికి ఒక సూచికగా ఉన్నాయి. దేశంలోను, రాష్ట్రంలోను కలిపి గత దశాబ్దన్నర కాలంలో లక్షన్నరకు పైగా రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. వ్యవసాయరంగ సంక్షోభం ప్రత్యక్షంగా పరోక్షంగా వలసలకు, మరిన్ని ఇతర రంగాలలో ఆత్మహత్యలకు కారణమవుతోందన్న విషయం మనందరికీ తెలిసిందే.

ఈ శీర్షికను మరింత సమగ్రంగా, శాస్త్రీయంగా రూపొందించడానికి 'అసహజ మరణాల సూచి' రచయితల సమావేశాన్ని వీక్షణం మొదటిసారి 29 మార్చ్ 2009న హైదరాబాద్‌లోని వీక్షణం కార్యాలయంలో నిర్వహించింది. సమావేశానికి తొమ్మిది మంది సమాచార సేకర్తలు హాజరయ్యారు. ఆదిలాబాద్ నుంచి సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ నుంచి డి. విజయభాస్కర్; కరీంనగర్ నుంచి ఎల్. సంతోష్; నిజామాబాద్ నుంచి ఎం. నర్సయ్య; రంగారెడ్డి నుంచి వి. శంకర్‌రావు; వరంగల్ నుంచి ఎ.కుమార్; అనంతపురం నుంచి ఎం.ఆదిశేషయ్య; గుంటూరు నుంచి బి. అంజమ్మ; విశాఖపట్నం నుంచి కె.వి. రమణ ఈ సమావేశంలో పాల్గొన్నారు.

సమావేశాన్ని ప్రారంభిస్తూ వీక్షణం సంపాదకులు ఎన్. వేణుగోపాల్ ఈ శీర్షిక ప్రారంభించడంలో ఉద్దేశాలను వివరించారు. మహబూబ్‌నగర్ జిల్లా నుంచి ఈ శీర్షికకు పదినెలల పాటు సమాచారం అందించిన రవికుమార్ రోడ్డుప్రమాదంలో 29 ఆగస్ట్ 2007న మరణించారని సమావేశంలో గుర్తుచేసారు.

గ్రామాల్లో ప్రభుత్వ బస్సు సదుపాయం లేక ప్రైవేట్ వాహనాలపై ఆధారపడడం వల్ల రోడ్డు ప్రమాదాల్లో ఎంతోమంది చనిపోతున్నారనీ, రాత్రి కరెంట్ వలన చేనుకు నీళ్లు కట్టడానికి పోయి చనిపోయే రైతులు, అక్రమ సంబంధాల నేపథ్యంలో జరుగుతున్న హత్యలు, చెత్తకుండీల్లో దొరుకుతున్న పసిపిల్లల మృతదేహాలు, తాగి రోడ్డుపక్కన కూలబడి నీళ్లు దొరక్క చనిపోయిన వారు, పురుగులు పట్టిన ఉద్యమకారుల మృతదేహాలు, అన్నం పెట్టే రైతుల, బట్టను ఇచ్చే చేనేత కార్మికుల అకాల మరణాలు, ఇలా మనకు తెలిసినవే ఇన్ని ఉంటే తెలియనివి, లెక్కలోకి రానివి ఇంకెన్నో అని సమావేశానికి వచ్చిన వారు అభిప్రాయపడ్డారు. ఇతర ప్రాంతాల్లో చనిపోతున్న వారిని ఎలా నమోదు చేయాలని అడిగారు.

అవసరాన్ని బట్టి సహజ మరణాలను అసహజ మరణాలుగాను, అసహజ మరణాలను సహజ మరణాలు గాను చూపించే ప్రయత్నం జరుగుతోందన్నారు. నాసిరకం కరెంట్ తీగల వలన కూడా ఎక్కువ ప్రమాదాలు సంభవిస్తున్నాయనే అభిప్రాయం వచ్చింది. చేను చుట్టూ ఉన్న కరెంట్ తీగలతో పశువులే కాక మనుషులు కూడా చనిపోతున్నారని తెలిపారు. రంగారెడ్డి జిల్లాలో ఒకే నెలలో పాముకాటుకు గురై 20 మంది చనిపోయారు. ప్రతినెల ఇలాంటి ప్రత్యేక సమాచారాన్ని విడిగా ఒక రిపోర్ట్‌గా అందిస్తే బాగుంటుందనే అభిప్రాయం వచ్చింది.

ఉన్నత చదువులు చదివిన విద్యార్థులు కూడా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారనీ, చదువులు వారికి ధైర్యాన్ని ఇవ్వలేకపోతున్నాయనీ అన్నారు. ఏజెన్సీలో మరణాలను కూడా వాస్తవాధారంగా నమోదు చేయాల్సి ఉంది. పద్నాలుగేళ్ల లోపు వారి మరణాలకు ఒక కాలమ్ పెడితే బాగుంటుంది. ఈ విధంగా రికార్డ్ చేయడమే కాకుండా వీక్షణం పత్రిక అందరికీ అందేలా, ఆలోచించేవారి సంఖ్యను పెంచేలా కృషి జరిగితే ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుందనే అభిప్రాయం వచ్చింది.

చర్చలో అసహజ మరణాలు నమోదు చేయడంలో వేరువేరు స్థాయిల్లో ఇబ్బందులు ఉన్నాయన్నారు. వర్గీకరణ సమస్య, అన్నీ రికార్డ్ చేయలేని పరిమితి ఉన్నాయన్నారు. అసహజ మరణాలలో అసమగ్ర సమాచారం, రెండోసారి నమోదు కావడం సమస్యలు ఉన్నాయన్నారు. మినహాయింపుల, ప్రత్యేకతల నోట్స్ పెడితే బాగుంటుందన్నారు. కరెంట్ షాక్‌తో చనిపోయేవారి కోసం ఒక కాలమ్ పెడదామన్నారు. మొత్తంగా అసహజ మరణాలన్నీ ప్రభుత్వాల వైఫల్యంగాను, నివారించదగినవి గాను సమావేశంలో పలువురు అభిప్రాయపడ్డారు. అసహజ మరణాల సూచిలో అవసరమయిన కాలమ్‌లు పెంచి, ప్రత్యేక రిపోర్ట్‌లు రాస్తే బాగుంటుందని స్థూలంగా అభిప్రాయం వచ్చింది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 మార్చ్ 2009 నుండి 20 ఏప్రిల్ 2009 వరకు)**

| జిల్లా | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) |
| ఆదిలాబాద్ | 4 | – | 25 | – | – | – | 1 | 3 | – | 1 | 28 | 19 | 11 | – | – | – | 3 | 11 |
| హైదరాబాద్ | – | – | 17 | – | – | – | 10 | 25 | – | – | 32 | 25 | – | – | – | – | 13 | – |
| కరీంనగర్ | 7 | – | 55 | – | – | – | 6 | 5 | – | – | 26 | 26 | 16 | – | – | – | 4 | 6 |
| ఖమ్మం | 3 | – | 22 | – | – | – | 6 | 3 | – | 2 | 12 | 8 | 6 | – | 2 | – | – | 5 |
| మహబూబ్‌నగర్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | |
| మెదక్ | 2 | – | 16 | – | – | – | 6 | 4 | – | – | 33 | 38 | 7 | – | – | – | – | – |
| నలగొండ | 1 | 1 | 19 | – | – | – | 8 | 3 | – | – | 23 | 63 | – | – | – | – | – | 2 |
| నిజామాబాద్ | – | – | 21 | – | – | – | 10 | 1 | – | 9 | 32 | 14 | 4 | – | – | – | – | – |
| వరంగల్ | – | – | 2 | – | – | – | – | 4 | – | 2 | 21 | 9 | 26 | – | – | – | – | – |
| అనంతపురం | 3 | 1 | 16 | – | – | – | 6 | 1 | – | 4 | 22 | 3 | 2 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | 15 | – | – | – | 7 | 7 | – | 9 | 38 | 1 | 8 | – | – | – | – | – |
| కడప | 4 | 1 | 15 | – | – | – | 5 | 9 | – | 2 | 15 | 3 | 4 | – | – | – | – | 1 |
| కర్నూలు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | |
| తూర్పు గోదావరి | – | – | 21 | – | – | – | 8 | 3 | – | 1 | 46 | 26 | 4 | – | – | – | 6 | – |
| గుంటూరు | 1 | – | 12 | – | – | – | 14 | 3 | – | 7 | 30 | 15 | 2 | – | – | – | – | – |
| కృష్ణా | 1 | – | 18 | – | – | – | 11 | 3 | 1 | 2 | 27 | 9 | 3 | – | – | – | – | 3 |
| నెల్లూరు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | |
| ప్రకాశం | 1 | – | 8 | – | – | – | 4 | 8 | – | 2 | 23 | 12 | 1 | – | – | – | – | 4 |
| శ్రీకాకుళం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | |
| విశాఖపట్నం | – | – | 13 | – | – | – | 2 | 3 | – | – | 28 | 13 | 3 | – | – | – | 2 | 2 |
| విజయనగరం | – | – | 12 | – | – | – | 3 | – | – | 2 | 25 | 2 | – | – | – | – | – | 2 |
| **మొత్తం** | **27** | **3** | **307** | **–** | **–** | **–** | **107** | **85** | **1** | **43** | **461** | **286** | **97** | **–** | **2** | **–** | **28** | **26** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. కృష్ణ; మహబూబ్‌నగర్ – ఏసురత్నం; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నలగొండ – డి. మహేష్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపురం – ఎం. ఆదిశేషయ్య; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – బి. దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; కృష్ణా – బి. రమేష్‌బాబు; నెల్లూరు – శ్యాంసుందర్ రావు; ప్రకాశం – కె. మల్లికార్జున్; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. రమణ; విజయనగరం – డి. సుధాకర్;

## వీక్షణానికి మీ చేయూతనందించండి !

ఆరు సంవత్సరాలుగా ప్రతినెలా మీతో సంభాషిస్తూ, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపై కొత్త ఆలోచనలను, వైవిధ్యపూరితమైన చర్చను ప్రోత్సహిస్తూ, మీ ఆదరణ చూరగొంటూ వస్తున్న వీక్షణం తన ఆర్థికస్థితిని కూడ మీతో పంచుకోదలచుకుంటున్నది.

వీక్షణం ఇప్పుడు నడుస్తున్న పద్ధతిలో, పెరుగుతున్న న్యూస్ ప్రింట్ ధరలు, ప్రింటింగ్ ఖర్చులు, కార్యాలయ నిర్వహణ, పోస్టింగ్ వంటి ఖర్చులన్నీ కలుపుకుంటే ఒక్కొక్క ప్రతికి ఉత్పత్తివ్యయం రు. 14 గా ఉంటున్నది. కాగా ప్రతి సంచికకూ చందాదారులు చెల్లించేది రు. 10. అందులో పోస్టేజి ఖర్చులు మినహాయిస్తే వాస్తవంగా చెల్లిస్తున్నది రు. 9 కన్న తక్కువ. పత్రిక విడిప్రతిని దుకాణాలలో కొనుక్కునేవారు రు. 10 చెల్లించి కొనుక్కున్నపటికీ, ఏజెంట్ కమిషన్ పోగా వారి నుంచి పత్రికకు అందేది ఒక్కొక్క ప్రతికి రు. 6 మాత్రమే. అంటే పత్రిక ఒక్కొక్క ప్రతి చందాదారుల విషయంలో రు. 5 లోటుతో, విడిప్రతి కొనుగోలుదారుల విషయంలో రు. 8 లోటుతో నడుస్తున్నదన్నమాట. పత్రిక ఎన్ని ప్రతులు ఎక్కువ అమ్మకమైతే అంత ఎక్కువగా లోటు పెరుగుతుందన్నమాట. ప్రస్తుతానికి ప్రతినెలా రు. 25,000 లోటుతో పత్రిక నడుస్తున్నది. ఏ పత్రిక అయినా తన ఉత్పత్తి వ్యయాన్నంతా పాఠకులనుంచే రాబట్టడం జరగదు. ఉత్పత్తివ్యయంలో కొంతభాగాన్ని ధరగా నిర్ణయించి మిగిలిన భాగాన్ని వ్యాపార ప్రకటనల రూపంలో సేకరించడం ఆనవాయితీ. ఎన్ని ఖర్చులు పెరిగినా గత నాలుగు సంవత్సరాలుగా ధరనుగాని, వార్షిక చందాను గాని పెంచలేదని, వీక్షణంకు ఇప్పటివరకూ ప్రభుత్వ ప్రకటన తప్ప ఇతర ప్రకటనలు కూడా ఎక్కువగా రావడం లేదని మీకు తెలుసు. వీక్షణం ను నిర్వహిస్తున్న సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ సంస్థ సర్వేలు చేయడం ద్వారా సంపాదించిన నిధులను వీక్షణం కొరకు ఖర్చుపెడుతున్నది. ఆ పరిస్థితి ఇంకా ఎక్కువ కాలం కొనసాగే అవకాశం లేదు.

ఈ పరిస్థితిలో వీక్షణంను ఆదుకొని, ఆర్థికవనరులను కల్పించి, మనుగడను సుస్థిరం చేయవలసింది మీరే. ఇది మీ పత్రిక, దీన్ని కాపాడుకోవడం, పది కాలాలపాటు నిలిచేలా చూడడం మీ బాధ్యత.

అందుకోసం

- పాఠకులందరూ చందాలు కట్టవచ్చు.
- ప్రతి చందాదారూ మరొకరిని చందాదారుగా చేర్పించవచ్చు, లేదా మిత్రులొకరికి వీక్షణం సంవత్సర చందా కానుకగా ఇవ్వవచ్చు.
- మీ గ్రామంలో, పట్టణంలో మీకు తెలిసిన దుకాణదారు వీక్షణం తెప్పించేలా, సక్రమంగా బకాయిలు చెల్లించేలా చూడవచ్చు.
- మీకు తెలిసిన వారెవరయినా వ్యాపార ప్రకటనలు ఇవ్వగలిగిన స్తోమత, అధికారం కలిగి ఉంటే వారిద్వారా వీక్షణంకు ప్రకటనలు ఇప్పించవచ్చు.

**వీక్షణంను ఆదుకొండి**

**తెలుగునాట ఇటువంటి పత్రిక ఇది ఒక్కటే, దీని మనుగడకు, విస్తరణకు మీ చేయూతనందించండి**

### చందా వివరాలు

| | | | |
|---|---|---|---|
| సంవత్సర చందా | రు. 120 | మూడు సంవత్సరాల చందా | రు. 350 |
| ఐదు సంవత్సరాల చందా | రు. 550 | పది సంవత్సరాల చందా | రు. 1000 |

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495, ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com
సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

